# త్రైత సిద్ధాంతము

జీవాత్మ



అద్వైతము

ఆత్మ



ద్వైతము

పరమాత్మ



త్రైతము


రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు







# త్రైత సిద్ధాంతము


ఇందూ ధర్మప్రదాత,

సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**






ప్రచురించిన వారు

**ఇందూ జ్ఞాన వేదిక** (Regd.No. : 168/2004)

త్రైత శకము–34

ద్వితీయ ముద్రణ : సం॥ 2012

ప్రతులు : 1000 **వెల : 70 /-**

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక రచనలు

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు

1) త్రైత సిద్ధాంత భగవద్గీత.
2) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
3) ధర్మము-అధర్మము.
4) ఇందుత్వమును కాపాడుదాం.
5) యజ్ఞములు (నిజమా-అబద్దమా?).
6) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
7) సత్యాన్వేషి కథ.
8) మంత్రము-మహిమ (నిజమా-అబద్దమా)
9) శ్రీకృష్ణుడు దేవుడా, భగవంతుడా.
10) గీతా పరిచయము (తెలుగు,ఇంగ్లీషు)
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా)
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) ప్రబోధానందమ్ పాటల జ్ఞానము.
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు. (తెలుగు,ఇంగ్లీషు,కన్నడ)
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా).
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?)
27) వాస్తు శాస్త్రము (సత్యమా-అసత్యమా).
28) తల్లి తండ్రి.
29) గురు ప్రార్థనామంజరి.
30) త్రైతారాధన.
31) సమాధి.
32) ప్రబోధ.
33) సుబోధ.
34) ప్రసిద్ధి బోధ.
35) సుప్రసిద్ధి బోధ.
36) సిలువ దేవుడా?
37) మతాతీత దేవుని మార్గము.
38) సృష్టికర్తకోడ్-963.
39) మతము-పథము
40) ప్రబోధానందం నాటికలు
41) ఇందువు క్రైస్తవుడా?
42) త్రిత్వమా? ద్విత్వమా?
43) నిగూఢ తత్త్వార్థ బోధిని.
44) ఆత్మలింగార్థము.
45) నాస్తికులు-ఆస్తికులు.
46) హేతువాదము-ప్రతివాదము.
47) గుత్తా.
48) ప్రబోధ తరంగాలు.
49) త్రైత సిద్ధాంతము.
50) రూపము మారిన గీత
51) ఉపనిషత్‌లలో లోపాలు.
52) బైబిల్‌లో పవిత్ర వాక్యాలు.
53) ఖురాన్‌లో పవిత్ర వాక్యాలు.
54) ద్రావిడ బ్రాహ్మణ.

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక ప్రసంగాలు

**DVD, VCD's**

1. సంతకము.
2. సాంప్రదాయము.
3. త్రైతశకము.
4. కోడిపుంజు-పాదరసము.
5. యుగము-యోగము
6. నైజం-సహజం.
7. ఆత్మకు వెంట్రుక గుర్తు.
8. పైత్యం-సైత్యం.
9. శైవము-వైష్ణవము.
10. ఇందూమహాసముద్రము.
11. సృష్టి-సృష్టికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేనివిద్య-గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార-ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు
40. బయటి సమాజం-లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవునిజ్ఞానము-మాయమహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము
50. దివ్యఖురాన్-హదీసు.
51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.
56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు - కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము
63. సహజ మరణం-తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము
65. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
66. దేశం మోసం-దేహం మోహం
67. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
68. మేఘం ఒకభూతం-రోగం ఒకభూతం.
69. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
70. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ గోకర్ణ.

## ఇందూ జ్ఞాన వేదిక ప్రచురణలు లభించు చిరునామా

**ప్రబోధాశ్రమము** (శ్రీకృష్ణమందిరము)
చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 9866512667, 9951675081, 9948191506, Fax : 08558-225966.

**ప్రబోధాశ్రమము** (కొత్తకోటశాఖ) Cell : 9705864675.
పోలీస్‌స్టేషన్ దగ్గర, కర్నూలురోడ్, కొత్తకోట (మం), మహబూబ్‌నగర్ (జిల్లా).

**కె.లక్ష్మీనారాయణాచారి** (ప్ర.సభ్యులు) Cell : 9440556968.
బ్యాటరీషాప్, నియర్ ఎస్.ఐ.యు చర్చి, మార్కెట్‌స్ట్రీట్, ధర్మవరం, అనంతపురం జిల్లా.

**వి. రామక్రిష్ణన్** (ప్ర.సభ్యులు) Cell : 9652755110
డోర్ నెం.9/32, నిరంజన్ టైమ్స్, తహశీల్దార్ ఆఫీస్ ఎదురుగా,
నేతాజిరోడ్డు కుప్పం, చిత్తూరు జిల్లా-517425.

**బాలం లక్ష్మీ నరసింహులు** (ప్ర.సభ్యులు)
కదిరి రోడ్డు, రాజానగర్, నీరుగట్టువారి పల్లి, మదనపల్లి,
చిత్తూరు జిల్లా - Pin : 517325. Cell : 9440825533, 8519938999

**ఇందూ జ్ఞాన వేదిక** (రాష్ట్రకార్యాలయము) Fax : 040-24146006.
Shop No.2-41/3, శ్రీదేవికాంప్లెక్స్, ప్రభాత్‌నగర్, చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్ - Pin : 500060., 9848057951, 9491877239, 9848590172.

**పోటు వెంకటేశ్వర్లు (గురుజీ)** Cell : 9848574803
ధన్వంతరి హెల్త్ కేర్ సెంటర్, పెండ్యాల కోటిలింగం పెట్రోల్‌బంక్ ఎదురుగా,
హుజూర్‌నగర్, నల్లగొండ (జిల్లా) Pin : 508204.

**టి. వీరనారాయణ రెడ్డి** (Ph:08627-220619, Cell : 9494618322)
బట్టేపాడు గ్రా॥ ఆత్మకూరు మం॥, నెల్లూరు (జిల్లా)., Pin : 523322.

**బి.శాంతరాజు** (ప్ర.సభ్యులు) Cell : 9640526520, 9573335559
ఇంటి నెం.20-18/1-22, ప్లాట్ నెం.43, క్రిష్ణరాజపురము, విజయనగరము (జిల్లా).

**డా॥బి.ధర్మలింగాచారి** (ప్ర.సభ్యుడు) (08966-275208, 9704911737)
శ్రీ కనక మహాలక్ష్మి క్లినిక్, Opp. R.T.C బస్టాండ్ Out Gate,
**విశాఖ రోడ్, శృంగవరపు కోట (S కోట), విజయనగరము (జిల్లా).**

**మంగం చంటి** (ప్ర.సభ్యులు) (9948663149, 9440134499)
డోర్ నెం.50-93-2/22, శ్రీనివాస రెసిడెన్సి, సీతమ్మపేట, గురుద్వార జంక్షన్,
సాయిబాబా గుడిప్రక్కన, శాంతిపురం, విశాఖపట్నము.

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యులు) Cell : 9494248963, 9959779187.
మెయిన్ రోడ్డు, బొద్దం (గ్రా), రాజాము (మం), శ్రీకాకుళం (జిల్లా).

# త్రైత సిద్ధాంతము

ముందు సిద్ధాంతము అను పదము యొక్క వివరమును గురించి తెలుసుకొందాము. సిద్ధాంతము అను పదములో రెండు శబ్ధములు ఇమిడి ఉన్నవి. వాటిని విడదీసి చూస్తే సిద్ధ+అంతము అని రెండు భాగముల శబ్ధములు తెలియుచున్నవి. అంతము అనగా చివర అని అర్థము కలదు. సిద్ధ అనగా లభించునది అని అర్థము. సిద్ధాంతము అనగా చివర లభించున దని అర్థము. ఒక పనిని చేస్తే చివర దాని ఫలితము లభించును. ఒక లెక్కను (గణితములో) చేస్తే దానికి చివరిలో జవాబు దొరుకును. ఈ విధముగా ఒక పనిలోని చివరి ఫలితమునుగానీ, ఒక గణిత లెక్కలోని జవాబునుగానీ, పద్ధతి ప్రకారము సిద్ధాంతము అని అనవచ్చును. తప్పని సరిగా చివరిలో ఫలితమును చూపునది సిద్ధాంతము అయినప్పుడు, సిద్ధాంతము ఏ కార్యములోనైన ఉండవచ్చును. శాస్త్రము ఒక పనియొక్క పూర్తి వివరమును తెలుపును. శాస్త్రము తెల్పిన వివరము ప్రకారము దానిని చేసినప్పుడు, శాస్త్రము చెప్పిన ఫలితము కనిపించినప్పుడు, దానిని శాస్త్రీయత అంటాము. భూమిమీద గల ఆరు శాస్త్రములలో ఎన్నో సిద్ధాంతములు గలవు. శాస్త్రమున్నప్పుడు దానికి శాస్త్రీయత ఉన్నట్లు, సిద్ధాంతమున్నపుడు సిద్ధి (ఫలితము) తప్పనిసరిగా ఉంటుంది. ఒక శాస్త్రములో ఎన్ని సిద్ధాంతము లైనా ఉండవచ్చును. గణితశాస్త్రము, ఖగోళ శాస్త్రము, రసాయన శాస్త్రము, భౌతికశాస్త్రము అను నాలుగు శాస్త్రములలో మన శాస్త్రవేత్తలు ఎన్నో సిద్ధాంతములను కనుగొన్నారు. ఖగోళశాస్త్రములో సూర్యుని చుట్టు భూమి తిరుగుచున్నదనీ, సూర్యుడు ఒక గోళమనీ, భూమి కూడ ఒక గోళమని 'గెలీలియో' తన సిద్ధాంతమును తెలుపగా అది శాస్త్రీయమైపోయినది. అట్లే 'న్యూటన్' అనునతడు భూమికి ఆకర్షణశక్తి యున్నదని తన సిద్ధాంతమును తెలిపాడు. ఇట్లు ప్రపంచ సంబంధమైన గణిత, ఖగోళ, రసాయన, భౌతికము

అను నాలుగు శాస్త్రములలో మనుషులు ఎన్నో సిద్ధాంతములను కనుగొన్నారు. అందువలన ఆ నాలుగు శాస్త్రములలో ఎంతో పురోగతి పొందిన మానవజాతి, ఆయా శాస్త్రముల శాస్త్రీయత ద్వారా ఎన్నో సుఖములను అనుభవిస్తున్నది.

షట్‌శాస్త్రములు తప్ప ఇతర శాస్త్రములు భూమిమీద లేవని అందరూ జ్ఞాపకముంచుకోవలెను. వాటిలో నాలుగు శాస్త్రములు చాలా అభివృద్ధి చెందాయి. వాటి ఫలితములను (శాస్త్రీయతను) మనము అనుభవిస్తున్నాము. గణితశాస్త్రములో ఎన్నో సూత్రములు గలవు. ఆ సూత్రములనే ఆ శాస్త్రములోని సిద్ధాంతములనవచ్చును. ఒక శాస్త్రములోని సిద్ధాంతములన్నియు వేరువేరు మనుషులచేత, వేరువేరు దేశములందు కనుగొనబడిన వని చెప్పవచ్చును. ఇంతవరకు మనము చెప్పుకొన్న నాలుగు శాస్త్రములు, ఎంతోమంది శాస్త్రజ్ఞుల చేత కనుగొనబడిన సిద్ధాంతముల (సూత్రముల) వలన అభివృద్ధి అయినవి. ఆరు శాస్త్రములలో ఐదవ శాస్త్రము జ్యోతిష్యశాస్త్రముకాగా, ఆరవశాస్త్రము బ్రహ్మవిద్యాశాస్త్రము. ఐదవదైన జ్యోతిష్యశాస్త్రముతో సహా మిగతా నాలుగు శాస్త్రములలోని సూత్రములను మనిషి చెప్పవచ్చునుకానీ, ఒకేఒక బ్రహ్మవిద్యా శాస్త్రములోని సూత్రములనూ, సిద్ధాంతములనూ ఏ మనిషీ చెప్పలేడు. దానిని గురించి దేవుడు చెప్పవలసిందే. మనుషులు చెప్పగలిగిన జ్యోతిష్యశాస్త్రములోని సిద్ధాంతములను, ఎవరూ కృషి చేసి చెప్పలేని దానివలన, భూమిమీద జ్యోతిష్యశాస్త్రము నామమాత్రము మిగిలి ఉన్నది. జ్యోతిష్యము శాస్త్రమే అయినా, కొందరు దానిని శాస్త్రమేకాదను స్థితికి వచ్చారు. పరిశోధన లేనిదానివలన, సిద్ధాంతములను ఎవరూ కనుగొనని దానివలన, జ్యోతిష్య శాస్త్రము అభివృద్ధి కాలేదు. అంతమాత్రమున ఒక శాస్త్రమునే లేదనడము

పూర్తి పొరపాటగును. జ్యోతిష్యము శాస్త్రమే అయినా దానిలో చివరికి ఫలితమునిచ్చు సిద్ధాంతము లేనిదానివలన అది శాస్త్రమా! కాదా! అను చర్చకు కూడా వచ్చినది. జ్యోతిష్యములో కూడా కొన్ని సూత్రములను కొందరు కనుగొని చెప్పినా, అవి ఎవరికీ తెలియకుండా పోయినవి. కొందరు తమకు జ్యోతిష్యములోని సూత్రములు ఏమాత్రము తెలియకున్నా, వారికి ఇష్టమొచ్చినట్లు నమ్మించి చెప్పుట వలన, చివరికది ఫలితమును ఇవ్వక పోవడము వలన, జ్యోతిష్యము అసత్యము అని అందరికీ తెలియుట వలన, జ్యోతిష్యము మూఢనమ్మకమని కొన్ని ప్రసార ఛానళ్ళు తమ టీవీలలో చూపడము వలన, జ్యోతిష్యశాస్త్రము యొక్క ఉనికినిగానీ, దాని సిద్ధాంతము లను గానీ ఎవరూ తెలియకుండా పోయారు.

భూమిమీద అన్ని శాస్త్రములకంటే ముందు పుట్టిన శాస్త్రము ఆరవదైన బ్రహ్మవిద్యాశాస్త్రము. అయితే బ్రహ్మవిద్యా శాస్త్రము ముందే సంపూర్ణముగా తెలుపబడినదని తెలియని మనుషులు కొందరు, తాము కొంత ప్రయత్నము చేసి, తమకు తెలిసిన సూత్రములను చెప్పగలిగారు. అయితే వారు చెప్పిన సూత్రములన్నిటిలో శాస్త్రీయత లేనందువలన అవి అన్నియు దేవుడు చెప్పిన జ్ఞానము ముందర ప్రాణములేనివై, బలములేనివై పోయాయి. దేవుడు చెప్పిన జ్ఞానమును చూచిన తర్వాత మనుషులు చెప్పిన జ్ఞానము ఎవరికీ రుచించదు. దేవుని జ్ఞానము తెలియనంతవరకు మనుషులు చెప్పిన జ్ఞానము బాగా కనిపించినా, తర్వాత దేవుడు చెప్పిన జ్ఞానమును తెలిసినప్పుడు దానిముందర ఎవరి జ్ఞానమైనా అశాస్త్రీయముగా కనిపించును. అందువలన ఆరవ శాస్త్రములో దేవుడు చెప్పినవే సిద్ధాంతములుగానీ, మనుషులు చెప్పినవి సిద్ధాంతములుకావు. వేరువేరు శాస్త్రములకు, వేరువేరు సిద్ధాంతములను, వేరువేరు మనుషులు చెప్పి

యుందురు. బ్రహ్మవిద్యా శాస్త్రములో మాత్రము దేవుడు చెప్పిన సిద్ధాంతములే ఉండును. అందువలన బ్రహ్మవిద్యాశాస్త్రమును దేవుని శాస్త్రము అని అంటాము. మిగతా ఐదు శాస్త్రములు ప్రపంచమునకు సంబంధించిన శాస్త్రములని చెప్పుచున్నాము. చెప్పబడిన ఫలితము చివరిలో ప్రత్యక్షముగా కనిపింపజేయునది సిద్ధాంతము అని తెలుసుకొన్నాము కదా! ప్రపంచ సంబంధ నాలుగు శాస్త్రములలోని సిద్ధాంతముల ఫలితములను మనిషి ఆచరించి అనుభవించుచున్నాడు.

మనిషి అనేక రంగాలలో అనేక పరిశోధనలు చేసి, అనేక సిద్ధాంతములను కనుగొని వాటి ఫలితమును అందరికీ అందివ్వగలిగారు. క్రీ.శ. 1865లో జేమ్సుక్లార్కు మేక్స్‌వెల్ (James Clarke Maxwell) అను శాస్త్రజ్ఞుడు తన పరిశోధనలో విద్యుత్ అయస్కాంతశక్తిని తయారుచేసి, ఆకాశంలోనికి ప్రవేశపెడితే నీటి అలలు వలె చుట్టూ ప్రయాణిస్తుందని కనుగొనగలిగాడు. తర్వాత ఇటలీదేశస్థుడైన 'మార్కోని', విద్యుత్ అయస్కాంత తరంగాలలోనికి శబ్దతరంగాలను కలిపితే అవి అయస్కాంత తరంగాల ద్వారా ఆకాశంలో ప్రయాణించగలవని కనుగొని, తన సిద్ధాంతమును అమలుచేసి, రేడియోను కనుగొన్న మొదటి వ్యక్తి అయినాడు. విద్యుత్ అయస్కాంత తరంగాలు ఒక సెకండుకు 1,86,000 మైళ్ళ దూరము ప్రయాణించగలవు. అదే కిలోమీటర్లలో అయితే 2,97,600 కిలోమీటర్ల దూరము ప్రయాణించగలవు. విద్యుత్ అయస్కాంత తరంగములు, కాంతి కిరణవేగముతో సమానముగా ప్రయాణించుట వలన, రేడియో కేంద్రము నుండి బయలుదేరిన రేడియో వార్తలను ఆలస్యము లేకుండా వినగలుగు చున్నాము. తర్వాత 1923 సంవత్సరము "జాన్‌లోగి బయిర్డు" అనే శాస్త్రవేత్త నేడు మనము చూస్తున్న టెలివిజన్‌ను కనుగొనగలిగాడు. జాన్

లోగిబయిర్డు, దృశ్యమును విభజించి విద్యుత్ అయస్కాంత తరంగాలలోనికి తన యోచన ద్వారా మార్చగలిగి చివరకు దూరదర్శన్‌ను సాధ్యము చేశాడు.

ఇదంతా ఎందుకు చెప్పుచున్నానంటే, ఏ శాస్త్రములో అయినా సిద్ధాంతమనునది ఒక మనిషికి ఎలా తెలియబడుచున్నదో, మనకు తెలియా లంటే ముందు ఇదంతా తెలుసుకోవాలి. సిద్ధాంతము అంటే చివరిలో ఫలితమును ఇచ్చునది అని తెలుసుకొన్నాము. ఒక సూత్రమును (సిద్ధాంతమును) అనుసరించి కార్యమును చేయగా అందులో దాని ఫలితము లభించుచున్నది. మొదట క్రీ.శ. 1865వ సంవత్సరము మేక్స్‌వెల్ అనునతడు పరిశోధన చేసి విద్యుత్ అయస్కాంత శక్తిని ఆకాశములోనికి కలుపవచ్చునని కనుగొన్నాడు. ఇప్పుడు ఇక్కడ పూర్తి విశ్లేషణ చేసి చూస్తాము. మేక్స్‌వెల్ అనునతడు ఒక మనిషి. అతడు అందరిలాగ ఊరక ఉండక పరిశోధన చేశాడు. పరిశోధనను విశ్లేషించి చూచితే, శోధన అనగా వెదకడము అని అర్థము. పరిశోధన అనగా బాగా వెదకడము, క్రొత్త విధానముతో వెదకడము అని అర్థము. ఎవరు వెదికినా, ఎంత వెదికినా, కనిపించవలసినది ఎప్పుడు కనిపించినా ఉన్నదే కనిపిస్తుంది కదా! లేనిది ఎటూ కనిపించదు. మన ఇంటిలో మన పెద్దలు దాచిపెట్టిన వస్తువులు వెదకంగా, వెదకంగా ఇంటిలోని వారికి ఎవరికో ఒకరికి కనిపించి నట్లు, సృష్ట్యాదిలోనే దేవుడు తయారు చేసిన విధానములనే మనిషి కనుగొను చున్నాడు. వెదికితే కనిపించింది అంటే, అది ముందే అక్కడ తప్పక ఉంటుంది. ఉన్నదానినే మనిషి శోధించి కనుగొనుచున్నాడు.

ఐదు శాస్త్రములకు సంబంధించిన ఏ సిద్ధాంతమైనా మనిషి చేత కనుగొనబడుచున్నది. మనిషి ఒక సిద్ధాంతమును కనుగొన్నాడు అంటే మనిషి కంటితో చూచి కనుగొన్నాడా? చేతితో తాకి కనుగొన్నాడా? ఏ

విధముగా కనుగొన్నాడు అని ప్రశ్నించుకొని చూస్తే, ఏ సిద్ధాంతమునూ మనిషి యొక్క జ్ఞానేంద్రియముల చేతగానీ, మనస్సు యొక్క జ్ఞాపకము చేతగానీ కనుగొనలేదు. బుద్ధియొక్క ఆలోచనలచేతగానీ కనుగొనలేదు. జ్ఞానేంద్రియముల చేతగానీ, మనస్సు చేతగానీ, బుద్ధియొక్క ఆలోచనలచేత గానీ తెలియనప్పుడు, ఇక తెలియజేయు సామర్థ్యముగలది శరీరములో ఏ భాగము లేనప్పుడు, మనిషికి తెలియబడు సిద్ధాంతము లేక మనిషి కనుగొన్న సిద్ధాంతము, దేనిచేత కనుగొనబడినదని ఎవరైనా ప్రశ్నించవచ్చును. దానికి జవాబును జాగ్రత్తగా వెదికితే ఈ విధముగా చెప్పవచ్చును. మనిషికున్న ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా, శరీరముకంటే వేరుగానున్న బయటి విషయములను కనుగొనవచ్చును. శరీరమునకు బయటలేని దేనినీ మనిషి ఐదు జ్ఞానేంద్రియముల ద్వారా తెలియలేడు. బయట ఎక్కడా లేని విషయమును మనిషి తన శరీరములోపలే వెదకవలెను. మనిషి శరీరములోపల వెదకడము రెండు రకములు కలవని చెప్పవచ్చును. ఒకటి ముందే తెలిసియున్న దానిని వెదకడము. రెండవది ముందు ఎవరికీ తెలియని దానిని వెదకడము. ముందే తెలిసిన దానిని బుద్ధిచేత **ఆలోచించి** వెదకడము. ముందు తెలియని దానిని బుద్ధిచేత **యోచించి** చూడడము. ఆలోచిస్తే ఉన్నది తెలుస్తుంది. యోచిస్తే లేనిది తెలియబడుతుంది. ఇక్కడ గమనిస్తే బుద్ధి కొంత తేడాతో రెండు పనులను చేయగలుగుచున్నది. ఒకటి ఆలోచన, రెండు యోచన. రెండూ ఒకటే కదా! అని ఎవరైనా అడిగితే రెండూ ఒకటికాదు, ఆలోచన వేరు, యోచనవేరని చెప్పవచ్చును.

లోచనము అనగా చిన్నదానిని పెద్దగా చూపు అద్దము (భూతద్దము) అని చెప్పవచ్చును. ఆలోచన అనగా ఒక విషయమును పూర్తిగా అద్దములో అన్ని విధముల చూడడము అని అర్థము. యోచన అనగా పూర్తిగా తెలియని

విషయమును గురించి తెలుసుకోవాలను ఉద్దేశముతో పట్టుదలగా కాచుకొని చూడడము. ఆలోచన అను భూతద్దము విషయమును విపులముగా చూపును. యోచనలో ఆత్మయే స్వయముగా జవాబును లేక వివరమును అందించును. తెలియని విషయమును గురించి యోచించువానికి ఆత్మ విషయమును గురించిన జవాబులను అందించినప్పటికీ, ఆత్మ జీవునికిగానీ, బుద్ధికిగానీ కనిపించకుండా, ఏమాత్రము తెలియకుండా ఉండి, బుద్ధికి కావలసిన జవాబులను అందించుట వలన, జీవునికీ బుద్ధికీ ఆత్మపాత్ర అర్థము కాకుండ పోయి, తామే స్వయముగా ఆ విషయమును తెలుసు కొన్నట్లు అహము జీవునికి చెప్పుట వలన, జీవుడు నేనే ఆ విషయమును కనుగొన్నాను అనీ, ఎవరికీ తెలియని సిద్ధాంతము తనకు తెలిసినదనీ భ్రమించుచున్నాడు. ఆత్మ బుద్ధి యోచించు విషయమునకు, ఇలా చేస్తే ఈ ఫలితము వచ్చును. తర్వాత ఈ విధముగా చేస్తే ఫలానా మార్పువచ్చును. తర్వాత ఆ మార్పును ఈ విధముగా సవరించితే చివరకు ఈ కార్యము ఇలా నెరవేరునను జవాబులను లేక వివరములను నేరుగా బుద్ధికి అందివ్వడము వలన, తన మెదడులోనే ఎవరికీ తెలియని యోచనలు వచ్చినవనీ మనిషి అనుకోవడము జరుగుచున్నది. తనకు వచ్చిన వివరము అంతకుముందు ఎక్కడా లేనిదిగా ఉండుట వలన, దానిని అనుభవ పూర్వకముగా మనిషి చేసి చూచును. అలా చేసినప్పుడు తన యోచనకు అందిన విధముగా ఫలితము వచ్చును. ఒక మనిషికి క్రొత్తగా యోచనకందిన దానిని ప్రయోగము చేసి చూచినప్పుడు తన బుద్ధికి అందిన ఫలితము వచ్చును. దానినే సిద్ధాంతము అంటాము. ఆ సిద్ధాంతము ప్రకారము ఎవరికైనా అదే ఫలితము వచ్చును. అయితే మొదట యోచించిన వాని బుద్ధికి, ఆత్మ అందించిన వివరమును గురించి "ఎవరికీ తెలియనిది

నాకు ఎలా అందినది? నా బుద్ధికి అందించినవాడు ఎవడు? అని మనిషి ఏమాత్రము అనుకోవడములేదు. తానే స్వయముగా ఆ విషయమును కనుగొన్నట్లు, ఆ విషయము అందరికీ తెలియునట్లు, తనకు తెలిసిన సిద్ధాంతము ముందర తన పేరును పెట్టుకొని, జరుగబోవు కాలములో ఫలానా వ్యక్తి ఈ సిద్ధాంతమును కనుగొన్నాడని తెలియునట్లు చేసు కొంటున్నారు. డార్విన్ మొదట తనకు తెలిసిన సిద్ధాంతము ముందర డార్విన్ సిద్ధాంతమని పేరు పెట్టుకోవడము జరిగినది. అలాగే న్యూటన్ కూడా మొదట తనకు తెలిసిన సిద్ధాంతము ముందర న్యూటన్ సిద్ధాంతమని తన పేరును పెట్టుకొన్నాడు.

ఈ విధముగా బుద్ధికి ఆత్మ అందించిన సిద్ధాంతమును, ఏమాత్రము ఆత్మజ్ఞానములేని మనిషి, తానే ఆ సిద్ధాంతమును కనుగొన్నానని చెప్పుకొను చున్నాడు. వివరము తెలియని ప్రజలు దానినే నమ్ముచున్నారు. రేడియోను మొదలుకొని నేటి కంప్యూటర్ల వరకు, టెలిఫోన్ మొదలుకొని నేటి ఇంటర్ నెట్‌వరకు, సైకిల్ మొదలుకొని నేటి రాకెట్ల వరకు, టపాకాయ మొదలుకొని నేటి అణుబాంబులవరకు, మనిషికి కావలసిన అన్ని పరికరములను ఆత్మ మనిషి యోచనకు అందించి తెలిపి, తాను తెలిపిన వాటిని సిద్ధాంతములుగా అందరికీ ఫలితము దక్కునట్లు చేయగా, ఇంతవరకు తనకుగానీ, ఎవరికి గానీ తెలియని విషయము తనకు ఎలా తెలిసిందనీ, ఎవరు తెలిపారని ఏమాత్రము మనిషి ప్రశ్నించుకోకుండా, తానే ఆ విషయమును కనుగొన్నా నని శుద్ధ అబద్ధమును చెప్పుచున్నాడు. ప్రపంచములోని శాస్త్రవేత్తలందరూ తాము ప్రకటించిన సిద్ధాంతములు తమవికావనీ, తమకు తెలియకుండా ఉన్నవాటిని తాము ఇంకొకరి సహాయముతో చెప్పగలిగామనీ, ఏమాత్రమూ అనుకోవడము లేదు. భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తియోగమను

అధ్యాయమున 15వ శ్లోకములో "నేను సకల జీవరాసుల మెదడునందు నివాసమున్నాను. నా వలననే స్మృతి, ఊహ, జ్ఞానము మీకు కల్గుచున్నవి." అని దేవుడు చెప్పినప్పటికీ, మనిషి మాత్రము దేవుడు చెప్పిన మాటను మరచి స్మృతి, ఊహ, జ్ఞానము అన్నీ నావే అంటున్నాడు.

ఏ సిద్ధాంతమైనా అది ఆరు శాస్త్రములలోనిదే అయివుంటుంది. గణిత, ఖగోళ, రసాయన, భౌతిక, జ్యోతిష్య అను ఐదు శాస్త్రముల సిద్ధాంతములను ఆత్మ మనిషి బుద్ధికి అందివ్వగా, మనిషి ద్వారా ఐదు శాస్త్రముల సిద్ధాంతములు మిగతా వారికి తెలియుచున్నవి. అలా ఆత్మ చూపగా కనిపించిన సిద్ధాంతములను విద్యార్థులకు బోధనాశాలలయందు పాఠములుగా బోధించుచున్నారు. ఈ విధముగా ఒక మనిషిలో తెలియబడిన ఒక శాస్త్రము యొక్క సిద్ధాంతము అందరికీ తెలిసిపోవుచున్నది. ఇకపోతే ఆరవశాస్త్రమైన బ్రహ్మవిద్యాశాస్త్రము యొక్క సిద్ధాంతములు మాత్రము తాజాగా ఎవరూ కనిపెట్టినవి కావు. సృష్ట్యాదిలోనే దేవుడు తన సిద్ధాంతము లను బహిర్గతము చేసియుంచాడు. అందువలన వాటిని క్రొత్తగా ఎవరూ కనిపెట్టవలసిన అవసరములేదు. సృష్ఠి మొదటిలోనే దేవుడు చెప్పిన బ్రహ్మ విద్యాశాస్త్రము యొక్క సిద్ధాంతములను వివరించి ఎవరైనా చెప్పవచ్చును కానీ, క్రొత్తగా కనుగొని చెప్పు సిద్ధాంతములు ఉండవు. ఇప్పుడు కొందరు ఒక ప్రశ్న అడుగవచ్చును. అదేమనగా! "ఈ కాలములో కూడా బ్రహ్మవిద్య అయిన దేవుని జ్ఞానములో సిద్ధాంతములను చెప్పినవారున్నారు కదా! అటువంటి వారిలో అద్వైత సిద్ధాంతమును ప్రకటించిన ఆదిశంకరాచార్యుల వారున్నారు. విశిష్టాద్వైతమును ప్రకటించిన రామానుజాచార్యులవారున్నారు. అలాగే ద్వైత సిద్ధాంతమును కనిపెట్టిన మధ్వాచార్యులవారున్నారు. వారి విషయమటుంచి ప్రస్తుతము ఈ గ్రంథము వ్రాయుచున్న ఆచార్య

ప్రబోధానందయోగీశ్వరులైన మీరు త్రైత సిద్ధాంతమని పేరుపెట్టి మీరు కూడా సిద్ధాంతకర్తలైనారు కదా! దేవుడు బ్రహ్మవిద్యలోని అన్ని సిద్ధాంతము లను ముందే తెలిపియుంటే, ఇప్పుడు మీరు ఎలా మీ సిద్ధాంతములను తెలిపారు? సిద్ధాంతకర్తలు ఎలా అయ్యారు? ఐదుశాస్త్రములయొక్క శాస్త్రవేత్తలు ఆత్మ తెలిపిన సిద్ధాంతములను తమ సిద్ధాంతములుగా చెప్పుకొని అబద్ధమాడారు అని అన్న మీరు, దేవుడు ముందే చెప్పిన సిద్ధాంతములను తిరిగి ఇప్పుడు తెలుపుచూ, ఇవి మా సిద్ధాంతములని చెప్పుకోవడమును చూస్తే ఏమనాలి? మీరు కూడా మిగతా శాస్త్రవేత్తలవలె అసత్యమాడినవారు కాదా!" అని అడుగవచ్చును. ఈ ప్రశ్నకు జవాబు చెప్పవలసిన బాధ్యత మాకున్నది, కావున మేము ఈ విధముగా జవాబు చెప్పుచున్నాము చూడండి.

అద్వైత సిద్ధాంతమును ఆచరించుచు, మాది అద్వైత పీఠము అని చెప్పుచున్న ఒక స్వామీజీవద్దకు పోయి, శంకరాచార్యులవారు అద్వైత సిద్ధాంతమును ఏ సంవత్సరము చెప్పాడని అడిగాము. దానికి ఆ స్వామీజీ క్రిందికి, పైకి చూచి "ఏమయ్యా అద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించి లోకమునకు చాటిన జగద్గురువును సాదాసీదా మనిషిని అడిగినట్లు అడుగుచున్నావు. కొంచెమైనా మంచీ, మర్యాద తెలియకుండా మాట్లాడితే ఎలాగ? ఈ కాలములో కూడా శంకరాచార్య అను పేరు కల్గినవారు చాలామంది ఉన్నారు. నీవు శంకరాచార్య అని అడిగితే సాధారణ మనిషిని అడిగినట్లు ఉండును. అందువలన జగద్గురు ఆదిశంకరాచార్య అనిగానీ, అద్వైత సిద్ధాంతకర్త ఆది శంకరాచార్య అనిగానీ సంబోధించి అడగవలెను" అన్నారు. తర్వాత ఆయన నోటిగుండానే విశిష్టాద్వైత సిద్ధాంతకర్త రామానుజా చార్యులవారున్నారనీ, వారి సిద్ధాంతమునకు వీరి సిద్ధాంతమునకు చాలా తేడాయున్నదనీ, అద్వైతులకు శివుడు ఆరాధ్య దైవమనీ, విశిష్టాద్వైతులకు

విష్ణువు ఆరాధ్యదైవమనీ విన్నాను. ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. బ్రహ్మవిద్యాశాస్త్రములోనున్న సిద్ధాంతములన్నిటినీ, దేవుడు ముందే తెలిపాడని చెప్పడము వలన, ప్రస్తుత కాలములో ఎవరు మేము సిద్ధాంతకర్తలమనినా అది అసత్యమే అని చెప్పవచ్చును. ఆ లెక్క ప్రకారము జగద్గురు శంకరా చార్యులు చెప్పిన అద్వైతమునుగానీ, రామానుజాచార్యులు చెప్పిన విశిష్టాద్వైతమునుగానీ వీరు చెప్పకముందే దేవుడే చెప్పియున్నాడు. అందువలన వీరు ఆ సిద్ధాంతకర్తలు కాదనీ, వీరు ఆ సిద్ధాంతములను బోధించిన వారు మాత్రమేనని చెప్పవచ్చును.

దేవుడు భగవంతుడై భూమిమీదకు వచ్చి భగవద్గీతను బ్రహ్మవిద్యా శాస్త్రముగా బోధించాడు. భగవద్గీతలో అద్వైతముగల శోక్లములున్నాయి. అట్లే విశిష్టాద్వైతముగల శ్లోకములున్నాయి. ఐదువేల సంవత్సరముల క్రిందట భగవంతుడు భగవద్గీతను చెప్పితే, రెండువేల సంవత్సరముల క్రిందట జగద్గురు ఆది శంకరాచార్యులు అద్వైత సిద్ధాంతమును చెప్పినప్పుడు, ఈ సిద్ధాంతము భగవద్గీతలో ఫలానా శ్లోకమునందు ఉన్నదని చెప్పియుంటే ఎంతో బాగుండేది, సత్యమును చెప్పినట్లుండేది. అట్లు కాకుండా అద్వైతమును దేవుడు ముందే చెప్పాడని చెప్పకుండా, ఇప్పుడు తాను కనుగొన్నట్లు చెప్పుట వలన ఆదిశంకరాచార్యుడు కూడా అసత్య మాడినట్లయింది. అదే విధముగా విశిష్టాద్వైతము భగవద్గీతలో ఉండగా అక్కడ చూసి ఇక్కడ చెప్పినట్లు కాకుండ తామే స్వయముగా చెప్పినట్లు చెప్పుట వలన, ప్రజలందరూ విశిష్టాద్వైతకర్త రామానుజాచార్యులు అనుకోవడము వలన, ఆయన కూడా సిద్ధాంత విషయములో అబద్ధమాడినట్లే అయినది. ఈ నా మాటలు కొందరికి బాధాకరమైనవిగా ఉండినా, దేవుని ముందర తప్పును తప్పుగానే ఒప్పుకోవడము మీకు, నాకు ఇతరులకు

మంచిదే కదా! మనలను మనము మోసము చేసుకొన్నా ఫరవాలేదు. దేవున్ని మోసగించాలని చూడకూడదు. ఇప్పుడు కొందరి చూపు నావైపు మరలవచ్చును. "నీవు సస్వరివా, నీతిమంతునివా, నీవు త్రైత సిద్ధాంతమును ప్రతిపాదించానని చెప్పుకోలేదా? నీవు అసత్యమాడలేదా? నీవు దేవున్ని మోసగించలేదా?" అని నిలదీసి అడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! తప్పును ఎవరు చేసినా తప్పేయగును. నేను, నీవు అను బేధము లేకుండా ఒప్పుకోవలసివచ్చును. అయితే మీరనుకొనునట్లు నేను మాత్రము ఏ అసత్యము ఆడలేదనీ, నేను దేవున్ని మోసగించు ప్రయత్నమును చేయలేదనీ ధైర్యముగా చెప్పుచున్నాను. అలా ఎందుకు చెప్పుచున్నాననగా! నేను త్రైత సిద్ధాంతమును గురించి చెప్పినప్పుడు దానిని నేను ఇప్పుడు చెప్పినట్లు కాకుండా, భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయములో 16,17 శ్లోకములలో ఈ విషయమున్నదని చెప్పాము. త్రైత సిద్ధాంతము ఎక్కడ పుట్టినదీ, ఎవరు చెప్పినదీ ముందే చెప్పియుండుట వలన నేను అసత్యము చెప్పినట్లు కాదు. అంతేకాకుండా నా పేరు ముందర త్రైత సిద్ధాంతకర్త అని ఎక్కడా ఉండదు. మీరు బాగా గమనిస్తే త్రైతసిద్ధాంత ఆదికర్త అని ఉంటుంది. అలా ఉండుట వలన త్రైత సిద్ధాంతము ఆదిలోనే ఆదికర్త అయిన ప్రబోధానందయోగీశ్వరుల చేత చెప్పబడినదని అందరికీ అర్థము కాగలదు. ప్రబోధించినవాడు, యోగీశ్వరులైనవాడు, ఆదికర్తయినవాడు ఒక్కడే. కనుక మూడు విశిష్టమైన శబ్దములుగల పేరును దేవుని గుర్తుగా నేను పెట్టుకొన్నాను. త్రైత సిద్ధాంతమును జ్ఞాపకము చేసి చెప్పువాడనే గానీ దానికి కర్తను కాను కదా! ఎటుచూచినా సిద్ధాంత విషయములో నన్ను మోసగాడు అనుటకుగానీ, అసత్యవాది అనుటకుగానీ ఎవరికీ అవకాశములేదు.

ప్రపంచమునకు సంబంధించిన సిద్ధాంతములన్నియూ ఐదు శాస్త్రములకు సంబంధించినవి కాగా, పరమాత్మకు సంబంధించిన సిద్ధాంతము ఒకే ఒక బ్రహ్మవిద్యాశాస్త్రమునకు సంబంధించినది. బ్రహ్మవిద్య అనగా పెద్ద విద్య అని అర్థము. పెద్ద విద్యను పెద్దవాడైన దేవుడే తెలుపాలి. అందువలన ఆయన బ్రహ్మవిద్యాశాస్త్రమును సృష్ట్యాదిలోనే సూర్యునకు తెలిపినట్లు చెప్పియున్నాడు. ముందు బ్రహ్మవిద్యా శాస్త్రము తెలియబడిన తర్వాత మిగత ప్రపంచ శాస్త్రములైన గణిత, ఖగోళ, రసాయన, భౌతిక, జ్యోతిష్యములు మనుషులకు ఆత్మ తెలియజేసినది. ప్రపంచ సంబంధ ఐదు శాస్త్రములను మనుషులకు వారి శరీరములోని ఆత్మ తెలియజేయగా, దైవ సంబంధ బ్రహ్మవిద్యా శాస్త్రమును పరమాత్మయే ప్రకృతి ద్వారా తెలియజేశాడు. ఐదు శాస్త్రముల సిద్ధాంతములను ఎన్నిటినో ఆత్మ తెలియజేయగా, ఆరవ శాస్త్రమైన బ్రహ్మవిద్యాశాస్త్రము యొక్క మూడు సిద్ధాంతములను దేవుడు ప్రకృతి ద్వారా తెలియజేశాడు. ప్రపంచ సంబంధ ఐదు శాస్త్రములకు ఒక్కొక్క దానికి ఎన్ని సిద్ధాంతములున్నాయని అడిగితే, దానికి జవాబుగా ఇన్ని అని పరిమితిలేదు అని చెప్పవచ్చును. బ్రహ్మవిద్యా శాస్త్రము పూర్తిగా ముందే తెలియబరచబడినది. ఇంక మిగిలివున్నదిగానీ, చెప్పవలసినదిగానీ ఏదీలేదు. అందువలన దానిలో చెప్పబడినవి మూడే సిద్ధాంతములని తేల్చి చెప్పుచున్నాము. అయితే ప్రపంచ సంబంధ ఐదు శాస్త్రములు ఇంతవరకు పూర్తిగా చెప్పబడలేదు. ఇప్పటికే కొన్ని శాస్త్రములలో ఎక్కువ సిద్ధాంతములు, కొన్ని శాస్త్రములలో తక్కువ సిద్ధాంతములు తెలుప బడివున్నవి. గణిత, రసాయన శాస్త్రములలో ఎక్కువ సిద్ధాంతములు తెలుప బడియుండగా, ఖగోళ, భౌతిక శాస్త్రములలో తక్కువ సిద్ధాంతములు తెలుప బడియున్నవి. జ్యోతిష్యశాస్త్రములో చాలా తక్కువగా తెలుపబడినవి. ఈ

ఐదు శాస్త్రములలో క్రొత్త సిద్ధాంతములను ఇంకా తెలియవలసియున్నది. ఒక బ్రహ్మవిద్యాశాస్త్రములో మాత్రము ఉన్న మూడు సిద్ధాంతములను దేవుడు ముందే తెలిపియున్నాడు.

దేవుడు తన ప్రకృతి ద్వారా తెలియజేసిన బ్రహ్మవిద్యా శాస్త్రములోని మూడు సిద్ధాంతములలో ఒకటి అద్వైత సిద్ధాంతము, రెండు ద్వైత సిద్ధాంతము, మూడు త్రైత సిద్ధాంతము. ముఖ్యముగా మూడు సిద్ధాంతము లనే దేవుడు చెప్పాడు. అయితే అద్వైత సిద్ధాంతమునుండి కొంత విశిష్టముగా చెప్పబడినది విశిష్టాద్వైతము. విశిష్టాద్వైతమును మధ్యలో మనము చెప్పుకొన్నా అది దేవుడు చెప్పిన అద్వైత సిద్ధాంతములోనికే చేర్చబడును. తర్వాతది ద్వైత సిద్ధాంతము, ఆ తర్వాతది త్రైత సిద్ధాంతము. అద్వైత, ద్వైత, త్రైత అను మూడు సిద్ధాంతములు తప్ప బ్రహ్మవిద్యా శాస్త్రములో మరి ఏ సిద్ధాంతములు లేవు. ఈ మూడు సిద్ధాంతములను అనుసరించి, మనిషియొక్క ఆధ్యాత్మికమంతయు నిర్మింపబడినది. భూమి మీద మనిషి ఏ మతమును అనుసరించినా త్రి సిద్ధాంత ఆధ్యాత్మికమును ఆధారము చేసుకోవలసిందే. దేవుడు చెప్పినది మూడు సిద్ధాంతములే కనుక ఎవరైనా, ఏ మతమువారైనా దేవున్ని గురించి తెలియాలంటే మూడు సిద్ధాంతముల జ్ఞానము తప్ప ఇతర జ్ఞానము ఎక్కడాలేదు. ఇప్పుడు కొందరు ఒక ప్రశ్నను అడుగవచ్చును. "మీరు చెప్పునది ఇందువులకు (హిందువులకు) సరిపోవు జ్ఞానము కదా! ఒక ముస్లీమ్ దేవున్ని గురించిన జ్ఞానము తెలియుటకు ఇస్లామ్ ధర్మము ప్రకారము నడుచుకోవలసివచ్చును. ఇస్లామ్ ధర్మమును తెలియజేయు గ్రంథమును దేవుడు ఖురాన్ రూపములో ఇచ్చాడు కదా! అటువంటపుడు పవిత్ర ఖురాన్ గ్రంథములో చెప్పినట్లు వారి ఇస్లామ్ ధర్మము ప్రకారము అనుసరింతురుగానీ, మీరు ఏ మతస్థుడుగానీ, ఎవరుగానీ

త్రైతసిద్ధాంత జ్ఞానమునే అనుసరించాలని చెప్పుట ఎంతమటుకు సమంజసము” అని అడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా!

సర్వమానవాళిని సృష్టించిన వాడు ఒక దేవుడే అయినప్పుడు, ఆయన చెప్పిన ధర్మములన్నియు మానవులకే అయినప్పుడు, దేవుడు చెప్పిన జ్ఞానము ఎప్పటికీ ఒకటే ఉండును. ఆయన ఆదిలో ఒకమారే మానవులకు కావలసిన జ్ఞానమును సిద్ధాంతముల రూపములో శాస్త్రబద్ధముగా చెప్పాడు. అదియే బ్రహ్మవిద్యా శాస్త్రము అని చెప్పాము. దేవుడు ఒకమారు ఆదిలో చెప్పిన జ్ఞానమును వేరువేరు ప్రవక్తలు, వేరువేరు దేశములలో చెప్పుట వలన, మనుషులు దానిని వేరువేరు మతములుగా భావించి ఆచరిస్తున్నారు. అంతేగానీ ఏ ప్రవక్త చెప్పినా, ఏ మత గ్రంథములోనైనా ఉన్నది ఒకే దేవుని జ్ఞానమే, అలాంటపుడు ఏ మతములో అయినా అర్థము చేసుకోగలిగితే, ఒకే దేవునికి సంబంధించిన ఒకే జ్ఞానముండును. అలా కాకుండా వేరువేరు మతములకు వేరువేరు దేవుడుగానీ, వేరువేరు జ్ఞానము గానీ ఉండదు. దేవున్నీ, దేవుని జ్ఞానమునూ సంకుచిత భావముతో చూచు వారు మాత్రమే మా దేవుడు వేరు, మా మతమువేరు, మా జ్ఞానమువేరు అనుచుందురు. సర్వ ప్రపంచమును, సర్వమానవులను దేవుడు సృష్ఠించాడని ఒకవైపు చెప్పుచూ, మీ దేవుడువేరు మా దేవుడువేరని చెప్పడము సమంజసమా? అందరికీ పెద్ద ఒకే దేవుడు అని తెలిసినప్పుడు, ఇంకొక దేవుడున్నాడనడము పొరపాటు కదా!

దేవుడు తన జ్ఞానమును త్రైత సిద్ధాంత రూపముతో చెప్పాడు. అదియే ఐదువేల సంవత్సరముల పూర్వము పరమ పవిత్ర పరిశుద్ధ భగవద్గీత గ్రంథమైనది. ఆ జ్ఞానమే రెండు వేల సంవత్సరముల పూర్వము పరిశుద్ధ బైబిలు గ్రంథమైనది. అదియే 14 వందల సంవత్సరముల పూర్వము

పవిత్ర ఖురాన్ గ్రంథమైనది. దేవుడు చెప్పిన జ్ఞానము మా గ్రంథములో ఉన్నదని చెప్పువారు మీ దేవుడువేరు, మీ మతమువేరని చెప్పడము దేవుని జ్ఞానమును కించపరచినట్లు కాదా! ఒక ముస్లీమ్ సోదరుడు నన్ను ఒక ప్రశ్న వేశాడు. అదేమనగా! "మీరు త్రైత సిద్ధాంతమును చెప్పారు. మీ మాట ప్రకారము త్రైత అంటే మూడు ఆత్మలని చెప్పుచున్నారు. ఒకడు జీవుడు అనియూ, రెండవ వాడు ఆత్మ అనియూ, మూడవవాడు పరమాత్మ అనీ చెప్పుచున్నారు కదా! మా గ్రంథములో జీవుడు (మనిషి) దేవుడు తప్ప మధ్యలోని ఆత్మ అనునది ఎక్కడ లేదు కదా! అలాంటపుడు మాకు కూడా మీ త్రైత సిద్ధాంతమును అంటగట్టడము మంచిదేనా" అని అడిగాడు. దానికి నేనిలా సమాధానమును చెప్పాను. మీ మనస్సులో మీ మాటలో మతము అనునది అడ్డుగానున్నప్పుడు నా మాటలు తప్పుగా కనిపించి యుండ వచ్చును. నేను చెప్పునది మతములకు అతీతమైన బోధ, నాదీ నీది అనునది ఎవరిదీ ఇక్కడ ఉండదు, దేవుని బోధమాత్రము ఉంటుంది. దేవుడు చెప్పిన బోధ అన్ని మతములకు సమానమైనదే అని అర్థముకానప్పుడు ఒకరికి ఒకరకమూ, మరొకరికి మరొకరకముగా కనిపించి యుండవచ్చును. దేవుడు చెప్పినబోధ సృష్ట్యాదిలోనే చెప్పబడినది. అన్ని మతములు దానిని అనుసరించ వలసిందే. దేవుడు తన బోధలో త్రైత సిద్ధాంతమును చెప్పాడు. అది అన్ని మతముల మూల గ్రంథములలో తప్పనిసరిగా ఉంటుంది. దేవుడు చెప్పిన సిద్ధాంతములేనిది ఏదీ మూల గ్రంథమనిపించుకోదు. భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగము అను అధ్యాయములో 16,17 శ్లోకము లలో ముగ్గురు పురుషులను గురించి ఉండగా, అదే విషయము ఖురాన్ గ్రంథములో 50వ 'ఖాఫ్' సురాలో 21వ ఆయత్‌నందు ఇలా కలదు. "ప్రతి వ్యక్తీ తనవెంట తనను తీసుకొచ్చే వాడొకడు, సాక్షమిచ్చేవాడొకడు

ఉన్న స్థితిలో హాజరవుతాడు” ఈ వాక్యమును బాగా అర్థముచేసుకోగలిగితే ఇందులో ముగ్గురు పురుషులు కనిపించడము లేదా?

ఈ ప్రపంచమును దేవుడు ఎప్పుడు ప్రారంభించాడో ఎవరికీ తెలియదు. ఎవరైనా సృష్ఠి ప్రారంభ సమయము ఫలానా కాలములో జరిగింది అంటే అది పూర్తి అసత్యమగును. సృష్ఠి ప్రారంభమైనప్పుడు దైవజ్ఞానము తెలియు స్థోమత మనుషులకు లేదు, కావున దేవుడు ప్రకృతి ద్వారా మొట్టమొదట తన జ్ఞానమును సంపూర్ణముగా సూర్యునికి తెలిపాడు. మొదట సూర్యుడు తెలుసుకొన్న జ్ఞానమును తర్వాత, కొంతకాలమునకు మనిషి దైవజ్ఞానమును గ్రహించు స్థోమత కల్గిన సమయములో, సూర్యుడు మనువు అను వ్యక్తికి బోధించాడు. మొట్టమొదట భూమిమీద మనిషికి సూర్యుడు దైవజ్ఞానమును బోధించాడు. కావున సూర్యున్ని ఆది గురువు (బోధకుడు) అంటున్నాము. భూమిమీద మొదట ఒక వ్యక్తికి జ్ఞానము తెలిసిన తర్వాత రెండవ వ్యక్తికీ, మూడవ వ్యక్తికీ ఇలా వరుసగా అందరికీ తెలిసిపోయినది. కొంతకాలమునకు దైవజ్ఞానము భూమండలములోనున్న వారందరికీ తెలిసి పోయినది. తెలిసినవాడు ఒకడు వందమందికి తెలియజెప్పుచూ బోధకునిగా మారగా, మిగతావారు వినుచూ అందరూ దేవుడు చెప్పిన జ్ఞానమును తెలుసుకోగలిగారు. అయితే ఇక్కడ మనము కొంత గమనించవలసినది ఉన్నది. అదేమనగా! సూర్యుడు ఖగోళములో దేవుని పరిపాలనా వ్యవస్థలోనివాడు. భూమిమీద జీవరాసులు, మనుషులు అందరూ పరిపాలింపబడువారు. మొదట పరిపాలనలోనివాడైన సూర్యుడు పాలించబడు మనుషులకు మొట్టమొదట జ్ఞానమును చెప్పాడు. మొదట సూర్యుడు మనుషులకు చెప్పినప్పుడు, దేవుడు చెప్పినది చెప్పినట్లు తెలియ జేశాడు. ఇక్కడ చాలామందికి తెలియని విషయమేమనగా! సూర్యుడు

సాధారణ మనిషికి ఎలా తెలియజేశాడను విషయము ప్రశ్నగావచ్చి, దానికి జవాబు తెలియక సూర్యుడు చెప్పాడు అనుట అసత్యమనుకొనుచుందురు. సూర్యుడు ఎలా చెప్పాడను విషయమును విజ్ఞులమనుకొను కొందరు నమ్మకపోగా, ఎవ్వరికీ ఏమాత్రము తెలియని విషయమొకటి గలదు. అదేమనగా!

సూర్యుడు మొట్టమొదట దైవజ్ఞానమును బహిర్గతము చేసి చెప్పునప్పుడు, దేవుని పరిపాలనా విభాగములోనున్న కోటానుకోట్ల భూతములు, గ్రహములు మొదలైన వారిలో కొన్ని లక్షలమంది భూతములు, కొన్ని లక్షలమంది గ్రహములు దేవుని జ్ఞానమును సూర్యుని ద్వారా వినగలిగి నారు. అలా వినిన గ్రహములూ, భూతములూ తమతో సమానముగానున్న భూతములకు, గ్రహములకు కూడా తర్వాత తెలుపడము జరిగినది. అంతేకాక అక్కడక్కడ అరుదుగా మనుషులకు కూడా తెలిపిన చరిత్రలు గలవు. భూతములు, గ్రహములు సూర్యుడు మనుషులకు చెప్పినపుడే దైవజ్ఞానమును తెలుసుకొన్నారనడము నాది కొంత అధిక ప్రస్తావనే అయినా, తర్వాత ఈ మాట సాక్షముగా ఉంటుందని చెప్పుచున్నాము. సూర్యుడు దేవుడు చెప్పిన జ్ఞానమును ఉన్నదున్నట్లు వందశాతము మనిషికి తెలుపగా, తర్వాత మనుషులు ఒకరికొకరు చెప్పుకోవడములో దేవుడు చెప్పిన జ్ఞానములోని భావము చాలా శాతము తగ్గిపోయినది. చివరకు దైవజ్ఞానము కొన్నిచోట్ల పూర్తి వ్యతిరేఖ భావములోనికి వెళ్ళిపోయినది. బోధకుల తలలో ఏ భావముంటే అదే భావమును ప్రజలకు చెప్పడము వలన, వినిన ప్రజలు కూడా దానినే దేవుని జ్ఞానము అనుకొని దైవజ్ఞానమునకు వ్యతిరిక్త భావములోనికి పోవుచున్నారు. ఆ విధముగా కొన్నిచోట్ల మాత్రము జరుగు చున్నది. ఇందువులకు మూలగ్రంథముగానున్న భగవద్గీతలోగానీ,

ఇస్లామ్‌లోని ఖురాన్ గ్రంథములోగానీ, క్రైస్తవములోనున్న బైబిలు గ్రంథములోగానీ కొన్ని వాక్యములను మనుషులు తప్పుగా అర్థము చేసుకోవడము జరుగుచున్నది. ఈ నా మాటను తేలికగా తీసుకోవద్దండి, నేను చెప్పినది నగ్నసత్యము. ఇప్పుడు కొందరు నన్ను ఒక ప్రశ్న అడుగవచ్చును. “నీవు హిందూ మతములో పుట్టిన వానివి కదా! ఒకవేళ నీవు చెప్పితే అందరికంటే కొంత ఎక్కువగా భగవద్గీతలో చెప్పుటకు అవకాశము గలదు. అయితే ఖురాన్ గ్రంథములో ముస్లీమ్ పండితులకు తెలియని భావములుగానీ, అలాగే బైబిలు గ్రంథములో ఉద్ధండులైన క్రైస్తవ బోధకులకు అర్థముకాని వాక్యములుగానీ మీకు అర్థమైనాయని చెప్పగలరా” అని అడుగవచ్చును. దానికి నా సమాధానము ఏమనగా!

నేను ఏ మతములో పుట్టినా, దేవుడు చెప్పిన జ్ఞానము అందరికీ ఒక్కటే. ఆ పద్ధతి ప్రకారము జ్ఞానము నాదే అయినప్పుడు, నా జ్ఞానమే అన్ని మతములలో ఉన్నప్పుడు, ఏ మతములో తప్పువున్నా వారిని సరియైన మార్గములోనికి పంపుటకు సాటి మనిషిగా నాకు ఎంతో బాధ్యత ఉన్నది. ప్రపంచ విషయములతో నాకు ఏమాత్రము సంబంధముండదు. ఒక్క దైవవిషయములోనే నేను ఎక్కడైనా, ఏ మతములోనైనా చెప్పగలను. ఒక్క జ్ఞాన సంబంధముతో ఏ మతమైనా నా మతమే అగును. అందువలన సులభముగా చెప్పగలను. మీకు అర్థమగుటకు ఇస్లామ్ ధర్మమును బోధించు ఖురాన్ గ్రంథములో (దివ్య ఖురాన్ గ్రంథములో) ముగ్గురు పురుషుల త్రైత సిద్ధాంతమును గురించి 50వ సురా “ఖాఫ్” లో, 21 వాక్యము” ప్రతి వ్యక్తి తనవెంట ఒక తోలేవాడూ, ఒక సాక్ష్యము చెప్పేవాడూ ఉన్న స్థితిలో వస్తాడు” 22వ వాక్యములో “ ఈ విషయము గురించి నీవు అశ్రద్ధలో పడియున్నావు. మేము నీ ముందు పడియున్న తెరను తొలగించాము. ఈనాడు నీ దృష్టి చాలా నిశితముగా ఉన్నది.”

ఇదే విషయమే అదే సూరా, అదే ఆయత్‌లలో "అంతిమ దైవగ్రంథము ఖుర్‌ఆన్" అను గ్రంథములో ఇలా కలదు. సురా 50, ఆయత్ 21,22 "ప్రతి వ్యక్తి తనవెంట తీసుకవచ్చేవాడొకడు, సాక్ష్యమిచ్చే వాడొకడు ఉన్న స్థితిలో హాజరవుతాడు" నిశ్చయముగా నీవు దీనిపట్ల అలసత్వం వహించావు. ఇక నీ నుండి నీ తెరను తొలగించాము. ఈనాడు నీ చూపు సునిశితంగా ఉంది." ఇక్కడ రెండు గ్రంథములలోను ఒకే భావముతోనున్న వాక్యములు గలవు. 21వ ఆయత్ (వాక్యము) లో తీసుకవచ్చేవాడు అని ఒక గ్రంథములోనూ, ప్రతి వ్యక్తి తనవెంట తోలేవాడు అని మరొక గ్రంథములోను వ్రాసియున్నా కొంత పదములు వేరుగా తోలేవాడు, తీసుకవచ్చేవాడు అని ఉన్నా, రెండిటి భావము ఒక్కటేనని గ్రహించవలెను. ప్రక్కనే 22వ ఆయత్ (వాక్యము)నందు దివ్యఖురాన్‌లో ఈ విషయము గురించి, నీవు అశ్రద్ధలో పడియున్నావు అని చెప్పగా, అంతిమ దైవగ్రంథము ఖురాన్‌లో నిశ్చయముగా నీవు దీనిపట్ల అలసత్వము వహించావు అని వ్రాయబడివున్నది. రెండు గ్రంథములలో ఉపయోగించిన అశ్రద్ధ, అలసత్వము అను పదములు వేరైనా రెండూ ఒకే అర్థమునిచ్చునవని తెలియవలెను.

ముఖ్యముగా ఈ వాక్యములలో గమనించవలసినదేమనగా! ప్రతి వ్యక్తి తనవెంట ఒక తోలేవాడూ, ఒక సాక్ష్యము చెప్పేవాడూ అని ఉన్నప్పుడు ప్రతి వ్యక్తి అనగా ఒక వ్యక్తిని గురించి లెక్కించుకుందాము. తర్వాత తనవెంట ఒక తోలేవాడు ఎవడైతే ఉన్నాడో వానిని రెండవ వానిగా లెక్కించు కొందాము. ఆ తర్వాత ఒక సాక్ష్యమిచ్చేవాడు ఎవడైతే ఉన్నాడో వానిని మూడవ వానిగా లెక్కించవచ్చును. ఈ విధముగా లెక్కించితే ఒక మనిషి వెంట కనిపించని ఇద్దరున్నారని తెలియుచున్నది. ఒక మనిషి శరీరములో

ఒక జీవుడుండగా, అతనిని అన్ని విధముల నడిపించు ఆత్మ కూడా ఉన్నది. అయితే శరీరములో జీవాత్మ ఏమి అనుభవిస్తున్నదీ, ఆత్మ ఎట్లు నడిపించుచున్నదీ సాక్షిగా ఇద్దరినీ చూస్తున్న దేవుడు కూడా ఉన్నాడు. ఈ విధముగా ఒక శరీరములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మ ముగ్గురున్నారని పవిత్ర ఖురాన్ గ్రంథములో తెలియబడినది. సృష్ట్యాదిలో దేవుడు చెప్పిన విషయము ఖురాన్ గ్రంథములోనికి ఎలా వచ్చినదని ఎవరైనా అడిగితే దానికీవిధముగా సమాధానము కలదు. సూర్యుడు భూమిమీద మనువుకు, దేవుని జ్ఞానమును చెప్పుచున్నప్పుడు లక్షలాది గ్రహములు, భూతములు శ్రద్ధగా విన్నారని చెప్పాము కదా! వారిలో దేవుని పాలనా యంత్రాంగములోనున్న వాడైన జిబ్రయేల్ అను ఒక గ్రహము వినగలిగినది. అదే విషయమునే జిబ్రయేల్, ముహమ్మద్ (సం) ప్రవక్తగారికి చెప్పడము జరిగినది. మూడు ఆత్మల విషయము మనుషులకు ఎవరికీ తెలియదు. కావున ఈ విషయమును గురించి మీరు అశ్రద్ధగా ఉన్నారని 50వ సురా 22వ వాక్యములో జిబ్రయేల్‌దూత చెప్పడము జరిగినది. అప్పుడే అదే వాక్యములోనే (అదే ఆయత్‌లోనే) 'ఇప్పుడు నీ ముందున్న తెరను తొలగించాము. ఈనాడు నీ దృష్ఠి చాలా సునిశితంగా ఉన్నది' అని చెప్పాడు. ఆ విధముగా జిబ్రయేల్ దూత చెప్పడము వలన అంతవరకు మనిషికి తెలియని మూడు ఆత్మల వివరము తెలిసినదనీ, అంతవరకు అడ్డముగానున్న అజ్ఞాన తెరను జిబ్రయేల్ తొలగించి సత్యమును చూపించాడనీ, అలా సత్యమును తెలియుట వలన మానవుని జ్ఞానదృష్ఠి అశ్రద్ధ (అలసత్వము) లేకుండా చురుకుదనముగా (నిశితంగా) మారిపోయినదని మనకు అర్థమైనది.

సృష్ట్యాదిలో సృష్ఠికర్తయిన దేవుడు చెప్పిన మూడు ఆత్మల వివరమును ఐదువేల సంవత్సరముల పూర్వము కృష్ణుడు అర్జునునికి చెప్పగా,

పదునాలుగు వందల సంవత్సరముల పూర్వము జిబ్రయేల్, దేవుడు చెప్పిన మూడు ఆత్మల విషయమునే 50వ సురా ఖాఫ్‌లో 17,21 వాక్యములలో చెప్పాడు. రెండవ ఆత్మను గురించి 18,23,27 వాక్యములలో (ఆయత్‌లలో) చెప్పాడు. జిబ్రయేల్, దైవవాక్కును ప్రవక్త ముహమ్మద్‌గారికి (సం) తెలిపి మీకు జ్ఞానదృష్ఠి పూర్తిగా ఇవ్వబడినదనీ, మీ అజ్ఞాన తెరలు తొలగి పోయాయని చెప్పగా, ఆ దృష్ఠి ఏమిటో? ఆయన తొలగించిన తెరలు ఏమిటో? నేటి ముస్లీమ్‌లకుగానీ, మిగతా హిందువులకుగానీ, క్రైస్తవులకుగానీ తెలియకుండా పోయాయి. దేవుడు ఆదిలో చెప్పిన మూడు ఆత్మల వివరము (త్రైత సిద్ధాంతము) ఏమిటో తెలియని మతములూ, అందులోని మనుషులూ ఈనాడు తయారైనారు. క్రైస్తవులు ట్రినిటి అని ఇంగ్లీషులో, త్రిత్వమని తెలుగులో చెప్పుకొనుచుండినా, అది త్రైతమునకు సంబంధములేదు. అందులో మూడు ఆత్మల వివరముగానీ, మూడు ఆత్మల విషయముగానీ ఏమాత్రములేదు. కుమారుడు, తండ్రి, పరిశుద్ధాత్మ అని మూడు పేర్లు పెట్టి వాటిని త్రిత్వము అని క్రైస్తవములో అనడము జరిగినది. తండ్రి, పరిశుద్ధాత్మ ఇద్దరూ ఒక్కడే అగుదురు. పరిశుద్ధాత్మ అనినా దేవుడే, తండ్రి అనినా దేవుడే. జీవున్ని కుమారుడు అనడము జరిగినది. అలాంటపుడు జీవుడు, దేవుడు అను ద్విత్వమే అందులో ఉన్నదిగానీ, త్రిత్వము లేదు. కుమారుడు, తండ్రి, పరిశుద్ధాత్మ అనుమాట త్రిత్వము కాదు ద్విత్వమే అని తెలియాలి.

బైబిలులో కూడా మూడు ఆత్మల వివరమున్నది కానీ, అది ఒక వాక్యములో లేదు. కొన్ని వాక్యముల సారాంశములో కలిసియున్నది. ప్రత్యేకించి ప్రత్యేకమైన వాక్యములలో ఖురాన్‌నందు, ప్రత్యేకమైన శ్లోకము లలో భగవద్గీతయందు చెప్పితేనే మనుషులకు అర్థముకానప్పుడు, కొన్ని

వాక్యముల సమ్మేళనములో ఇమిడియున్న మూడు ఆత్మల విషయము క్రైస్తవులకు ఎలా అర్థము కాగలదు. అందువలన జీవాత్మ, ఆత్మ, పరమాత్మ గానున్న త్రైత సిద్ధాంతము వారికి కూడా అర్థము కాలేదు. క్రైస్తవములో త్రిత్వము అను మాటయున్నా అది త్రైతము కాదు, త్రైత సిద్ధాంతము కాదు. ఈ విధముగా ఆదిలో దేవుడు చెప్పిన త్రైత సిద్ధాంతము ఈ కాలములో అన్ని మూలగ్రంథములలోనున్నా, ఏ మతము వారికీ దానిని గురించి తెలియదు. మేము త్రైత సిద్ధాంతమును గురించి చెప్పినపుడు హిందువులు త్రైత సిద్ధాంతము అనుమాటను విని, ఆ మాటను త్రిత్వమనుకొని మమ్ములను క్రైస్తవులుగా వర్ణించుకొన్నారు. హిందువుల ముసుగులోనున్న క్రైస్తవులని మమ్ములను గురించి హిందువులు అనుకోవడము, మతద్వేషముతో మా భక్తులమీద దాడులు చేయడము జరిగినది. దేవుని జ్ఞానములేనందున హిందువులే తమ మతము వారిని గుర్తించలేనంత గ్రుడ్డివారైపోయారు. ఇక క్రైస్తవులు త్రైతసిద్ధాంతము అను మాటనువింటూనే, హిందువులు తమ మతములోనికి మనలనులాగుకొనుటకు ఈ విధముగా త్రైతము అని పేరు పెట్టుకొన్నారనీ, మమ్ములను చూస్తే దూరముగా పోయెడివారు. మా బోధలు వినడముగానీ, మా గ్రంథములను చదవడముగానీ చేసెడివారు కాదు. హిందువులు దాడులు చేసినట్లు, క్రైస్తవులు దాడులు చేయలేదు. ఇక ముస్లీమ్‌ల విషయములోనికిపోతే, వారు మేము చెప్పు బోధలను శ్రద్ధగా వినెడివారు. ఎక్కువగా మమ్ములను, మా జ్ఞానమును గౌరవించెడి వారు. విశ్వమునకంతటికీ ఒక్కడే దేవుడు అని మేము చెప్పు మాటనూ దానికి సంబంధించిన మా జ్ఞానమునూ విని ఎంతో సంతోషించెడివారు.

విశ్వమును ప్రారంభించినప్పుడు దేవుడు మూడు భాగములుగా విడిపోయి, తన మూడు భాగములను తెలుసుకొన్నప్పుడే దేవున్ని

సంపూర్ణముగా తెలిసినట్లగునని తెలిపాడు. దేవుడు ఆ విధముగా తెలిపినదే త్రైత సిద్ధాంతము. త్రైత సిద్దాంతమును తెలియాలంటే ముందు అద్వైత, ద్వైత విధానములను తెలియాలి. అద్వైత, ద్వైతములు అంటే ఏమిటో తెలిసిన తర్వాత త్రైతమంటే ఏమిటో సులభముగా తెలియగలదు. అయితే కొందరికి అద్వైతమే తెలియదు. కొందరికేమో ద్వైతము తమ గ్రంథములో కనిపిస్తున్నా, వారికి నిశితమైన చూపులేక అదేమిటో వారికి కనిపించదములేదు, అర్థముకాలేదు. త్రైతము ఆదినుండియున్నా, ఐదువేల సంవత్సరముల ముందే ద్వాపరయుగము చివరిలోనే కృష్ణుడు భగవంతునిగా భగవద్గీతలో ముఖ్యమైన పురుషోత్తమ ప్రాప్తియోగము అను అధ్యాయములో త్రైతమును (మూడు ఆత్మలను) గురించి చెప్పియున్నా, హిందువులకు అదేమిటో కూడా తెలియదు. ఈ విధముగా మొత్తము అన్ని మతములను అనుసరించు వారికి, అన్ని రకముల మనుషులకు త్రైత సిద్ధాంతము తెలియని దానివలన, దాని ఫలితమైన దైవము కూడా తెలియడము లేదు. దైవము మూడు భాగములుగా విభజింపబడియుండినా, తనను (దైవమును) సంపూర్ణముగా తెలియుటకు కావలసిన జ్ఞానమును దేవుడే తెల్పియున్నాడు. అలా తెల్పబడిన జ్ఞానమే దేవుడు మనుషులకు అందించిన గ్రంథముల రూపములో ఉన్నది.

దేవుడు మనుషులకు జ్ఞానమును ఏ గ్రంథరూపములో ప్రసాదించాడు అని ప్రశ్నించుకొని చూస్తే, ఇస్లామ్‌లో ఖురాన్ గ్రంథ రూపముగానూ, క్రైస్తవములో బైబిలు గ్రంథరూపములోనూ, వారికి జ్ఞానమును అందించాడని ఆయా మతములవారు ధైర్యముగా చెప్పు చున్నారు. ఒక్క హిందూమతములోనే తమ గ్రంథము ఇది అని చెప్పక కొందరు వేదములనీ, కొందరు భగవద్గీత అనీ చెప్పుచున్నారు. ఇస్లామ్

లోనూ, క్రైస్తవములోనూ బోధకుల వ్యవస్థ మాత్రమున్నది. ఒక్క హిందూ మతములోమాత్రమే గురువుల వ్యవస్థ, బోధకుల వ్యవస్థ రెండూయున్నవి. హిందూమతములో గురువులు అనువారు ఉండుట వలన, వారు తమ ఆధిపత్యమును కనబరచుకొనుటకు దేవుడు చెప్పిన జ్ఞానమును వదలి, తమ తమ స్వంత జ్ఞానములను ప్రచారము చేసుకొన్నారు. ఆ నేపథ్యములో చాలామంది వేదములను ప్రమాణ గ్రంథములుగా చెప్పుకోవడము జరిగినది. కేవలము కొందరు దేవుడు చెప్పిన దానిని మాత్రము బోధిస్తామని బోధకునిగా ఉన్నవారు మాత్రము, భగవద్గీత యొక్క పేరును చెప్పడము జరిగినది. తాము గురువులుగా చలామణి కావాలనుకొన్న వారందరు, వేదములను అడ్డము పెట్టుకొని తమతమ సామ్రాజ్యములు వేరన్నట్లు ఒక్కొక్కరు ఒక్కొక్క పీఠమనీ, మఠమనీ, మతమనీ, సాంప్రదాయమనీ అనేక రకముల వర్గములను హిందూ మతములో తయారు చేసుకొన్నారు. ఇటువంటి వారందరికీ తగిన విధముగా వేదములలో వ్రాసిపెట్టియుండడము వలన, వారందరూ వేదములే ప్రమాణ గ్రంథములని చెప్పుచుందురు.

అట్లుకాకుండా భగవద్గీతను గురించి చెప్పితే, దేవుడు చెప్పిన దానినే ఒక బోధకునిగా చెప్పవలసివచ్చును. అసలైన దేవున్నే ఒప్పుకోవలసి వచ్చును, ఆయనను గురించే చెప్పవలసివచ్చును. తనది ప్రత్యేకమైన పాఠమనీ, అలాగే పీఠమనీ చెప్పుకొనుటకు వీలుండదు. అందువలన హిందూమతములో చాలామంది స్వామీజీలు తమతమ కుంపట్లను కూజాలను వేరువేరుగా పెట్టుకొని, తాము చెప్పు పాఠము ఫలానా పీఠముదని చెప్పుచుందురు. అందువలన ఒక్కొక్క పీఠమువారు ఒక్కొక్క దేవున్ని గురించిన పాఠమునే (బోధనే) చెప్పుచుందురు. పీఠములు వేరువేరుగా ఉండుట వలన, వారు వేరు వేరు దేవతలను గొప్పగా చెప్పుకోవడమూ, ఆ

దేవతలకు సంబంధించిన జ్ఞానమునూ, ఆ దేవతలకు సంబంధించిన ఆరాధననూ చెప్పుకోవడము జరుగుచున్నది. ఈ విధముగా ప్రజలు అసలైన సృష్టికర్తనూ, అందరికీ అధిపతియైన దేవున్ని మరచిపోయి, దేవుని స్థానములో ఒక్కొక్క సాంప్రదాయమువారు ఒక్కొక్క దేవున్ని పెట్టుకోవడమూ, చెప్పుకోవడమూ జరుగుచున్నది. ఇట్లు హిందూమతములో అనేక సాంప్రదాయములు, అనేక దేవుళ్ళు, అనేక ఆరాధనలు వచ్చాయి. మొత్తానికి ఇవన్నీ దేవుడు చెప్పిన జ్ఞానమునకు విరుద్ధముగా ఉన్నవి. భగవద్గీతకూ, దేవుని ధర్మములకూ విరుద్ధమైన విధానమున్నప్పటికీ, నాది సరియైన మార్గమని కొందరూ, ఎవరిదీ కాదు నాదే సక్రమమార్గమని మరి కొందరూ వాదించుచున్నారు. ఒక్కొక్క గురువునూ లేక పీఠాధిపతిని ఆశ్రయించు వారు కొందరుండగా, వారంతా తమ సాంప్రదాయమూ, తమ సాధన వేరని చెప్పుకోవడము వలన, వారందరూ ఆ పీఠము యొక్క సామ్రాజ్యము నకు సంబంధించినవారుగా కనపడుచుందురు. ఈ విధముగా మనుషులలో మతములు, మతములలో వర్గములు, వర్గములలో తెగలు అనేకముగా ఏర్పడి, చివరకు సృష్ట్యాదిలో దేవుడు చెప్పిన జ్ఞానమే తెలియకుండా పోయినది. దానికి ప్రమానముగా ఒక సంఘటనను చెప్పుతాను వినండి. దాదాపు ఐదు సంవత్సరముల పూర్వము మేము దేవుని జ్ఞానమును ప్రచారము చేయు నిమిత్తము గోడలమీద సృష్టికర్త అను పదమును వ్రాస్తే, దానిని చూచిన హిందూరక్షణ సంఘములని పేరు పెట్టుకొన్న హిందువులు, సృష్టికర్త అను పదము క్రైస్తవులది మనదికాదని తలచి మమ్ములను నిందించడము జరిగినది. ఏ మతమూ లేని ద్వాపరయుగములో భగవంతుడు తన సృష్టిని గురించి చెప్పి, తానే సృష్టికర్తనని చెప్పియుండగా, సృష్టికర్త అను పదము మనదికాదు, క్రైస్తవులదనుటకు కేవలము రెండువేల

సంవత్సరములప్పుడు పుట్టిన క్రైస్తవులకు సృష్టికర్తను హిందువులు లీజుకిచ్చారా అని మేము అడుగుచున్నాము. ఏమాత్రము జ్ఞానములేని హిందువులూ, వారిని ప్రోత్సహించు గురువులూ హిందూమతములో ఉండుట వలన, మేము ఇందూ ధర్మములను బోధించుచూ అందులోని భాగముగా భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగములోని త్రైత సిద్ధాంతమును తెలిపితే, త్రైతము మనదికాదు క్రైస్తవులదని మా భక్తులమీద హిందూ రక్షకులమనువారు ఎన్నో దాడులు చేశారు. మూడు నెలల క్రితము హిందూ ధర్మరక్షకులమనువారు మా ప్రెస్‌మీద దాడిచేసి అక్కడున్న వారిని కొట్టడము కూడా జరిగినది. దానికి కారణము మేము త్రైత సిద్ధాంతమును గురించి చెప్పడమే. ఈ విధముగా పూర్వము దైవజ్ఞానములో మొదటి స్థానములోనున్న హిందువులు (ఇందువులు) నేడు చివరి స్థానములోనికి వచ్చారు. దైవము చెప్పిన భగవద్గీతను మేము హిందువులకు బోధించడము కొందరు ప్రత్యేక పీఠమున్న స్వామీజీలకు సరిపోవడములేదు. దానివలన వారు రాజకీయమును చేయుచు అసలైన జ్ఞానమును పైకి రాకూడదని ప్రయత్నము చేయుచుందురు. అయినా దేవుని జ్ఞానము ముందర ఎవరి యుక్తులు కుయుక్తులు నిలువవు.

హిందూమతములో ఎప్పుడూ లేని చీలికలు మఠాలు, పీఠాలు అను పేరుతో, కలియుగము ప్రారంభమైన తర్వాత ఎన్నో వచ్చాయి. ద్వాపర యుగము చివరిలో దేవుడు తన జ్ఞానమును భగవద్గీత రూపములో చెప్పడము జరిగినది. అయినా కలియుగము వచ్చిన తర్వాత హిందూమతములో పూర్తి అజ్ఞానము చేరుకోవడము వలన, అదే కోవలో ఇతర మతములు తయారైనవి. ఒకప్పుడు ఏకైక మతముగానున్న ఇందూ (హిందూ) మతము నేడు కొన్ని మతముల ప్రక్కన తానొక మతముగా నిలబడినది. ఇట్లే

ఉంటే హిందూమతమును రక్షించుతామనే వారే దానిని పూర్తి భక్షించి వేయగలరు. తమకు తెలియకుండానే తమ మతమునకు కీడు చేయు చున్నామనీ, తాను మత రక్షణ కొరకు అనుసరించు పద్ధతియే, మతమును పూర్తిగా లేకుండ చేయగలదనీ, ముందుగా హిందువులు గ్రహించాలి. ఇతరులను భయపెట్టి, దాడులు చేసి మతమును ఎవరూ రక్షించుకోలేరు. దైవజ్ఞానమును గురించి చెప్పి ఎవరినైనా దేవునివైపు మరల్చవచ్చును. ఆదిలో పుట్టినది ఇందూమతము కాదు, ఇందూ ధర్మము. ఇందూ ధర్మము నేడు హిందూ మతముగా మారిపోయినది. ఇందూ ధర్మము ఎంత గొప్పదో, దానిలోని ఔన్నత్యము ఎంతటిదో మనుషులు తెలుసుకోగలిగితే అందరూ తాము ఇందువులమని చెప్పుకోగలరు.

దేవుని జ్ఞానమును తెలియువాడెవడైనా, వానిని జ్ఞాని అని అంటాము. జ్ఞానిని మరొక మారుపేరుతో పిలువవచ్చును, అదియే ఇందువు. ఇందువు అనగా దైవజ్ఞానమును తెలియువాడు లేక తెలిసిన వాడని అర్థము. జ్ఞానము లోకములో రెండు రకములు కలదు. అందులో ఒకటి ప్రపంచ జ్ఞానము, రెండవది పరమాత్మ జ్ఞానము. ప్రపంచ జ్ఞానము కంటే పరమాత్మ జ్ఞానము అన్ని విధముల గొప్పదే. గొప్పదైన పరమాత్మ జ్ఞానమును ప్రపంచ జ్ఞానముగా ఎవరూ లెక్కించకుండుటకు, పరమాత్మ జ్ఞానమునకు ప్రత్యేకమైన పదమును వాడారు. ఆ గుర్తింపయిన పదమునే 'ఇందువు' అంటున్నాము. పరమాత్మ జ్ఞానమును (దైవజ్ఞానమును) తెలిసిన వానిని ఇందువు అంటున్నాము. జ్ఞాని అంటే ఏ జ్ఞాని అని తికమక పడకుండుటకు దైవజ్ఞానమును ఇందూజ్ఞానము అనియూ, ప్రపంచ జ్ఞానమును ఇంగిత జ్ఞానము అనియూ గుర్తింపు పేర్లను పూర్వము పెద్దలు పెట్టడము జరిగినది. ఇంగిత జ్ఞానము లేనివాడు అంటే ప్రపంచ జ్ఞానము

లేనివాడని అర్థము. ఇందూ జ్ఞానము లేనివాడంటే దైవజ్ఞానములేనివాడని అర్థము. నేడు ఇంగిత జ్ఞానము అందరికీ ఉన్నది. అయితే ఇందూజ్ఞానము ఎవరికీ లేకుండా పోయినది. ప్రపంచ జ్ఞానమూ, పరమాత్మ జ్ఞానమూ అన్ని మతముల వారికి ఉండవలసిందే కదా! అందువలన ప్రతీ మతము లోనూ ఇంగిత జ్ఞానముగలవారూ ఉన్నారు. అట్లే ఇందూజ్ఞానము గలవారూ ఉన్నారు. ఇందూ అను పదము, ఇంగిత అను పదము ఒక్క మతమునకు సంబంధించినవే కాక, అన్ని మతములకు సంబంధించినవని తెలియవలెను. ఇందూ జ్ఞానము (దైవజ్ఞానము) కలవానిని ఇందువు అంటాము. అలాగే ఇంగిత జ్ఞానము గలవానిని 'ఇంగితుడు' అని అంటాము. ప్రపంచములో అన్ని మతములలోనూ ఇంగిత జ్ఞానములేనివారు కొద్దిమంది మాత్రమే ఉన్నా, ఇందూ జ్ఞానములేనివారు ఎక్కువగా ఉన్నారు. నేడు అన్ని మతములలోనూ ఇందువులు లేకుండా పోయారు. నేను దైవజ్ఞానము కలవానినని ఎవరైనా చెప్పుకొనినా, వారిలో పూర్తిగా దైవజ్ఞానము లేకుండా పోయి, మాయచేత నేను జ్ఞానిని అని భ్రమపడుచుండును. ఈ కాలములో ఎంతపెద్ద జ్ఞాని అయినా, అతనిలో పూర్తి ఇందుత్వము (దైవశక్తి) లేకుండా పోయి, కొంత అజ్ఞానము (తెలియని తనము) చోటు చేసుకొని ఉన్నదని చెప్పవచ్చును. సాధారణ మనుషులలో కాకుండా గొప్ప జ్ఞానులమనుకొను వారిలో అజ్ఞానము ఎలా దాగియుందో, వారు దానిని ఎలా గుర్తించలేక పోవుచున్నారో, ఒక యదార్థ సంఘటనను వివరించుకొందాము.

ఇక్కడ చెప్పు విషయము ఇతరులను తక్కువచేసి చెప్పుటకుకానీ, కించపరుచుటకుగానీ చెప్పునది కాదు. అందరూ సత్యమును అర్థము చేసుకొనుటకు మాత్రమే ఈ యదార్థ సంఘటనను ఇక్కడ ప్రస్తావించడము జరిగినది. ఇస్లామ్ మతములో నాకు పరిచయమున్న వ్యక్తులు ఇద్దరు

కలరు. వాస్తవముగా చెప్పితే వారు కనిపించే దానికి సాధారణ మనుషులే, అయినా గొప్ప మేధావులని చెప్పవచ్చును. వారు ఒక్క ఖురాన్ గ్రంథమునే కాక, బైబిలు, భగవద్గీత, ఉపనిషత్‌లు, వేదములను పూర్తిగా తలకెక్కించుకొని ఏ గ్రంథములోని విషయమునైనా, వాక్యమునైనా ఏకధాటిగా చెప్పగలుగు జ్ఞాపకశక్తియున్నవారు. ఇక్కడ నేను ఎవరినీ పొగడడము లేదు, ఉన్న సత్యమును చెప్పుచున్నాను. వారు ఇస్లామిక్ పరిశోధనా కేంద్రమును హైదరాబాద్‌లో స్థాపించి తమ పరిశోధనల ద్వారా తెలిసిన అన్ని రకముల జ్ఞానమునూ, ఎన్నో ఉపన్యాసరూపములతో బయటికి చెప్పగలుగుచున్నారు. మాకు తెలిసినంతవరకు వారు దైవ సేవకులు. యూనివర్సల్ ఇస్లామిక్ రీసెర్చ్ సెంటర్ (U.I.R.C) అను పేరుతో ఖురాన్, బైబిలు, భగవద్గీత, వేదముల మీద ఎంతో పరిశోధన చేసి, వారికి తెలిసిన ఫలితములను ఇతరులకు తెలుపడము జరుగుచున్నది. ఆ సంస్థకు ప్రెసిడెంట్ అయిన షఫీగారు, వైస్ ప్రెసిడెంట్ అయిన సిరాజ్ రహిమాన్‌గారూ, సెక్రటరీ అయిన సయ్యద్ అహమ్మద్‌గారూ నాకు సుపరిచితులే. ఇప్పటివరకు వారు చెప్పుచున్న విషయములను నేను వింటూవచ్చానుగానీ, నేను ఏదీ వారికి చెప్పలేదు.

U.I.R.C అధ్యక్షులు అయిన షఫీగారికి నాతో పరిచయమున్నది. నేను ప్రబోధ సేవాసమితి మరియు ఇందూ జ్ఞానవేదిక అను సంస్థలను స్థాపించిన వ్యక్తిగా షఫీగారికి తెలుసు. ఇకపోతే విశాఖపట్టణములో గురుద్వారా జంక్షన్‌కు దగ్గరగా, అక్కయపాలెములో బైబిల్ ఓపెన్ యూనివర్సిటీ ఆఫ్ ఇండియా B.O.U.I అను సంస్థ సంస్థాపకుడు అయిన పి.డి. సుందరరావుగారికి నేను అపరిచిత వ్యక్తినే అయినా, నేను వారి దగ్గరకు పోయాను. వారితో మాట్లాడినాను, దేవుని సేవకు వినియోగించమని

వెయ్యిరూపాయల నోటును కూడా ఆయనకు ఇచ్చి వచ్చాను. ఆయనను గురించి చెప్పితే ఆయన, ఆయన కుమారుడు ప్రసన్నబాబు గొప్పవక్తలు. ధారాళముగా మాట్లాడు శక్తియుక్తి కలవారు. వారి పరిశోధనలోని విషయములను భయములేకుండా నిర్భయముగా చాటుచున్నారు. బైబిలును గురించే వారు చెప్పుచున్నారు తప్ప, ఇతర గ్రంథములను గురించి వారి పరిశోధన లేదు. వారు చెప్పు బోధలు క్రైస్తవులలో కొంత విభిన్నముగా కనిపించుచుండును. అందరూ అందరికీ నచ్చవలెనను నియమము ఏమీ లేదుగానీ, వారు చెప్పే విషయములలో సత్యాసత్యములను అటుంచితే వారు చెప్పే విధానముగానీ, చేసే సేవగానీ గొప్పదేయని చెప్పవచ్చును. ఎంతటి వారిలోనైనా కొంతైనా అజ్ఞానము దాగియున్నదని మేము మొదటిలోనే చెప్పాము కదా! దానిప్రకారము ఎవరిది వారికి గొప్ప జ్ఞానముగానే కనిపించుచుండినా, దానిలో అజ్ఞానము ఇమిడియుంటే అది శాస్త్రబద్ధతకు నిలువదు. దేవుని జ్ఞానమునకు కూడా శాస్త్రమున్నదనీ, దానిని దేవుడే స్వయముగా చెప్పాడనీ, తెలియనప్పుడు ఎవరైనా తాను బోధించు బోధలలో, తాను కనుగొన్న జ్ఞానములో శాస్త్రీయత ఉందా లేదా అని చూడడు. శాస్త్రీయత లేనప్పుడు వారు చెప్పినది సిద్ధాంతము కాదు. దానిలో ఫలితము కనిపించదు. U.I.R.C వారూ తమ పరిశోధనలో ఇస్లామ్‌లోని ఖురాన్‌నే కాకుండా భగవద్గీత, వేదములనూ, బైబిలునూ పరిశోధించి చూచారు. వారికి వాటిలో తెలిసిన విషయములను చెప్పారు. వారు చెప్పినవి కొందరు ఒప్పుకోవచ్చును, ఒప్పుకోకపోవచ్చును. అది వారివారి విచక్షణ మీద ఆధార పడియుండును. U.I.R.C లో వారు వారి పరిశోధనలలో తెలిసినవి చెప్పారు. అలా పరిశోధించడముగానీ, వారి ఉద్దేశ్యమును బయటికి చెప్పడముగానీ ఏమాత్రము తప్పుకాదు. ఇది రాజ్యాంగము ఇచ్చిన హక్కు

అనే దానికంటే దేవుడిచ్చిన స్వతంత్రమని చెప్పవచ్చును. చెప్పినది తప్పో ఒప్పో అను విషయమును ప్రక్కన పెట్టితే, దేవుని విషయమును మాట్లాడే దానికి అందరికీ హక్కువుంది. ఇస్లామ్‌లోగానీ, క్రైస్తవములోగానీ, ఇందుత్వములోగానీ ఇది ఫలానా మతము వారికి అని అని ఎక్కడా చెప్పలేదు. ఇది సర్వమానవులకు వర్తించు ధర్మమని చెప్పబడినది.

U.I.R.C వారికి, B.O.U.I వారికి ఈ మధ్యకాలములో ఒక వివాదము వచ్చినది. U.I.R.C అధ్యక్షులు షఫీగారు బైబిల్‌ను గురించి చెప్పునప్పుడు అందులో "ఏసుప్రభువు శిలువమీద చనిపోలేదు. ఆయన చనిపోయి తిరిగి లేచాడనడము సరికాదు. మొదటికే ఆయన చనిపోలేదు" అని చెప్పడము జరిగినది. దానికి బదులుగా B.O.U.I వారైన సుందరరావు గారు "మా బైబిల్‌ను గురించి మాకు తెలుసు, ఏసు శిలువ మీద చనిపోయాడని మేము నిరూపించి చూపుతాము. మీరు చెప్పునది శుద్ధ అబద్ధము" అని చెప్పారు. ఈ విధముగా ఏసు మరణము ఇద్దరి మధ్య పెద్ద సవాల్‌ను ఒకరికొకరు విసురుకొనునట్లు చేసినది. దానికి చర్చకు రమ్మని U.I.R.C వారు పిలువడము జరిగినది. దానికి కొన్ని నియమములను B.O.U.I వారు చెప్పడము జరిగినది. ఇలా ఇంటర్‌నెట్‌లో వారి వాదనలను విన్నాము. ఇప్పుడు రెండు వైపులా రెండు పరిశోధనా సంస్థలు ప్రభువు మరణమును ఒక సమస్యగా తీసుకొన్నారు. మూడవ సంస్థ అయిన ఇందూ జ్ఞానవేదిక (I.G.V) ఈ విషయమునంతటిని గమనించింది. ఇక్కడ విచిత్రమేమంటే B.O.U.I వారు క్రైస్తవులు, U.I.R.C వారు ముస్లీమ్‌లు, I.G.V వారు ఇందువులు (హిందువులు). B.O.U.I వారు కేవలము ఒక్క బైబిలును గురించి మాత్రము చెప్పుదురు. U.I.R.C వారు ఖురాన్, బైబిలు, భగవద్గీత, వేదములను గురించి చెప్పుదురు. ఇకపోతే I.G.V వారు మాత్రము ముఖ్యముగా ఒక్క భగవద్గీతనే

చెప్పుదురు, మిగతా మతములను తక్కువ చేసి మాట్లాడరు. మిగతా మత గ్రంథములను గౌరవముగా చూచుదురు. మిగతా మత గ్రంథములలో కూడా దేవుని జ్ఞానమే ఉండుట వలన, వాటిని కూడా గౌరవించుచుందురు. అంతేకాక ఖురాన్, బైబిలు గ్రంథములలో ఆయా మతములవారు తప్పుగా భావమును గ్రహించినట్లు తెలిస్తే, అప్పుడు మాత్రము ఆ వాక్యములకు సరియైన భావములను తెలుపుచుందురు. ఏ గ్రంథములో అయినా దేవుని భావమునకు, దేవుని మాటకు భంగము కలుగకుండా చూడడము ముఖ్యమైన పనిగా భావించుచుందురు. ఇందూ జ్ఞానవేదిక (I.G.V) పూర్తిగా మా పర్యవేక్షణలోనే సాగుచుండును.

యూనివర్సల్ ఇస్లామిక్ రిసెర్చ్ సెంటర్ (U.I.R.C) వారు ఏసు శిలువ మీద మరణించలేదు అను వాదనను తెలుపుచుండగా, బైబిల్ ఓపెన్ యూనివర్సటీ ఆఫ్ ఇండియా వారు B.O.U.I ఏసు శిలువమీద మరణించాడని వాదించుచున్నారు. ఇరువురు మాది సత్యము, మీది అసత్యము అని ఒకరికొకరు ఛాలెంజ్ మీద ఛాలెంజ్ చేసుకోవడము జరిగినది. ఇందులో ఎవరిది తప్పు, ఎవరిది ఒప్పు అని ఇందూ జ్ఞానవేదిక ఆలోచించవలసి వచ్చినది. ఒక విధముగా U.I.R.C వారు చెప్పుచున్నట్లు ఏసు శిలువమీద చనిపోలేదు అనుమాట సత్యమని చెప్పవచ్చును. అదే విధముగా B.O.U.I వారు చెప్పుచున్నట్లు ఏసు శిలువమీద మరణించాడు అనుమాట కూడ సత్యమే అని చెప్పవచ్చును. ఈ మా మాట వినిన వారు ఎవరైనా, ఇదేమి వింత రెండు వాదనలు పరస్పర విరుద్ధముగా ఉన్నప్పుడు, ఏదో ఒకటి సత్యమగును మరొకటి అసత్యమగును కదా! అట్లు కాకుండా రెండూ సత్యమనడము ఎలా సరిపోవును? మీరు చెప్పునది కట్టె విరగకూడదు, పాము చావకూడదని చెప్పినట్లున్నది. మీరు చెప్పునది సత్యాసత్య నిర్ణయము

కాదు అని ఎవరైనా అనవచ్చును. దానికి మా సమాధానము పూర్తిగా వివరించి చెప్పితే ఇలాగున్నది.

మేము ఒక విధముగా ఇద్దరి వాదన సత్యమే అని చెప్పాము కానీ, అన్ని విధముల వారి వాదన సత్యమని చెప్పలేదు కదా! వారు ఒక విధముగా తమ మాట సత్యముగా ఉన్నదానివలన, తమ వాదనే సత్యమని పూర్తి నమ్మకముతో చెప్పుచున్నారు. అయితే శాస్త్రబద్ధముగా చూస్తే మా మాట సత్యమా, అసత్యమా అని వారు యోచించలేదు. ఆ రెండు సంస్థలలోని అధ్యక్షులు ఇద్దరూ ఆలోచనలో మేధావులేకానీ, యోచనలో కొంత వెనుకబడి యున్న విషయము వారికి తెలియదు. ఆలోచనలు వారి బుద్ధియొక్క గొప్పదనమును బట్టియుండును. వారి బుద్ధి గొప్పదే! అందులో అనుమానము లేదు. గ్రంథములో ఎక్కడేమున్నది జ్ఞాపకము (మననము) చేయు వారి మనస్సు కూడా గొప్పదే, అందులో కూడా సంశయము లేదు. అయితే వారివారి బుద్ధికి అందివ్వబడు యోచనలు వారివికాదు, వారి ఆత్మవి అయినందువలన, వారి ఆత్మ ఈ విషయములో వారి బుద్ధికి యోచన అందివ్వలేదని అర్థమగుచున్నది. అందువలన వారు, వారి ఆలోచనకు సరిపోయిన విషయమునే సత్యమని చెప్పుచున్నారు. ఎవరైనా వారు ఆలోచనా విధానము ప్రకారమే చెప్పుచుందురు. దానిప్రకారమే వారు మాది సత్యము, మాది సత్యము అని అంటున్నారు. అయితే వారి ఇరువురూ తాము చెప్పునది సిద్ధాంతమా కాదా, శాస్త్రబద్ధమా కాదా అని చూడడము లేదు. అలా చూడగలిగితే రెండువైపుల వాదనలు శాస్త్రబద్ధము కావనీ, అసత్యములనీ, చివరిలో ఫలితమునిచ్చు సిద్ధాంతము కాదనీ తెలియగలదు.

ఏసుప్రభువు యొక్క జీవితమునందు చివరిలో జరిగిన యదార్థ సంఘటనను గురించి, ఒకరు మరణించాడనీ, మరొకరు మరణించలేదనీ చెప్పు విషయమును, అటువంటి సంఘటనతోనే పోల్చి చూచుట వలన దానిలోని అసలైన సత్యము తెలియుటకు అవకాశమున్నది. కావున ఏసుప్రభువు మరణమును పోలిన మరొక యదార్థ సంఘటనను పరిశీలించి చూస్తాము. ఈ మధ్య కాలములో వీరి వాదన మొదలైన తర్వాతనే తమిళనాడులోని కరూరు జిల్లాలో ముత్తుస్వామి అనునతడు చనిపోవడము జరిగినది. ఉదయము చనిపోయినట్లు డాక్టర్లు ప్రకటించగా, చివరిలో శవానికి చేయవలసిన కార్యక్రమములన్ని చేసి, శ్మశానానికి తీసుకపోయి చితిమీద పడుకోబెట్టి అగ్గిపెట్టుటకు కొద్ది క్షణముల ముందు, శవము తిరిగి సజీవమై లేవడము జరిగినది. అందరూ ఆశ్చర్యపోయి ముత్తుస్వామిని ఇంటికి తీసుకపోవడము జరిగినది. ఈ విషయము పూర్తిగా తెలియుటకు ఈనాడు వార్తాపత్రికలోని సమాచారమును తర్వాత పేజీలో పొందు పరుచున్నాము.

గతములో మేము **"మరణ రహస్యము"** అను ఒక చిన్న గ్రంథమును వ్రాశాము. మరణ రహస్యము క్రీ.శ. 2011 సంవత్సరములో వ్రాయగా, **"జనన మరణ సిద్ధాంతము"** అను గ్రంథమును క్రీ.శ. 1980 సం॥ లోనే వ్రాశాము. మరణ రహస్యమును కూడా సిద్ధాంతముతో కూడుకొన్నట్లు, పూర్తిగా శాస్త్రబద్ధతతో వ్రాశాము. అందులో మరణము అనునది మూడు రకములుగా ఉన్నదనీ, అందులో ఒకటి కాల మరణమనీ, రెండవది అకాల మరణమనీ, మూడవది తాత్కాలిక మరణమనీ వివరించి చెప్పడము జరిగినది. మరణ రహస్యములోని సిద్ధాంతము ప్రకారము ముత్తుస్వామి తాత్కాలిక మరణమును పొందాడుగానీ, మరణమును పొందలేదు.

ఈనాడు, బుధవారం జూలై 11, 2012

# సోదరి రోదనతో చితి నుంచి లేచిన వ్యక్తి

చెన్నై, న్యూస్‌టుడే: కాసేపటిలో చితిలో కాలిపోవాల్సిన వ్యక్తి, సోదరి పిలుపుతో ప్రాణాలతో బయటపడిన వింత సంఘటన ఇది. తమిళనాడులోని కరూరు జిల్లా కట్టలై గ్రామానికి చెందిన ముత్తుస్వామి(50) రైతు. తీవ్ర అస్వస్థతకు గురైన ముత్తుస్వామిని పదిరోజుల కిందట కరూర్‌లోని ఓ ప్రైవేటు ఆసుపత్రిలో చేర్చారు. దీంతో గత ఆదివారం జరిగిన కుమార్తె సరిత వివాహానికీ ఆయన హాజరుకాలేకపోయారు. ఇదిలా ఉంటే చికిత్స ఫలించక ముత్తుస్వామి మరణించినట్లు వైద్యులు సోమవారం ఉదయం ప్రకటించారు. పెళ్లి ఇంటికి శవం రావటం మంచిదికాదన్న కొందరి సూచన మేరకు ముత్తుస్వామి మృతదేహాన్ని నేరుగా శ్మశానానికి తరలించారు. అంత్యక్రియలు ప్రారంభమయ్యాయి. ఇంతలో కోయంబత్తూరు సమీపంలోని సోమూరికి చెందిన ముత్తుస్వామి సోదరి పాప్పాత్తి.. అన్న మరణవార్త తెలుసుకుని శ్మశానానికి చేరుకుంది. అన్నను ఆ పరిస్థితిలో చూసిన ఆమె 'అన్నయ్యా..' అంటూ మృతదేహంపై పడి పెద్దగా ఏడుపు అందుకుంది. కాసేపటికే ముత్తుస్వామి చేతి వేళ్లు, కాళ్లలో కదలికవచ్చింది. కళ్లుకూడా తెరిచారు. దీంతో అక్కడున్నవారంతా ముత్తుస్వామి అంటూ బిగ్గరగా పిలిచారు. ముత్తుస్వామి అతికష్టమ్మీద ఏంటంటూ అడిగాడు. ఆయన ప్రాణంతోనే ఉన్నట్లు నిర్ధరించుకున్న గ్రామస్థులు ఇంటికి తీసుకొచ్చారు. ప్రస్తుతం పులియూరులోని ప్రభుత్వాసుపత్రిలో చికిత్స పొందుతున్నాడు.

గతములో ఎందరో తాత్కాలిక మరణమును పొంది పది, పదిహేను రోజుల తర్వాత తిరిగి లేచిన సంఘటనలు కూడా కలవు. ఉదయము చనిపోయి సాయంకాలము లేచిన వారు కూడా కలరు. ఈ మధ్యన విజయనగరం జిల్లాలో ఒక వృద్దురాలు చనిపోయిన తర్వాత మూడు రోజులకు లేచిన సంఘటన కూడా జరిగినది.

ఇప్పుడు అసలు విషయానికి వస్తాము ఏసుప్రభువు శిలువ మీద చనిపోవడము వాస్తవమే, అయినా అది వాస్తవ మరణముకాదు, తాత్కాలిక మరణము మాత్రమే ఆయన పొందాడు. కావున ఆయన శిలువ మీద మరణించలేదనియే చెప్పవచ్చును. అందువలన ఒక విధముగా B.O.U.I వారు ప్రభువు మరణించాడను మాట అసత్యము. ఏసు మూడవ రోజు తన పదకొండుమంది శిష్యులకు కనిపించి, నేను చనిపోలేదని ఏసే సాక్ష్యము చెప్పగా, చనిపోయాడనుట పొరపాటు కాదా! ఇకపోతే ఏసు శిలువ మీద చివరిగా ఒకమాట చెప్పి తలవాల్చి చనిపోవడము అక్కడున్న వారు చూచారు. తర్వాత ఆయనను బల్లెముతో పొడిచినప్పుడు ఆయన శరీరములో శ్వాస లేదు. శిలువమీద నుండి ఏసు శరీరమును దించినప్పుడు కూడా ఆయన చనిపోయిన స్థితిలోనే ఉన్నాడు. సమాధిలో ఉంచినప్పుడు కూడా ఆయనలో ప్రాణములేనట్లు ఆయన శిష్యులు చూచారు. శిలువ మీద నుండి దించినప్పటి నుండి, ఆయనను సమాధిలో పెట్టు వరకు ఏసుప్రభువు శరీరములో ఏ కదలికగానీ, శ్వాస ఆడడముగానీ లేదు. కావున అప్పుడు ఆయన మరణస్థితిలో ఉన్నట్లు ఆయన శిష్యులే మనకు సాక్ష్యము నిచ్చుచున్నారు. దీనినిబట్టి U.I.R.C వారు ప్రభువు మరణించలేదు అనుట అసత్యము. దైవజ్ఞానములో గొప్పవారిగా కనిపించువారే, తమలో సంపూర్ణమైన అవగాహన లేనిదానివలన, కొద్దిగా తెలియని తనము (అజ్ఞానము) తమలో

ఉండుట వలన, ఇరువురూ సత్యమునకు కొద్ది దూరముగా పోయారని తెలియుచున్నది.

పూర్తిగా చనిపోయిన మనిషికి శరీరములోని కీళ్ళు కదలకుండ బిగుసుక పోవడము, రక్తము గడ్డకట్టిపోవడము, శ్వాస ఆడక నిలిచిపోవడము పైకి కనిపించు చిహ్నములుగా ఉండును. ఇటువంటి చిహ్నములను చూచిన వారు చనిపోయిన మనిషిని సులభముగా గుర్తించగలరు. అయితే ఇక్కడ అందరికీ తెలియని విషయమేమనగా! శ్వాస ఆడకుండ నిలిచిపోయినప్పటికీ, గుండెకొట్టుకోక పోయినప్పటికీ, రక్తప్రసరణ జరగనప్పటికీ, శరీరమంతా చైతన్యములేకుండ నిలిచిపోయినప్పటికీ, శరీరములో తలయందు జీవుడుంటాడనీ, అతను బ్రతికియున్నట్లేననీ ఎవరికీ తెలియదు. పైకి చనిపోయినట్లు శ్వాస ఆడకున్నా, తాత్కాలిక మరణము పొంది పైకి చనిపోయినట్లు కనిపిస్తున్నా, లోపల జీవుడుంటే వాడు ఏ స్కానింగ్‌కు తెలియడు కానీ, అటువంటి శరీరములో రెండు చిహ్నములు బాగా కనిపించును. అతని శరీరములో రక్తము ఘనీభవించదు. అలాగే కీళ్ళు సులభముగా కదలుచుండును. ఏసు శిలువమీద తాత్కాలిక మరణము పొందియుండుట వలన, ఆయన శరీరములో రక్తము గడ్డకట్టక ద్రవ రూపములో ఉండుట వలన, ఏసుప్రభువు చనిపోలేదనీ అందరిలాగ బ్రతికేవున్నాడనీ U.I.R.C వారు పొరబడ్డారు. ముక్కు రంధ్రములలో శ్వాస ఆడడము లేదు అని తెలియక, అతను ప్రాణవాయువును పీల్చుచు ప్రాణముతోనే ఉన్నాడనుకొన్నారు. వాస్తవానికి ఆ సమయములో ప్రభువుకు ప్రాణములేదు. కావున అతను చనిపోయాడని చెప్పడము B.O.U.I వారి మాట పైకి కనిపించు సత్యమని చెప్పవచ్చును.

ఒక మనిషి మరణిస్తే పైకి కనిపించు చిహ్నములతోనే వానిని మరణించాడని చెప్పడము పూర్తి నిర్ధారణ కాదు. ఆ మరణము సత్యమూ కావచ్చును, అసత్యమూ కావచ్చును. ఏసుప్రభువు బ్రతికియున్నప్పుడే ఒక ఊరిలో ఒక బాలిక మరణించి ఉండగా, ఆ శవమును శ్మశానమునకు తీసుకొని పోవుటకు డప్పులు వాయించుచుండగా, ఏసు అక్కడికిపోయి ఎందుకు డప్పులు వాయించుచున్నారని అడుగగా, అక్కడున్నవారు బాలిక చనిపోయింది. శవాన్ని తీసుకొని పోవుటకు ప్రయత్నిస్తున్నామని చెప్పారు. అప్పుడు ప్రభువు ఆ బాలిక చనిపోలేదు అని చెప్పి, ఆ బాలికను తట్టి లేపగా ఆమె తిరిగి సజీవముగా లేచింది. అక్కడ ఏసు తాత్కాలిక మరణమును గుర్తించినట్లు మనకు అర్థమగుచున్నది. బైబిలు గ్రంథములో మత్తయి 9వ అధ్యాయమునందు 23,24,25 వాక్యములలో ఇలా కలదు. "స్థలమియ్యుడి ఈ చిన్నది నిద్రించుచున్నదేగానీ చనిపోలేదని వారితో చెప్పగా, వారాయనను అపహసించిరి. జనసమూహమును పంపివేసి, ఆయన లోపలికి వెళ్ళి ఆమె చెయ్యిపట్టుకోగానే ఆ చిన్నది లేచెను. ఈ సమాచారము దేశమంతటా వ్యాపించెను." ఆ కాలములో ఏసే స్వయముగా ఆమె చనిపోలేదు అని అందరి దృష్టిలో చనిపోయిన బాలికను గురించి చెప్పాడు. అయినా క్రైస్తవ బోధకులైన వారికి ఆ విషయము ఏమాత్రము అర్థము కాలేదు. పైగా ఏసు మూడు రోజులకు తిరిగివచ్చి నేను చనిపోలేదు, ముందున్న శరీరమేవుంది చూడండి అని ఆయన చేతులకు, ప్రక్క కడుపుకు ఉన్న గాయములను సాక్ష్యముగా చూపినా, అర్థము చేసుకోలేక ఏసు చనిపోయాడని చెప్పువారి మెదడుకు, ఎంత గ్రాహితశక్తియున్నదో అర్థమగు చున్నది. నేటికైనా మేము ఎంత అజ్ఞానములో ఉన్నామని చింతించక, పొగరుపట్టిన దున్నపోతు రైలును ఢీకొట్టినట్లు నాకు ఎవరూ సాటిలేరు,

నాకు ఎవరూ పోటికీ రారు, నా చేతులు దురదగా ఉన్నాయి, నేను సింహాన్ని అని అనుకొంటూవుంటే, దేవుడు అటువంటివాన్ని చూచి వీడు ఈ యుగములో కాకపోయినా, వచ్చేయుగములో అయినా జ్ఞాని అవుతాడను నమ్మకములేదే అని అనుకొంటాడు. అటువంటి వారిని దయ తలచి వారికి తన జ్ఞానమును తెలియజేయుటకు దేవుడే స్వయముగా వచ్చినా, మాకు అంతా తెలుసు అను అహముతోనున్నవారు, మేము మనుషులు చెప్పుబోధలు వినము, చదవము అని అంటారు. దేవుడు దేవునిగానే వచ్చుటకు ఆయనకు ఒక రూపమంటూ ఏదీ లేదు. అలాంటపుడు మనిషికి చెప్పుటకు మనిషిగానే వస్తే మనిషిమాట వినము అంటారు. అటువంటి వారికి దేవుడైనా ఎలా చెప్పగలడు?

భగవద్గీతనుగానీ, బైబిలుగానీ, ఖురాన్‌నుగానీ మనుషులే చెప్పారు తప్ప ప్రత్యేకించి దేవుడు చెప్పలేదు కదా! మేము **"మరణ రహస్యము"** అను గ్రంథమును సుందరరావుగారికి పంపి, ఇందులో ఏసుప్రభువు యొక్క మరణమునకు సంబంధించిన సమాచారమున్నది అని చెప్పితే, మాకువద్దు మనుషులు వ్రాసినవి మేము చదవము అన్నారు. అటువంటపుడు మేము ఒక ప్రశ్న అడుగుచున్నాము. మీరు కూడా కొన్ని గ్రంథములను వ్రాశారు కదా! మీరు చెప్పినట్లే మిగతావారు కూడా మేము మనుషులు వ్రాసిన గ్రంథములను చదవము అంటే, మీ మాదిరే ఇతరులు మాట్లాడితే, మీ గ్రంథములను ఎవరూ చదవరు కదా! అటువంటపుడు మీరు గ్రంథములను ఎందుకు వ్రాశారు? దేవుడు ఎప్పుడైనా, ఏ విధముగానైనా, ఏ రూపములో నైనా మనుషులకు తన జ్ఞానమును తెలియజేయునను ఉద్దేశముతో, మేము మీరు వ్రాసిన గ్రంథములను మీవద్దనేకొన్నాము. అదే ఉద్దేశ్యము మీకెందుకు లేదు? ఒకవేళ ఏసే మీ కొరకు జ్ఞానసందేశమును పంపినా, లేక ఆయనే

మీవద్దకు వచ్చి చెప్పినా, మీరు వినకపోతే లేక ఆయన సందేశమును మీరు చదవకపోతే మీరు జ్ఞానములో నష్టపోయినట్లు కాదా! మేము ఆత్మజ్ఞానులమనుకొనినా! ఆత్మ అంటే ఏమిటో తెలియదు. అది ఏ పనిని చేస్తున్నదో తెలియదు. ఆత్మ శరీరములో ఎక్కడ నివాస మున్నదో తెలియదు, మరణములో ఆత్మ ఏమి చేయుచున్నదో తెలియదు. ఆత్మను గురించిన జ్ఞానమే లేకుండా ఆత్మజ్ఞానులమనుకోవడము, మాకు ఎవరూ సమానులు లేరనడమూ, మేము సింహాలము, మా చేతులు పోటీకి దురదలెత్తాయనడము మీలోని అహము యొక్క పని కాదా!

శరీరములో కొన్ని కనిపించు భాగములు, కొన్ని కనిపించని భాగములున్నాయి. వాటిలో మనస్సు, బుద్ధి, అహము కనిపించవు. అయితే వాటి పని మాత్రము బయటికి తెలియుచుండును. బైబిలులో ముఖ్యమైన సారాంశము అహమును వదలుకొమ్మని ఉన్నది. నేను ఫలానా అని చెప్పు కోవడమే అహము యొక్క పని. అసలుకు నీవు శరీరములో ఎక్కడవున్నావు? ఏ రూపములో ఉన్నావు? అని ప్రశ్నించితే ఒక్క దానికి కూడా జవాబు తెలియదు. జీవాత్మ అయినవాడు తనను గురించియే తాను తెలియడు. ఎప్పుడైనా తనను గురించి తెలిసిన తర్వాతనే ఆత్మను గురించి తెలియగలడు. ఆత్మను గురించి తెలిసిన తర్వాతనే పరమాత్మయిన దేవున్ని గురించి తెలియబడును. ఇది దారికాగా, తనను గురించి తాను తెలియనివాడు నేను ఇంత, నేను అంత అని చెప్పుకోవడము జరుగుచుండును. తనను గురించి (జీవాత్మను గురించి) తెలిసినవాడు అహముతో కూడుకొని మాట్లాడడు. అయితే కొందరు తమ మతగ్రంథములను అడ్డము పెట్టుకొని, ఇతరుల దృష్టిలో గొప్పవారమనిపించుకోవడము కొరకు, తమ మూల గ్రంథములోని సూత్రములను అతిక్రమించి మాట్లాడుచుందురు. జీవాత్మ

మూడు రకముల మరణములను పొందుటకు అవకాశము కలదని తెలియనివారు, ఏసు ప్రభువు శిలువ మీద నేను మరణించలేదని చెప్పు చున్నప్పటికీ, మరణించాడని ఆయనను గురించి ప్రచారము చేయడము ప్రభువు మాటను అగౌరవపరచినట్లు కాదా!

ఏసు మరణించి మూడురోజులకు తిరిగి లేచాడు, కావున ప్రభువు గొప్పవాడు, ఆయన నిజముగా దేవుడు, అలా లేచినవారు ఎవరూ లేరు. అందువలన మా దేవునితో సమానము ఎవరూ లేరని కొందరనుచున్నారు. అలాగే అనుకొంటే తమిళనాడులో చితిమీదనుండి లేచిన ముత్తుస్వామి కూడా గొప్పవాడే అగును. అంతేకాక ఎందరో అలా లేచిన వారున్నారు వారంతా ఏసుతో సమానులగుదురు కదా! అందువలన మనము ఏమీ తెలియకుండా ఏసుప్రభువు మరణమును గురించి మాట్లాడితే, ఆయన గౌరవమును తగ్గించినట్లే అగును. కావున మీరు ప్రపంచ విషయములను ఎట్లు మాట్లాడినా ఫరవాలేదు గానీ, దేవుని విషయములో అహమును వీడి, తన్ను తాను తగ్గించుకొని మాట్లాడడము, అందరికీ మంచిదని చెప్పుచున్నాము.

ఏ మతములోని మనిషి అయినా దేవుని విషయములో పొరబడి నప్పుడు వారికి సత్యమును తెలుపడము మా కర్తవ్యము. అందువలన ప్రభువు మరణములో ఒకరినొకరు సవాళ్ళు, ఛాలెంజ్‌లు విసరుకొన్నవారికి ఏసుప్రభువు మరణమును గురించిన సత్యము తెలియజేయు **"మరణ రహస్యము"** అను గ్రంథమును విశాఖపట్టణములో మా అనుచరులు సుందర రావుగారికి B.O.U.I లో ఇస్తే వారు తీసుకోలేదు. హైదరాబాద్‌లో U.I.R.C వారికి ఇస్తే తీసుకొన్నారు గానీ, వారు ఏమాత్రము దానిని చదవలేదు. మాకు అంతా తెలుసు అను భావము ఇరువైపులవారిలో ఉండుట వలన,

వారు మేము చెప్పిన మరణ రహస్యమును చూడలేదు. ఇరువైపుల వారికి సత్యము తెలియాలంటే చివరకు మేము చెప్పినదే ఆధారమగును. మీదేమైనా దేవుని బోధనా అని ఎవరైనా మమ్ములను ప్రశ్నించితే సత్యము తెలిసేటప్పుడు దేవుని బోధయే అనుకొంటే తప్పేముంది అని జవాబుగా ప్రశ్నించుచున్నాను. గొప్ప జ్ఞానులమనుకొను వారిలో కూడా అజ్ఞానము ఎలా దాగియుందో, వారు ఎలా దానిని గుర్తించ లేకపోవుచున్నారో, తెలుపుటకు తార్కాణముగా ఈ విషయమునంతటిని చెప్పవలసివచ్చినది. ఈ విషయము తెలియుట వలన కొందరైనా తమలోని అహమును తగ్గించుకోగలరు, అజ్ఞానమును దూరము చేసుకోగలరు.

ప్రకృతి పరమాత్మలలో ప్రకృతి కనిపిస్తుంది, దేవుడు కనిపించడు. ప్రకృతి స్థూలమైనది, పరమాత్మ సూక్ష్మమైనవాడు. అందువలన ఏ మతములోని మూలగ్రంథములో అయినా, స్థూలమైన శరీరములో సూక్ష్మమైన దేవుడున్నాడను విషయమే, ముఖ్యమైన సారాంశ జ్ఞానముగా ఉండును. దేవుడు సృష్ఠిని తయారు చేసినప్పుడు తననుండి ఒక ప్రకృతి భాగమును తయారుచేసి తర్వాత తాను మూడు భాగములుగా విడిపోయాడు. ఒక భాగమైన ప్రకృతిలో మూడు భాగములైన మూడు ఆత్మలుగానున్న దేవుడున్నాడు. దేవుని మూడు భాగములను, ప్రకృతిని కలిపి విశ్వము అంటున్నాము. ప్రకృతి అనంతమైనది. అనంతమైన ప్రకృతిలో అదృశ్యమైన దేవుడు మూడు విధములుగా, మూడు ఆత్మలుగా వ్యాపించియున్నాడు. మూడు ఆత్మల వివరమును శాస్త్రీయము చేయునదే త్రైతసిద్ధాంతము. త్రైత సిద్ధాంతమును స్వయముగా దేవుడే సృష్ట్యాదిలో చెప్పియున్నాడు. అది ఎవరికీ తెలియకుండా పోయిన దానివలన, మనిషిగా వచ్చిన భగవంతుడు దానినే భగవద్గీత రూపములో తిరిగి చెప్పాడు. భగవద్గీత కృష్ణుని చేత

చెప్పబడి ఐదు వేల సంవత్సరములు అయిపోయినా అప్పటినుండి ఇప్పటి వరకు త్రైత సిద్ధాంతముగానున్న మూడు ఆత్మల విషయము ఎవరికీ తెలియలేదు. ఇప్పుడు మాకు అందిన యోచనలలో త్రైతసిద్ధాంతము తెలిసినది. దానినే మీకు చెప్పుచున్నాను. అసూయలేకుండా వింటే అర్థమవుతుంది. తిరువాత లేనిదే కూర పూర్తి కానట్లు, త్రైత సిద్ధాంతము తెలియనిదే ఎవరూ సంపూర్ణ జ్ఞానికాలేడు. దేవుని జ్ఞానమును తెలియాలంటే, పరమాత్మను గురించి తెలియాలి. పరమాత్మను గురించి తెలియాలంటే, ముందు ఆత్మను గురించి తెలియాలి. ఆత్మను గురించి తెలియాలంటే, ముందు జీవాత్మను గురించి తెలిసివుండాలి. ఈ కాలములో మేము జ్ఞానములో ఉద్దండులము అనువారందరికి తాను జీవాత్మనను విషయము కూడా తెలియదు. ఒకవేళ తాను జీవున్ని అని తెలిసినా తాను శరీరములో ఎక్కడున్నదీ, ఏమి చేయుచున్నదీ, ఎలా బ్రతుకుతున్నదీ తెలియదు. కొందరు జీవుడు దేవుడు శరీరములోను ఉన్నారని చెప్పినా, రెండవ ఆత్మయొక్క విషయమే వారికి తెలియదు.

చాలామంది మేము జ్ఞానులమను వారందరూ, శరీరములోని ఆత్మల విషయముల జోలికే పోకుండా గ్రంథపఠనము చేసి, అందులోని వాక్యము లన్నిటిని తమకున్న జ్ఞాపకశక్తితో ధారాళముగా చెప్పుచూ, ఇతరుల దృష్ఠిలో జ్ఞానమును గొప్పగా తెలిసినవారుగా గుర్తింపు పొందుచున్నారు. అటువంటి వారు అన్ని మతములలోను ఎక్కువగా ఉండి గురువులుగా, జ్ఞానులుగా గుర్తింపుతోనున్నారు. కొందరైతే తమ మతగ్రంథములనే కాకుండా, ఇతర మతగ్రంథములను కూడా బాగా నేర్వగలిగి, వారి మనస్సుకున్న జ్ఞాపకశక్తి చేత సులభముగా తిరిగి చెప్పగలుగుచున్నారు. గ్రంథములలోని వాక్యము లను సందర్భానుసారముగా చెప్పడము విశేషతే అయినా, ప్రజల దృష్ఠిలో

గొప్పవక్తలుగా కనిపించినా, దానివలన సమాజములో గౌరవము లభించినా, వారిది గ్రంథములలోని స్థూలజ్ఞానమే అగునుగానీ, సూక్ష్మ జ్ఞానముకాదు. స్థూలజ్ఞానములో శక్తి ఉండదు. సూక్ష్మజ్ఞానములోనే జ్ఞానశక్తి ఉండును. స్కూలుకు పోవువాడు ప్రతి దినము హాజరు కొరకు పోయినా ప్రయోజనము లేదు. కొన్ని రోజులు హాజరులేకున్నా పరీక్షలో మార్కులు రావడము ముఖ్యము. అలాగే స్థూల జ్ఞానమైన గ్రంథపఠనము, దానిని తిరిగి చెప్పడము స్కూలులోని హాజరులాంటిది. సూక్ష్మజ్ఞానమైన ఆత్మల వివరము తెలియడము పరీక్షలో మంచిమార్కులు రావడములాంటిది.

మూల గ్రంథములలో స్థూల, సూక్ష్మ జ్ఞానమేమిటి? స్థూలమెంత సూక్ష్మమెంతవుండునని ప్రశ్నిస్తే దానికి సమాధానము ఇలాగ చెప్పు కొందాము. సృష్టి తయారైనప్పుడు దేవునినుండి ఒక భాగము ప్రకృతిగా విడిపోగా, మూడు భాగములుగా దేవుడు విడిపోయాడు. దేవుడు ఈ విధముగా ఆదిలో నాలుగు భాగములుగా విడిపోయాడని తెలియుచున్నది. ఒక భాగమైన ప్రకృతి స్థూలముగా కనిపించుచున్నది. మిగత మూడు భాగములైన మూడు ఆత్మలు సూక్ష్మముగా కనిపించకుండా ఉన్నవి. దీనినిబట్టి దేవుని నాలుగు అంశలలో ఒకటి స్థూలమైన ప్రకృతికాగా, మూడు సూక్ష్మమైన ఆత్మలుగానున్నవి కదా! దానిప్రకారమే దేవుని గ్రంథము ఏ మతములో తయారైనా, అది నాలుగు అంశలుగా ఉంటూ అందులో ఒక భాగము స్థూలమును గురించి, మిగతా మూడు భాగములు సూక్ష్మమును గురించి ఉండును. ఉదాహరణకు ఇందువుల మూల గ్రంథమైన భగవద్గీతలో ఒక భాగము స్థూలమైన ప్రకృతిని గురించి, ప్రకృతితో తయారైన శరీరమును గురించి ఉండగా, మూడు భాగములు క్షర, అక్షర, పురుషోత్తమ అను మూడు ఆత్మలను గురించి ఉన్నది. అలాగే క్రైస్తవుల బైబిలులోని నాలుగు

సువార్తల లోనూ, ముస్లీమ్‌ల ఖురాన్ గ్రంథములోనూ మూడు భాగములు సూక్ష్మజ్ఞానము, ఒక భాగము స్థూలజ్ఞానము కలదు. మా దృష్టిలో క్రైస్తవులకు దేవుడు చెప్పిన బైబిలు కేవలము మత్తయి, మార్కు, లూకా, యోహాను అను నాలుగు సువార్తలే. క్రైస్తవులు అందరూ అనుకొన్నట్లు 66 పాఠములను కాక అందులో నాలుగు పాఠములనే చెప్పుచున్నాము. కావున వారు స్థూల సూక్ష్మ జ్ఞానములను గురించి ప్రశ్నించలేకపోవచ్చును. ముస్లీమ్‌లు మాత్రము మా గ్రంథములో మీరు చెప్పినట్లు సూక్ష్మ జ్ఞానము ఎక్కడా కనిపించదే అని అడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! పవిత్ర ఖురాన్ గ్రంథములో "ఆలీ ఇమ్రాన్" అనబడు మూడవ సురాలో ఏడవ ఆయత్‌నందు ఇలా కలదు. "ఈ గ్రంథాన్ని అవతరింప చేసినవాడు దేవుడే. ఈ గ్రంథములో రెండు రకముల ఆయత్‌లు ఉన్నాయి. మొదటివి **'ముహ్కమాత్' (స్పష్టమైన)** వాక్యములున్నవి. ఇవి గ్రంథమునకు పునాదుల వంటివి. రెండవవి **'ముతషాబిహాత్' (అస్పష్టమైన)** వాక్యములు. వక్ర మనస్కులు కలతలను రేపేందుకు, అస్పష్టమైన విషయాలకు వక్రభావములు చెప్పే ప్రయత్నము చేస్తుంటారు. కానీ వాటి అసలు అర్థము అల్లాహ్ తప్ప మరెవ్వరికీ తెలియదు. జ్ఞానములో పరిపక్వత కలవారు మాత్రము 'మేము వీటిని విశ్వసించాము, ఇవన్నీ మా దేవునినుండి వచ్చినవే" అని అంటారు. వాస్తవానికి బుద్ధిగ్రాహితశక్తి గలవారు మాత్రమే హితబోధను గ్రహిస్తారు.

ఇక్కడ ముఖ్యముగా చెప్పునదేమనగా! ఖురాన్ గ్రంథములో స్థూలమైన వాటిని ముహ్కమాత్ వాక్యములనీ, సూక్ష్మమైన వాటని ముతషాబిహాత్ వాక్యములని రెండు రకముల పేర్లు పెట్టి చెప్పడము జరిగినది. దేవుని నుండి మొదట తయారైనది ప్రకృతి అదియే ముహ్కమాత్

(స్థూలము) అని చెప్పబడినది. మొదట తయారైనది పునాదిలాంటిది, దానిమీదనే కట్టడమును కట్టినట్లు ప్రకృతినుండి తయారైన శరీరమును ఆధారముచేసుకొని దానియందు మూడు ఆత్మలను ప్రతి ఒక్కరిలోను ఉంచడము జరిగినది. మూడవ సురా ఆలీ ఇమ్రాన్‌లో ఏడవ ఆయత్‌లో చెప్పినట్లు ఖురాన్ గ్రంథములో కూడా స్థూల సూక్ష్మ జ్ఞాన విషయములున్న వని తెలిసిపోయినది. ఈ విధముగా మూడు మూల గ్రంథములు దేవున్ని గురించి చెప్పినవే, కావున దేవుడు ఒకవంతు స్థూలముగా, మూడు వంతులు సూక్ష్మముగా ఉండుట వలన, ఆయన గ్రంథములలో ఎక్కడైనా ఒకటి మూడు నిష్పత్తిలో స్థూల సూక్ష్మములున్నవని చెప్పవచ్చును. అయితే మూల గ్రంథములలోని సూక్ష్మవిషయములు దేవునికి తప్ప ఇతరులెవరికి తెలియవు అని కూడా ఖురాన్ గ్రంథములో చెప్పబడినది. వక్ర బుద్ధిగలవారు సూక్ష్మమైన విషయములను చెప్పుటకు ప్రయత్నిస్తారు. దానివలన వక్ర భావము బయటికి వచ్చి ప్రజలలో నీ దేవుడు నా దేవుడు అనీ, నీ మతము నా మతము అని చిచ్చుపెట్టును తప్ప ప్రజలకు జ్ఞానము తెలియదు. బుద్ధియున్నవారు సూక్ష్మమైన విషయములను గురించి తాము చెప్పుటకు పూనుకొనరు. బుద్ధిగలవారు విని గ్రహించగలరు అని ఉన్నది కదా! అయితే ఇక్కడ ఒక పెద్ద ప్రశ్న రాగలదు. అదేమనగా! మూల గ్రంథములోను మూడువంతుల సూక్ష్మ వాక్యములను గురించి దేవునికి తప్ప ఎవరికీ తెలియనప్పుడు, ఒకవేళ ఎవరైనా వాటిని గురించి చెప్పుటకు పూనుకొంటే, వారు వక్రబుద్ధితో తప్పు భావములు చెప్పు అవకాశమున్నపుడు, బుద్ధిలో జ్ఞానములో పరిపక్వత చెందినవారు సూక్ష్మ విషయములను ఎలా గ్రహించ గలరు? మంచి బుద్ధియున్నవారు సూక్ష్మవాక్యముల జ్ఞానమును గ్రహించుకొనుటకు ఆ వాక్యములను గురించి దేవుడే చెప్పాలి కదా! అని అడుగవచ్చును. దానికి జవాబు ఇలా కలదు.

సందర్భానుసారము ఈ ప్రశ్న చాలా సమంజసమైనది. విచక్షణా బుద్ధిగలవారు ఎవరైనా ఈ ప్రశ్న అడుగవచ్చును. దేవుడు చెప్పినప్పుడే సూక్ష్మమైన జ్ఞానము మనుషులకు తెలియాలి తప్ప, మనుషులు ఎవరూ చెప్పుటకు వీలులేదు. ఎందుకనగా సూక్ష్మ జ్ఞానము దేవునికి ఒక్కనికే తప్ప ఇతరులకు తెలియదు, కావున దేవుడే చెప్పాలి అని మనము చెప్పు కొంటున్నాము. అయితే ముస్లీమ్ సమాజములో దేవుడు భూమిమీదికి రాడనీ, కనిపించి మాట్లాడువాడు ఎవడూ దేవుడు కాడనీ, దేవునితో సమానముగా ఎవరినీ పోల్చుకోకూడదని వారి వాదనకలదు. వారి వాదనతో మేము కూడా పూర్తిగా ఏకీభవిస్తాము. అయితే దేవుని వాక్యమైన ఖురాన్ గ్రంథములోని మూడవసురా, ఏడవ ఆయత్‌లోని వాక్యమును పూర్తిగా విశ్లేషించి చూచితే వాక్యమును చెప్పేవాడు, వాక్యమును విని గ్రహించేవాడు, వాక్యమును తెలిసినవాడు ముగ్గురు కలరు. వాక్యమును తెలిసినవాడు పూర్తిగా దేవుడనియే తెలిసిపోయినది. వాక్యమును విని తెలుసుకోగలవాడు శ్రద్ధగలిగిన బుద్ధిగలవాడు. వాక్యమును చెప్పాలని ప్రయత్నించువాడు వక్రబుద్ధిగలవాడు అని తెలిసి పోయినది. అయితే ప్రస్తుత కాలములో ఖురాన్ గ్రంథమును 114 అధ్యాయములతో (114 సురాలలో) మనము చూడవచ్చును. 114 సురాలలోని అన్ని ఆయత్‌లకు వివరము చెప్పబడిన గ్రంథమును మనము చూస్తున్నాము. అయితే పై వాక్యములోని విశ్లేషణ ప్రకారము చూస్తే ఇప్పుడు మనముందున్న గ్రంథములలోని వాక్యములు దేవునివే అయినా అందులోని వివరము మాత్రము మనుషులు వ్రాసినదే. అందువలన దేవుని వాక్యమును చూడు. అది నీకు అర్థముకాకపోయినా ఫరవాలేదు. అయితే వాక్యమునకు వ్రాయబడిన వివరమును మాత్రము చూడవద్దు. ఎందుకనగా దేవుని వాక్యము యొక్క వివరము దేవునికి

తప్ప ఇతర మనుషులకు ఎవరికీ తెలియదు. దానిని గురించి చెప్పుటకు ప్రయత్నించిన వారందరూ వక్రబుద్ధిగలవారే, వారి వక్రభాష్యముల వలన ప్రజలలో కలతలు రేగును అని ముందే చెప్పబడియున్నది. అందువలన గ్రంథములోని వాక్యమును చూడు, దాని భావమును చూడడములో జాగ్రత్త పడు. ఈ సూచన ఒక్క ఖురాన్ గ్రంథమునకు మాత్రమే చెప్పినది కాదు. దేవుని గ్రంథములన్నిటికీ వర్తించును. ఆ లెక్క ప్రకారము హిందువులు (ఇందువులు) భగవద్గీతను చూచినప్పుడు, ఖురాన్ గ్రంథమునందు మూడవ సురాలో చెప్పిన ఏడవ వాక్యమును జ్ఞాపకముంచుకొని చూడవలెను. దేవుని శ్లోకము సత్యమేగానీ, మనిషి వ్రాసిన భావము దేవునిది కాదు. అలాగే బైబిలు గ్రంథములో ఏసుప్రభువు చెప్పిన వాక్యమును మాత్రము చూడు. కానీ మనుషులు ఆ వాక్యమునకు చెప్పిన వివరమును వినవద్దు. ఇప్పుడు కొందరు కాదు చాలామంది ఇలా ప్రశ్నించవచ్చును. “మీరు చెప్పినట్లు వాక్యమును మాత్రము చూచి దాని భావమును నమ్మకపోతే, దేవుని వాక్యములోని నిగూఢమైన జ్ఞానము మాకెలా తెలియును? మూల గ్రంథముల లోని దేవుని వాక్యములన్నిటికీ మనుషులే వివరము చెప్పారు కదా! వారు చెప్పినది సరియైన భావము కాదనుకొంటే, గ్రంథములో 75 శాతము అసత్యమున్నట్లగును. అలాంటపుడు దేవుని జ్ఞానము ఎలా తెలియును? అని ప్రశ్నించవచ్చును. దానికి నా జవాబు ఏమనగా! నేను మీకు దేవుని వాక్యమునకు మధ్యవర్తిని మాత్రమే, దేవుడు చెప్పిన విషయమునే నేను చెప్పాను తప్ప స్వయముగా నేను ఏమీ చెప్పలేదు కదా! దేవుని వాక్యము దేవునికే తెలిసితే మాకెలా తెలియును? అని ప్రశ్నిస్తే నేనైనా జవాబు ఎలా చెప్పగలను. మీ మాటకు దేవుడే సమాధానము చెప్పాలి, కానీ మేము ఒకవేళ చెప్పినా అది సరియైన సమాధానము కాకపోవచ్చును.

నా అంచనా ప్రకారము ఖురాన్ గ్రంథములో మూడవ సురా, ఏడవ ఆయత్‌యందే చివరిలో ఒకమాట గలదు. బుద్ధిలో పరిపక్వత చెందినవారు, పూర్తి దేవుని జ్ఞానము మీద శ్రద్ధగలవారు మాత్రము దేవుని వాక్యములు దేవుని నుండి వచ్చినవేనని విశ్వసించి వాటిని గ్రహించగలరని కలదు. మనుషులు వ్రాసిన గ్రంథ వివరము సరిలేనప్పుడు మాకు వాక్యముల లేక శ్లోకములలోని అసలు వివరము ఎలా తెలియును అను ప్రశ్నకు దేవుడే వచ్చి చెప్పవలసిందేనని చెప్పగలము. దేవుడు దిగివస్తాడా అంటే భగవద్గీత గ్రంథములో జ్ఞానయోగము అను అధ్యాయమున 6,7,8 శ్లోకములలో ధర్మములను తెలియజేయుటకు మనిషిగా జన్మిస్తానని చెప్పాడు. ఖురాన్ గ్రంథములో 89వ సురా అల్‌ఫజ్ర్‌లో 22,23,24 సురాలలో ఈ విధముగా ఉంది "22) దేవదూతలు బారులు తీరియుండగ దేవుడు అవతరిస్తాడు (వస్తాడు). 23) నరకము సహితము తేబడిననాడు ఆనాడు మనిషికి జ్ఞానోదయమవుతుంది. కానీ ఆ రోజు జ్ఞానము తెలిసి ఏమి లాభము? 24) అయ్యో! నేను పరలోకము కొరకు ముందుగానే జాగ్రత్తపడి ఏదైన చేసుకొనివుంటే ఎంత బాగుండేది అని అనుకుంటాడు" దీని భావము దేవుడు అవతరించి వచ్చినప్పుడు మనిషికి అసలైన జ్ఞానము తెలియుననీ, అప్పుడు మనిషి ఇంతకాలము జ్ఞానములో పొరపడి అజ్ఞాన మార్గములో నడుచుకొన్నందుకు చింతించి, ముందే అసలైన జ్ఞానములో నడిచియుంటే ఎంత బాగుండేది అని అనుకొంటాడు. ఇదే విధముగా బైబిలు యోహాన్ సువార్తలో కూడా 16వ అధ్యాయములో 12,13,14 వాక్యములలో దేవుడు వచ్చి ప్రజలకు జ్ఞానమును తెలుపునని చెప్పబడివున్నది. ఈ విధముగా ఏ మనుషులకు తెలియని తన గ్రంథములోని సూక్ష్మజ్ఞానమును మనుషులకు ఏదో ఒక మనిషిగానే వచ్చిన దేవుడు తెలియజేయును. అప్పుడు ఆయన

(దేవుడు) చెప్పిన జ్ఞానమును బుద్ధిగలవాడు, శ్రద్ధకలవారు గ్రహించగలరు. ఇట్లు దైవగ్రంథములోని జ్ఞానమును తర్వాత దేవుడే తెలిపి, తన జ్ఞానమును సంపూర్ణము చేయును. ఈ పద్ధతిని ఎవరు నమ్మినా, నమ్మకపోయినా ఉన్న సత్యము ఇంతే. అన్ని మతములలోను ఇదే విధానము జరుగును.

సృష్ట్యాదిలోనే దేవుడు అనబడు శక్తి తననుండి ప్రకృతి అను ఒక భాగమును విభజించి తాను మూడు భాగములుగా విడిపోయినది. దాని వలన విశ్వములో ప్రకృతి భాగము పరమాత్మ భాగములు అని రెండు విధానములున్నాయి. ప్రకృతి స్థూలముగా ఉన్నది, అందరికి కనిపించు చున్నది. అందువలన దానిని (ప్రకృతిని) గురించి తెలియవలసిన పని లేదు. మనిషి తెలియవలసినది మూడు ఆత్మల రూపములో కనిపించకుండ యున్న దైవమును తెలియవలెను. దైవమును తెలియుటకు దేవుని జ్ఞానమే ఆధారము. దేవుడు తన విషయమును మూడు సిద్ధాంతముల రూపములో తెలిపియున్నాడు. ఒకటి అద్వైత సిద్ధాంతము, రెండు ద్వైత సిద్ధాంతము, మూడు త్రైత సిద్ధాంతము. అద్వైత సిద్ధాంతము రెండుకాని ఒక్క ఆత్మను గురించి తెలుపునదికాగా, ద్వైత సిద్ధాంతము రెండు ఆత్మల గురించి తెలుపు తుంది. ఇక మూడవదైన త్రైత సిద్ధాంతము మూడు ఆత్మలను గురించి తెలుపుతుంది. మనిషి అద్వైతమును తెలిసినా, ద్వైతమును తెలిసినా చివరకు త్రైత సిద్ధాంతమును తెలియనిదే మూడు భాగములుగానున్న దైవము తెలియదు. దేవున్ని తెలియాలంటే ఏ మనిషి అయినా చివరకు త్రైత సిద్ధాంతమును తెలియవలసిందే. ప్రపంచములో ఈ మార్గము తప్ప మరి ఏ ఇతర మార్గము లేదు. మనిషి భజనలతోనూ, భక్తితోనూ, ఆరాధనలతోనూ దేవున్ని తెలియలేడు. అవన్నీ నిన్ను దేవునికి భక్తున్ని చేయును తప్ప దేవునియందు చేర్చలేవు. ఒక మనిషి (ఒక జీవుడు) దేవునియందు

ఐక్యమైపోయి, తాను కూడా దేవునిగా మారిపోవుటకు తప్పనిసరిగా త్రైత సిద్ధాంత జ్ఞానమును తెలియవలెను. తెలిసి దానిప్రకారము నడువ గలిగినప్పుడు ఎంతటి పాపి అయినా, ఎంతటి అజ్ఞాని అయినా సంపూర్ణ జ్ఞానిగా మారిపోయి, పాపము (కర్మ) లేనివాడై పోయి దేవునియందు చేరిపోవును.

ఆధ్యాత్మిక విద్యలోనే త్రైత సిద్ధాంత జ్ఞానము ఎంతో గొప్పదనుటకు గుర్తుగా, దేవుడే కొన్ని సూచనలను భూమిమీద ఉంచాడు. ఆ సూచనలను కొంత వివరముగా తెలుసుకొనుటకు ప్రయత్నిస్తే ఈ విధముగా అర్థమగు చున్నది. విశ్వము కనిపించే మరియు కనిపించని మొత్తము నాలుగు భాగములుగా ఉన్నది. కనిపించేది ప్రపంచము లేక ప్రకృతి, కనిపించనివి మూడు ఆత్మలు అని తెలియుచున్నది. దీనినిబట్టి విశ్వములో జరుగు కాలమునకు నాలుగుయుగముల పేర్లను పెట్టారు. విశ్వమంతయు దైవము లోనిదే, కావున దేవుడు విభజింపబడిన భాగములు గుర్తుండునట్లు కాలమును నాలుగు యుగములుగా చెప్పారు. కాలము అనగా దేవుడు. అందువలన దేవుని నుండి విడివడిన ఒక ప్రకృతి, మూడు ఆత్మలను మనుషులు తెలియునట్లు, కాల స్వరూపమైన దేవున్ని నాలుగు యుగములుగా పేర్కొన్నారు. నాలుగు యుగములు దైవమునకు మారుపేరైనవని మా రచనలలోని **"కలియుగము"** అను గ్రంథములో వ్రాశాము. దానిని ఇక్కడ కొంత పొందుపరుచుచున్నాము.

ఇంతవరకు వాడుకలోయున్నవి, చాలామందికి తెలిసినవి కాలము లో పెద్దవి నాలుగుయుగములు. అందులో మొదటిది కృతయుగము, రెండవది త్రేతాయుగము, మూడవది ద్వాపరయుగము, నాల్గవది కలియుగము. ఒక విధముగా చెప్పితే నాలుగుయుగముల పేర్లు వేరువేరుగా

ఉండినా చివరిలో మాత్రము యుగములుగానే పిలువబడుచున్నవి. చివరిలో యుగములను వదలిచూస్తే ఒకటి కృత, రెండు త్రేతా, మూడు ద్వాపర, నాలుగు కలి అని చెప్పవచ్చును. ఈ నాలుగు పేర్లలో చివరి ద్వాపర, కలి అను రెండు పేర్లు పూర్వము పెద్దలు ఎలా నిర్ణయించారో అలాగే ఉన్నవి. ముందున్న కృత, త్రేతా అను రెండు పేర్లు కొద్దిగా మార్పు చెందియున్నవి. మొదటి పేరైన కృత అను పేరు పూర్వము కృత్ అను పేరుగా ఉండెడిది. కృత్ అనగా చేసినవాడు చేసినది అని అర్థము రాగలదు. కృత అంటే చేయబడినది అని అర్థము రాగలదు. ఇక్కడ విశ్వమును సృష్ఠించిన దేవున్ని ఉద్దేశించి పెట్టిన పేరు కృత్ అని తెలియుచున్నది. సర్వసృష్ఠిని తయారు చేసిన వానిని కృత్ అంటాము. చేయబడిన విశ్వమును కృత అంటాము. ఇక్కడ పెట్టిన పేరు కాలమును ఉద్దేశించి పెట్టినది, విశ్వమును ఉద్దేశించి పెట్టినది కాదు. అందువలన కృత్ అను పేరు వాస్తవమైనదని అర్థమగు చున్నది. ఈ విధముగా కాలక్రమమున కృత్యుగము కాస్త కృతయుగముగా మారి పోయినది. అర్థము వివరము తెలియనివారు గ్రుడ్డిగా కృతయుగము అంటున్నారు. సామాన్య ప్రజలే కాకుండా జ్యోతిష్యపండితులు కూడా అర్థ హీనమైన పేరుతోనే వ్రాయుచున్నారు. ఈ విధముగా మాయ అందరిని మభ్యపెట్టినది. ఇది కాలమునకు పెట్టినపేరని, కృత్యుగమే కానీ కృతయుగము కాదని పండితులు కూడా గ్రహించలేకపోయారు.

ఇక రెండవ పేరు కూడా అర్థహీనమైపోయినదని చెప్పవచ్చును. దేవుడు భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమున 16,17 శ్లోకములలో చెప్పినట్లు దేవుడు మూడు భాగములుగా ఉన్నాడు. దానినే ముగ్గురు పురుషులుగా అక్కడ చెప్పడము జరిగినది. క్షర పురుషుడు, అక్షర పురుషుడు, పురుషోత్తముడు అను ముగ్గురు పురుషులుగా దేవుడున్నాడు. ఆ ముగ్గురు

పురుషులనే జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అని మూడు ఆత్మలుగా కూడా చెప్పుచున్నాము. దేవుడు చెప్పిన జ్ఞానమును అనుసరించి దేవుని హెూదాకు తగినట్లు సూచన పదములను దేవునిపట్ల వాడెడివారు. కృత్ అనగా చేసినవాడని అర్థమునిచ్చు సూచన పదమేగానీ అది ఒక పేరుకాదు. వాస్తవముగా దేవునికి పేర్లుండవు. క్షర, అక్షర పురుషులకంటే ఉత్తమమైన వాడు అను సూచనతో పురుషోత్తముడు అన్నారు. అలాగే జీవాత్మ, ఆత్మలకంటే వేరైనవాడు అను అర్థమునిచ్చు పదముతో పరమాత్మ అని అన్నారు. పురుషోత్తమ అనినాగానీ, పరమాత్మ అనినాగానీ అవి అర్థము నిచ్చునవే గానీ పేర్లు మాత్రము కావు. అలాగే దేవుడు అనినా దేవులాడబడే వాడు (వెతకబడే వాడు) అని అర్థమేగానీ అది పేరు కాదు. అలాగే రెండవ యుగము ముందర దేవుని విధానమును తెలుపు పదమును ఉపయోగిస్తూ త్రైతా అన్నారు. త్రైతా అనగా మూడవది. దేవుడు మూడవ పురుషుడు లేక మూడవ ఆత్మ కావున కాలమును త్రైతాయుగము అన్నారు. అయితే కాలక్రమమున అజ్ఞానము పెరిగిపోయి, త్రైతాయుగము కాస్త త్రేతా యుగముగా మారిపోయినది. త్రేతా అంటే అర్థములేదు. త్రైతా అంటే మూడవవాడు అని అర్థము గలదు. నేడు జ్యోతిష్యపండితులు, స్వామీజీలు, అందరూ త్రేతాయుగమనియే చెప్పుచున్నారు. ఊరంతా ఉత్తరమంటే మేము ఒక్కరు దక్షిణమన్నట్లు, అందరూ త్రేతాయుగము అంటూవుంటే మేము ఒక్కరూ త్రేతా కాదు త్రైతా అని చెప్పుచున్నాము. అయినా బుర్రలేని మనుషులు వినే స్థితిలోలేరు. ఇప్పటికైనా దేవుని గొప్పతనమునకు, విధానమునకు భంగము కలుగకుండా, అర్థహీనము కాకుండా కృత యుగమును వదలి కృత్ యుగమనీ, అలాగే త్రేతాయుగమును త్రైతాయుగ మని పిలువమని తెలుపుచున్నాము. కృత్ అను శబ్ధముగానీ, త్రైత అను

శబ్ధముగానీ కాలమునకు పూర్తిగా సరిపోవునని తెలియవలెను. కాల క్రమములో అజ్ఞానము పెరిగిపోయి కొన్ని విషయములు తెలియక పోయినా, వాటిని గురించి వివరముగా తెలుపువారు వచ్చి తెలిపి నపుడు, అందులోని సారాంశమును గ్రహించి, ఏది సత్యమో ఆలోచించి దానిప్రకారము నడుచుకోవడము విజ్ఞుల లక్షణము.

మూడవది ద్వాపర అని కలదు. ఇంతకు ముందే దేవున్ని పరమాత్మ అని అంటారని చెప్పుకొన్నాము. ఆత్మకంటే వేరుగా ఉండేవాడు కనుక పరమాత్మ అని అంటాము. జీవాత్మ, ఆత్మకానివాడు పరమాత్మ. అలాగే క్షరపురుషుడు, అక్షరపురుషుడు కానివాడు పురుషోత్తముడు. మూడు ఆత్మలలో మూడవ దానిని త్రైతా అంటాము. అట్లే మూడింటిలో రెండూ కానిది దేవుడు అనుటకు ద్వాపర అని అంటాము. ద్వా అనగా రెండు అనీ, పర అనగా వేరైనది అని అర్థము. ద్వాపర అనగా రెండిటి కంటే వేరుగా ఉన్నదని అర్థము. దేవుని హెూదాకు తగినట్లు ఉన్న శబ్ధము ద్వాపర. కావున పూర్వము పెద్దలు కాలమునకు ద్వాపర అని సూచనగా పిలిచారు. దానినే ద్వాపరయుగము అని అంటాము. ఇది పూర్వము పెద్దలు నిర్ణయించిన పదము. అదృష్టవశాత్తు ఈ పదము, దాని అర్థము మారకుండా అలాగే ఉన్నది. ఇది దేవుని గుర్తని మేము చెప్పుటకు సాక్ష్యముగా నిలిచింది. ఇక నాల్గవది కలియుగము. ఇది కూడా పూర్వము పెద్దలు నిర్ణయించినట్లే అర్థము చెడకుండా ఉన్నది. భగవద్గీతలో నీవు ఎవరు అని అర్జునుడు అడిగినపుడు దానికి జవాబుగా "కాలోస్మి లోకక్షయ" అని అనడము జరిగినది. దాని అర్థము "లోకమును నాశనము చేయు కాలమును" అని గలదు. దీనిప్రకారము కాలము సర్వులను నాశనము చేయుచున్నదని అర్థమగుచున్నది. దేవుడు అందరిని, అన్నిటిని సృష్ఠించు

సృష్టికర్తయేకాక, తాను సృష్టించిన అందరినీ, అన్నిటినీ నాశనము చేయ గలడు. అందువలన తనను లోకక్షయునిగా చెప్పాడు. క్షయము అనగా నాశనము. దేవున్ని ఆయన హెూదాకు తగినట్లు పిలువడము ధర్మమగును. కావున అదే ఉద్దేశముతోనే కాలమునకు కలియుగము అని సూచించారు. కలి అనగా నాశనమును కల్గించుయుద్ధము అని అర్థము. యుద్ధము అంటే నాశనమే అని అర్థము కావున దేవున్ని కలిపురుషుడు అన్నారు. అదే ఉద్దేశముతో కాలమును కలియుగము అని అన్నారు. పూర్వము కొందరు జ్ఞానులు ఒకచోట కూర్చొని కాలమునకు పేరుకాని పదములను నిర్ణయించారు. ఆ పదములు దేవుని ధర్మములకు తగినట్లు ఏర్పరచారు. వారు సక్రమముగా ఏర్పరచినవి 1) కృత్‌యుగము 2) త్రైతాయుగము 3) ద్వాపరయుగము 4) కలియుగము. అయితే ముందరున్న రెండు పెద్ద పేర్లు కొంతమారిపోయి కృత్‌యుగము కృతయుగముగా, త్రైతాయుగము త్రేతాయుగముగా మిగిలి ఉన్నాయి.

యుగముల పేర్ల విషయములో ఇప్పుడు సంచలన వార్త తెలిసి నట్లయినది. ఇప్పుడు చెప్పిన సత్యమును కొందరు బాగా అర్థము చేసుకో గలిగినా, కొందరు మాత్రము జీర్ణించుకోలేకపోవచ్చును. అటువంటి వారు ఇప్పుడు చెప్పబోవు మరొక విషయమును వింటే పూర్తిగా వాంతి చేసు కుంటారేమో అనిపిస్తుంది. సత్యాన్వేషులకు మేము చెప్పు సత్యములు మంచి అహారముగా ఉండగా, అన్వేషణ లేనివారికి మేము చెప్పు విషయములు ఏమాత్రము జీర్ణముకావు. మన ఆధ్యాత్మిక గ్రంథములలోని ఆధ్యాత్మిక విద్య అంతయు జీవుడు దేవునియందు ఐక్యమగు విధానమునే చూపాయి. అలా ఐక్యమగుటనే ముక్తి పొందడము లేక మోక్షమును పొందడము అంటారు. దేవుని సమాచారము, జ్ఞానము ధర్మములు

ఎక్కడున్నాయో అక్కడంతా జీవ బ్రహ్మ ఐక్య విధానమే ఉంటుంది. బ్రహ్మవిద్యాశాస్త్రములో ముఖ్యగ్రంథమైన భగవద్గీతలో దేవునియందైక్యమగు విధానములనే ముఖ్యముగా చెప్పారు. దేవున్ని చేరు విధానమునే యోగము అని గీతలో చెప్పారు. అటువంటి యోగములు ధర్మముల ప్రకారము చెప్పబడునవి రెండే రెండు గలవు. అందులో ఒకటి బ్రహ్మయోగము, రెండవది కర్మయోగము. ధర్మములకు అతీతమైన యోగము కూడా ఒకటి కలదు. దానిని భక్తియోగము అంటాము. భక్తియోగము చాలాగొప్పది, అది అందరికీ అంత సులభముగా అర్థమగునది కాదు. ధర్మములతో కూడుకొన్న బ్రహ్మ, కర్మయోగములను మనిషి అర్థము చేసుకోగలిగితే తర్వాత భక్తియోగము అర్థము కాగలదు. భగవద్గీతలో దేవుని విధానమంతయు సంపూర్ణముగా కలదు. అక్కడే యోగముల వివరమంతయూ సంపూర్ణముగా కలదు. ఈ విషయమంతా ఎందుకు చెప్పుచున్నామనగా! దైవస్వరూపము ఎక్కడైతే ఉన్నదో దానిలోనికి ఐక్యమైపొమ్మను విధానము కూడా అక్కడ ఉండునని అర్థమగుటకు చెప్పవలసివచ్చినది.

యోగము అంటే కలయిక అని అర్థము. వియోగము అంటే కలిసివున్నది విడిపోవడము అని అర్థము. యోగము అనుమాట దైవత్వమున్న చోటే చెప్పబడుతుందని చెప్పాము కదా! కాలము దైవస్వరూపము అన్నాము. అట్లే కాలమునకు దైవమును సూచించు కృత్ అనీ, త్రైతా అనీ, ద్వాపర అనీ, కలి అనీ పిలుచుచున్నాము. అటువంటి దైవస్వరూపమైన కాలముల ప్రక్కన యోగము అను శబ్ధమును పెద్దలు జత చేసిచెప్పారు. ఇంతవరకు మనము పిలుస్తున్న యుగములు పూర్వము యోగములుగా పెట్టబడినపేర్లు. వాస్తవానికి కృత్‌యోగము, త్రైతాయోగము, ద్వాపరయోగము, కలియోగము అను పేర్లు సత్యమైనవి. ధర్మములు అధర్మములుగా మారిపోవునని దేవుడు

గీతలో చెప్పినట్లు ధర్మములైన యోగముల పేర్లే చివరకు యుగములుగా పిలువబడుచున్నవి. యోగము అంటే దేవునియందు ఐక్యమై పొమ్మని అర్థముకాగా, యుగము అంటే ఏ అర్థములేదని చెప్పవచ్చును. కృత్, త్రైత, ద్వాపర, కలి అను దైవము యొక్క స్థితిని తెలియజేయు పదముల ప్రక్కన యోగముంటే అందమూ, అర్థమూ సరిపోవును. అట్లుకాక అంతపెద్ద పదముల ప్రక్కన అర్థములేని చిన్నపదములను పెట్టడము మంచిది కాదు. అలా అర్థములేని పదములను పెట్టడము ఇంద్రుని ప్రక్కన ఎండిపోయిన ఎముకను కొరుకుచున్న కుక్కను పెట్టినట్లుంటుంది. కుబేరుని ప్రక్కన గంజి కూడ లేని బికారిని పెట్టినట్లుంటుంది. అందువలన మేము చెప్పు సత్యమును తెలుసుకొని యుగమును యోగము అని పిలుస్తూ సత్యము బయటపడునట్లు చేయుదురని అనుకొంటున్నాను. ఇప్పటికి కాలముల పేర్లలోని లొసుగులు పూర్తిగా తెలిసిపోయాయి అనుకుంటాను.

ఇంతవరకు చెప్పిన దానినిబట్టి నాలుగు యుగముల వివరము తెలిసినది కదా! నాలుగు యుగములలో మధ్యలోగల రెండు యుగములను చెప్పుకొంటే ఒకటి త్రైతాయుగము మరియొకటి ద్వాపరయుగము. ఈ రెండు యుగముల పేర్లు ప్రత్యేకించి ఒకటి ప్రత్యక్షముగా 'త్రైత' అను పేరును తెలుపుచుండగా, మరియొకటి పరోక్షముగా 'ద్వాపర' అను పేరును తెల్పుచున్నది. త్రైత అనగా మూడవదనీ, ద్వాపర అనగా రెండుకంటే వేరుగా ఉన్నదని అర్థము. రెండుకంటే వేరుగా ఉన్నది అంటే మూడవదనియే అర్థమగును. అందువలన త్రైత అనినా, ద్వాపర అనినా రెండూ ఒకే అర్థము నిచ్చుచున్నవి. ఈ విధముగా యుగములందు మధ్యలో మూడు అను అర్థమునిచ్చు యుగములుండుట వలన ఒక విశేషమైన అర్థమున్నది. అదేమనగా! మనిషికి జీవితము నాలుగు దశలుగా ఉన్నది. ఒకటి

బాల్యము, రెండు యవ్వనము, మూడు కౌమారము, నాలుగు వృద్ధాప్యము. నాలుగు దశలలో మొదటి బాల్యములోనూ చివరి వృద్ధాప్యములోను దేవుని జ్ఞానము తెలుసుకొనుటకు అనుకూలమూ, అవకాశమూ ఉండదు. బాల్యములో బుద్ధి దైవజ్ఞానమును గ్రహించుకొను సామర్థ్యమునకు ఎదిగి యుండదు. తర్వాత బాల్యములో స్వతంత్రముగా జ్ఞానము తెలుసుకొను అవకాశము కూడా ఉండదు. అలాగే వృద్ధాప్యములో బుద్ధి బలహీనమైపోయి విన్నదానిని గ్రహించుకొను స్థోమతను కోల్పోయివుండును. అందువలన ఇటు శరీరము అటు బుద్ధి రెండూ అనుకూలించవు. తర్వాత వృద్ధాప్యములో స్వతంత్రత ఉండదు. స్వతంత్రత ఉన్నా శరీరము అనుకూలించదు. ఈ విధముగా బాల్యములోనూ, వృద్ధాప్యములోనూ రెండు దశలలో మూడు ఆత్మల జ్ఞానమైన త్రైత సిద్ధాంత జ్ఞానమును తెలుసుకొనుటకు వీలుపడదు. అందువలన జీవితమునకు మధ్యలోగల యవ్వన, కౌమారదశల కాలములోనే దైవజ్ఞానమును తెలియాలి. మనిషి యవ్వనములోగానీ, కౌమారములోగానీ తెలియవలసిన జ్ఞానము మూడు ఆత్మలకు సంబంధించిన జ్ఞానము, కావున ఏ మనిషి అయినా త్రైత జ్ఞానమునే తెలియాలి అను సూచనతో, నాలుగు యుగముల మధ్యలోగల యుగములకు త్రైతయుగమనీ, ద్వాపర యుగమనీ పేరు పెట్టబడినది.

ముక్కు, మూతి, శ్వాస, ధ్యాస, మానము, ప్రాణము ఉన్న ఏ మనిషి అయినా దేవుని చేత సృష్టింపబడినవాడే. సృష్ఠింపబడిన మనిషి నాస్తికుడైనా ఆస్తికుడైనా, రాజయినా, పేదయినా, హిందువైనా (ఇందువైనా) ఇస్లామీ అయినా, ఇండియావాడైనా, ఇండోనేషియావాడైనా నాలుగు యుగముల కాలములోనే నివసిస్తున్నారు. కావున యుగముల మధ్యలో తెలిపినట్లు మనిషి బాల్యమునకు వృద్ధాప్యమునకు మధ్యలోని వయస్సులో

త్రైతము అనబడు జ్ఞానమునుగానీ లేక ద్వాపర అను జ్ఞానమును గానీ తెలియవలెను. అలా తెలియుట వలన మనిషి దైవమును చేరగల్గును. ఇదే త్రైతమే ముఖ్యముగా అన్ని మతముల మూల గ్రంథములలోను ఉన్నది. కొందరు బైబిలును చదివి మా గ్రంథములో త్రైతమను పేరే లేదే అని అడుగవచ్చును. అలాగే ముస్లీమ్‌లు ఖురాన్ చదివి మా గ్రంథములో మూడు ఆత్మలనిగానీ, త్రైతమనిగానీ లేదే అని అడగవచ్చును. అలాగే భగవద్గీతను వ్రాసిన ఎందరో స్వామీజీలు మేము భగవద్గీతకు వివరముగా భావమును వ్రాశాము మాకు తెలిసినంతవరకు ఎక్కడా త్రైతమను పదముగానీ, దాని భావముగానీ లేదే అని అడుగవచ్చును. మా గ్రంథములలో ఎక్కడా త్రైత సిద్ధాంతము లేదు అని అన్ని మతముల వారు ఏక కంఠముతో అరచినా, త్రైతము కనిపించని సత్యముగా అన్ని మతములలో ముఖ్య సారాంశముగా ఉన్నది. అందరూ దానిని సులభముగా గ్రహించుకొను నట్లు ఉంటే, గీతలో జ్ఞానయోగము 6,7,8 శ్లోకములలో, ఖురాన్ 22,23,24 ఆయత్‌లలో, బైబిలు యోహాన్ 16వ అధ్యాయము 12,13,14లో వస్తానని చెప్పియున్న దేవుడు భూమిమీద అవతరించవలసిన పనే లేదుకదా! ఆదిలో దేవుడు చెప్పిన జ్ఞానమును తిరిగి దేవుడే గ్రంథరూపములో ఇచ్చినా, దానిలోని సారాంశమును మనిషి తెలియ లేకున్నాడు. ఏ మతస్థుడైనా తన గుండెల మీద చేయి వేసుకొని నాకు మా గ్రంథములోని దేవుని జ్ఞానము పూర్తిగా తెలియునని చెప్పమనండి. ఎవరూ ధైర్యముగా అలా చెప్పలేరు. అలా చెప్పితే అది దైవ ద్రోహమవు తుంది. తనను తాను మోసము చేసుకొన్నట్లుగును. ఎవరికి ఎంత జ్ఞానము తెలిసినది నాకు తెలుసు అంటాడు దేవుడు. త్రైతసిద్ధాంత జ్ఞానమటుంచి ద్వైత సిద్ధాంత జ్ఞానము తెలియునా అని అడుగుచున్నాను.

ఇప్పుడు మీకు ఒక క్రొత్త విషయమును చెప్పుతాను వినండి. మీరు వినండి అంటే మేమెందుకు వినాలి అని కొందరు నాకు ఎదురు ప్రశ్న వేయవచ్చును. దానికి నా జవాబు ఏమనగా! నీవు జ్ఞానివి కావాలంటే ఈ మాట నీకెంతో అవసరము. మతానికి అతీతముగా చూస్తే ఈ మాట అందరికీ అవసరమే. నేను చెప్పునది ఇతరులకు కొంత ఆశ్చర్యమును కలిగించవచ్చును. ఎందుకనగా నామాట మతాలకు అతీతముగా ఉంటుంది. నేను ఏ మతము భూమిమీద లేనిరోజున ఇందూ ధర్మములో (దేవుని ధర్మములో) పుట్టినవాడిని. అందువలన నేను ఎప్పటికీ ఇందువునే. ఇందువులలో ముఖ్యమైన యోగిగా పేరుగాంచిన వేమనయోగిగారు, ఆయన రచనలో మూడు వేల రెండు (3002) పద్యములను ఆధ్యాత్మిక జ్ఞానముతో కూర్చి చెప్పాడు. అందులో నాకు ఇలా ఇష్టమైన పద్యమొకటి కలదు.

*పతియొప్పిన సతి యొప్పును*
పతి సతులొకటైన పరమ పావనమందున్
పతి సతి న్యాయమె మోక్షం
*బతులిత పరమాత్మనైక్యమగురా వేమా.*

**భావము :–** పతి అనగ భర్త, సతియనగ భార్య అని అందరికి తెలుసు. పెళ్ళి అయితేనే పతి సతులౌతారను విషయము కూడా తెలుసు. పతి, సతులకు పిల్లలు పుడుతారని కూడ తెలుసు. ఈ విధానమంతా జ్ఞానులకు, అజ్ఞానులకు అందరికీ తెలిసినప్పటికీ, చాలామందికి ఈ విషయము దైవికమైనదని, ఆ దైవిక విషయమే ప్రపంచములో ఇలా ప్రతిబింబించి ఉన్నదని, ప్రపంచములో ప్రత్యక్షముగనున్న పతి సతుల విధానమును ఆధారముచేసుకొని పరోక్షముగనున్న దైవ విధానమును అర్థము చేసుకోగల

రని దేవుడే ఇలా ఉంచాడు. దైవికమైన పతి, సతి విధానమేదో ఇపుడు వివరించి చూచుకొందాము.

భగవద్గీత గుణత్రయ విభాగ యోగమను అధ్యాయములో మొదటనే పరమాత్మను పతిగ, ప్రకృతిని సతిగ చెప్పారు. శ్రీకృష్ణుడు చెప్పిన భగవద్గీత ప్రకారము జగతి మొత్తమునకు ప్రకృతి, పురుషులు సతిపతులుగ ఉంటూ ప్రతి జీవరాసికి వారే తల్లితండ్రులైనారు. ప్రపంచములోని మనుష జాతికేకాక క్రిమి, కీటక, పశు, పక్షి, వృక్షలతాదులకన్నిటికీ తల్లి ప్రకృతి, తండ్రి పరమాత్మ అని తెలుపబడి ఉన్నది. జగతి మొత్తమునకు తల్లి తండ్రులుగ ఉంటూ పతి సతులుగ యొప్పు పరమాత్మ ప్రకృతి ప్రపంచములో విభిన్నముగ ప్రవర్తించుచున్నారు. పతియైన పరమాత్మకు సతియైన ప్రకృతి విధేయురాలైనప్పటికీ, పరమాత్మ ఆదేశానుసారము జగతిపట్ల పరమాత్మ మార్గమైన దైవమార్గమునకు ప్రకృతియైన మాయ ఎంతో వ్యతిరేఖముగ నున్నది. దైవమార్గమును అనుసరించవలెననుకొను వానిని ఆ ప్రయత్నమును భంగముచేసి విరమించుకొనునట్లు చేయుచున్నది. ఇది అంతయు దేవునికి తెలిసే జరుగుచున్నది. దేవుని గూర్చిన ప్రయత్నములో మాయ ప్రభావము నకు తట్టుకొనలేక అందరు వెనుదిరుగుచున్నారు. అయినప్పటికీ ఎన్నో లక్షలమందిలో ఏ ఒక్కడో మాయను వ్యతిరేఖించి అన్ని కష్టములకు ఓర్చుకొని దేవున్ని చేరుకోవాలని ప్రయత్నించుచున్నాడు. అటువంటి వానిని దేవుడు వాని మార్గమును సుగమము చేసి, మాయ ఆటంకమును తొలగించి తనయందు కలుపుకొనును. బలమైన మాయ కల్పించు పరిస్థితులన్నిటినీ అనుభవిస్తూ, పట్టువదలక దేవుని కొరకు ప్రయత్నించు వానిని దేవుడు ఒప్పుకొనును. దేవుడు ఒప్పుకొన్నపుడు మాయ వానిని ఆటంకపరచదు. అటువంటి వాని యోగము యొక్క క్షేమమును దేవుడే పరిరక్షించును. అపుడు వాడు దేవునియందైక్యమై పోవును.

ప్రపంచములో మాయ కలుగజేయు అనేక కష్టములను అతిక్రమించి దేవుని మార్గమును వదలని వానిని, దేవుడు తన మనిషిగ అంగీకరించును. అపుడు వెంటనే ప్రకృతియైన మాయ తాను కూడ వానిని ఒప్పుకొన్నదై వానికి ఆటంకము కలుగజేయదు. కావున పై పద్యమందు పతియొప్పిన సతి యొప్పునన్నారు. ఆ విధముగ పరమాత్మ, ప్రకృతి ఇద్దరు వానిపట్ల ఒకటై నడుచుకొన్నప్పుడు వాడు మోక్షము పొందును. దానినే పద్యమందు వ్యక్త పరుస్తు పతిసతులొకటైన పరమ పావనమందున్ అన్నారు. పతి, సతి ఇద్దరు ఒక మార్గమును నడచుకోవడము న్యాయమగును. పతికి సతి విరుద్ధముగ నడుచుకోవడము అన్యాయమగును. ప్రకృతి, పరమాత్మ భక్తునిపట్ల న్యాయమార్గమున చరించిన మోక్షము లభించును. కావున పై పద్యమందు పతి సతి న్యాయమే మోక్షము అన్నారు. పతి, సతి న్యాయముగ చరించినపుడు భక్తుడు వెంటనే జన్మరాహిత్యము పొందును. కనుక బతులిత పరమాత్మనైక్యమగురా అన్నారు.

ప్రపంచములో ఒక భక్తునిపట్ల భార్యాభర్తలైన ప్రకృతి పరమాత్మలు మొదట అన్యాయముగ ప్రవర్తించుదురనీ, ఈ పద్యము ద్వార వేమన మనకు తెలియజేశాడు. పతి ఒప్పినపుడే సతియు ఒప్పుకొని ఇద్దరు న్యాయముగ ప్రవర్తించుదురు. వారిద్దరు ఒకటై న్యాయముగ ప్రవర్తించినపుడే భక్తునికి మోక్షము లభించును. మాయ ఆటంకములను ఓర్చుకోలేక నేనెంత భక్తిగ ఉన్న నాకే కష్టాలొస్తున్నవని, దేవునివద్ద న్యాయమే లేదనుకొన్నవాడు దేవుని మార్గములో భ్రష్టుడగును. దేవుని గూర్చి ఏమి అనుకోక అన్నిటినీ ఓర్చుకొన్నవాడు మొదట పరమాత్మచేత ఒప్పుదల పొంది ప్రకృతి, పరమాత్మలు న్యాయముగ ప్రవర్తించగ భక్తుడు మోక్షము పొందును.

పతి సతుల విధానము ప్రపంచములో ప్రతిబింబించి ఉన్నదని ముందే చెప్పుకొన్నాము. పతికి సతి వ్యతిరిక్తముగ నడుచుకొనుట, పతిని తన మాటవినునట్లు చేసుకొనుటైన అన్యాయ విధానము భూమిమీద కలదు. అట్లే పతికి సతి అనుకూలముగ నడుచుకొనుచూ, పతిమాటయే తనమాటగ పతి చెప్పినట్లు సతి నడుచుకొను న్యాయమార్గమూ భూమిమీద గలదు. మీ అనుభవములో న్యాయ, అన్యాయ, పతి, సతులను గూర్చి తెలిసినట్లయితే ఎవరైన సంపూర్ణ జ్ఞానులుకాగలరు. దేవుని మార్గములో నడుచువారికి ఆటంకములేర్పడిన, దేవుని దగ్గర న్యాయముందా? అని సహనము కోల్పోయి మాట్లాడరు. ఎన్ని కష్టములొచ్చిన ఇది తల్లియైన మాయ పని అని ఎరుకగల్గి నడుచుకొందురు.

ఈ పద్యము స్వచ్ఛముగా పరమాత్మ ప్రకృతులను గురించి చెప్పినది. ప్రపంచమునకంతటికి తల్లితండ్రులైన వీరిలో తల్లి తండ్రికి విధేయురాలై ప్రవర్తించుచూ, తన భర్తకు సంబంధించిన కార్యములన్నియు తానే చేయుచున్నది. అత్యంత ఉన్నతమైన ఆది దంపతులను గురించి చెప్పిన వేమన పద్యము నాకు ఎంతో ఇష్టమైనది. అలాగే భగవద్గీత గ్రంథములో జ్ఞానయోగము అను అధ్యాయమునందుగల ఆరవ శ్లోకము...

శ్లో॥ అజోపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోపిసన్,
ప్రకృతి స్వామధిష్టా సంభవా మ్యాత్మ మాయయా.

ఈ శ్లోకములో కూడా అందరికీ తండ్రి అయిన దేవుడూ ఉన్నాడు తల్లి అయిన ప్రకృతీ ఉన్నది. అత్యంత ఉన్నతమైన దేవుడు ఎలా మనుషుల కొరకు వస్తున్నాడో చెప్పిన శ్లోకము. కావున ఇది నాకు ఎంతో ఇష్టమైన శ్లోకము. అట్లే బైబిలు గ్రంథములో యోహాను సువార్తలో 16వ

అధ్యాయమున 12,13,14, 15 వాక్యములు నాకు ఇష్టమైనవి. అవి ఇలా కలవు. “నేను మీతో చెప్ప వలసినవి ఇంకనూ అనేక సంగతులు కలవు గానీ, ఇప్పుడు మీరు వాటిని సహింపలేరు. అయితే ఆయన అనగా సత్యస్వరూపి అయిన ఆత్మ వచ్చినప్పుడు మిమ్ములను సత్యలోకములోనికి నడిపించును. ఆయన తనంతటతానే ఏమియూ బోధింపక, వేటిని వినునో వాటిని బోధించి సంభవింపబోవు సంగతులను మీకు తెలియ జేయును. ఆయన నా వాటిలోనివి తీసుకొని మీకు తెలియజేయును, కనుక నన్ను మహిమపరచును. తండ్రికి కలిగియున్నవన్నియు నావి. అందుచేత ఆయన నా వాటిలోనివి తీసుకొని మీకు తెలియజేయునని మీకు చెప్పితిని” అని కలవు.

ఇకపోతే ఖురాన్ గ్రంథములో కూడా నాకు ఇష్టమైన వాక్యములు కలవు అవి ఏవనగా! ఖురాన్ గ్రంథములో 114 సురాలు (అధ్యాయములు) గలవు. అందులో 112వ అధ్యాయమైన “ఆల్ ఇఖ్లాస్” అను పేరుగల సురాలోని నాలుగు వాక్యములు నాకు అత్యంత ఇష్టమైనవని చెప్పుచున్నాను. అవి ఏవనగా! 1) దేవుడు ఒక్కడే 2) దేవుడు ఏ అక్కరా లేనివాడు 3) ఆయన ఎవరినీ పుట్టించలేదు, ఆయన ఎవరికీ పుట్టలేదు. 4) ఆయనకు సమానముగా ఎవరూ లేరు.

ఇక్కడ కొందరికి నామీద కొంత అనుమానము వచ్చి ఇలా ప్రశ్నించ వచ్చును. “మీరు ఇందూ (హిందూ) సమాజములో పుట్టినవారు కదా! మీకు వేమనయోగి పద్యము నచ్చింది అనినా, భగవద్గీతలోని శ్లోకము నచ్చినదనినా ఎవరైనా ఒప్పుకోవచ్చును. అంతటితో ఆగకుండా బైబిలులోని నాలుగు వాక్యములు, ఖురాన్‌లోని నాలుగు వాక్యములు నచ్చినాయని చెప్పడమేమిటి? మీరు క్రైస్తవులను, మహమ్మదీయులను సమర్థిస్తున్నారా”

అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! నేను ఇందూ సమాజములో పుట్టాను అనకుండ ఇందూ ధర్మములోనే పుట్టానని చెప్పుచున్నాను. ఇందూ ధర్మములో పుట్టాను, ఇందూధర్మమునే గొప్పగ భావించాను, ఇందూ ధర్మమునే ఇతరులకు బోధించుచున్నాను, కావున నేను స్వచ్ఛమైన ఇందువును అని గట్టిగా చెప్పుచున్నాను. ఇందూ ధర్మము దేవున్ని తప్ప ఎవరినిగానీ, ఏ విషయమునుగానీ బోధించదు. అందువలన భూమిమీద ఎక్కడైనా దేవున్ని గురించిన బోధ ఉంది అంటే అది స్వచ్ఛమైన ఇందూబోధ అని తెలియాలి. దేవునికి సంబంధించిన జ్ఞానము ఏ మతములో ఉన్నా, దేవుని జ్ఞానము ఏ గ్రంథములో ఉన్నా, అది భగవద్గీత కావచ్చు, బైబిలుకావచ్చు, ఖురాన్ గ్రంథముకావచ్చు. దానిలో ఇందూ జ్ఞానము ఉన్నదని తెలియవలెను. ఇందూ జ్ఞానము అనగా దైవజ్ఞానము అని గుర్తుంచుకోవలెను. ఇందూజ్ఞానము క్రైస్తవులలో, ముస్లీమ్‌లలో వారి గ్రంథములలో ఉన్నది. భూమిమీద ఏ మతమూలేని రోజు దేవుడు తన జ్ఞానమును తెలియజేశాడు. దేవుడు తెలియజేసిన మొట్టమొదటి జ్ఞానము యొక్క పేరే ఇందూజ్ఞానము. మొట్టమొదట సూర్యుని ద్వారా భూమిమీదికి వచ్చిన దైవజ్ఞానము ప్రపంచ వ్యాప్తముగా ఉండెడిది. తర్వాత మాయ ప్రభావము చేత మనుషుల తలలోని గుణముల వలన దైవజ్ఞానము ఒకరి తర్వాత మరొకరికి చేరు సమయములో అజ్ఞానముగా మారిపోయినది. మనుషులలో పరంపరగా రావలసిన జ్ఞానము భావమార్పిడితో అధర్మముగా మారిపోయినది. అలా అధర్మములుగా మారిపోయిన తన జ్ఞానమును తిరిగి దేవుడు వేరువేరు దేశములలో, వేరువేరు కాలములలో, వేరువేరు వ్యక్తులుగా కనిపించి వేరువేరు భాషలలో చెప్పడము వలన వినిన మనుషులు, తాము విన్నదానిని వేరువేరు మతములుగా చెప్పుకోవడము జరిగినది.

ఈ విధముగా ఐదువేల సంవత్సరముల పూర్వము లేని మతములు తర్వాత కాలములో పుట్టుకొచ్చాయి. రెండు వేల సంవత్సరముల పూర్వము క్రైస్తవ మతము పుట్టుకరాగా, పదునాలుగు వందల సంవత్సరముల పూర్వము ముస్లీమ్ మతము పుట్టినది. మనుషులు కొందరు క్రైస్తవులుగా, కొందరు ముస్లీమ్‌లుగా మారిపోగా మిగిలినవారు తాము హిందువులమని చెప్పుకోవడము జరిగినది. వాస్తవానికి 'హిందూ' అనుపేరు భూమిమీద ముస్లీమ్ మతము రాకముందు పదునాలుగు వందల సంవత్సరముల పూర్వము కూడాలేదు. చరిత్రను తిరగవేసి చూస్తే వేయి సంవత్సరముల కాలములో 'ఇందూ' అను పదము కాస్త 'హిందూ' శబ్ధముగా మారిపోయినది. కాలక్రమములో ఎన్నో పదములలో శబ్ధమార్పిడి జరిగి మారిపోయినట్లు, ఇందూ అని పలకడములో 'హిందూ' అని పలకడము జరిగినది. అచ్చు "ఇ"తో చెప్పవలసిన శబ్ధమును హల్లు "హి" తో చెప్పడము జరిగినది. కొద్దిగా శబ్ధ మార్పిడి కావున దానిని ఎవరూ గుర్తించలేక పోయారు. తర్వాత కాలములో వ్రాయడము వచ్చిన వారందరూ 'హి' అను అక్షరముతో 'హిందూ' అను పదమును వ్రాయడము మొదలుపెట్టారు. పూర్వము చదువు వచ్చినవారు కేవలము పదిశాతము మంది మాత్రమే ఉండేడివారు. అందులో ఎవడో ఒకడు పొరపాటుగా హిందూ అను పదమును వ్రాయడము వలన, తర్వాత కాలములో అలాగే అలవాటైపోయి ఇప్పటికి ఇందువులు పూర్తిగా హిందువులుగా మారిపోయారు. దానికితోడు కొందరు స్వార్థులు మిగత మతములతో పాటు తమది ఒక మతముగా చెప్పుకొన్నారు. వాస్తవానికి హిందూమతమను పేరు ఇస్లామ్ మతము వచ్చిన తర్వాతనే వచ్చినదని చెప్పవచ్చును.

ఐదువేల సంవత్సరముల పూర్వము అనగా కలియుగము ప్రారంభములో భూమిమీద ఏ మతములులేవు. ఏ మతమైనా ఐదువేల సంవత్సరముల తర్వాత వచ్చినవే. ద్వాపరయుగము చివరిలో భగవంతునిగా వచ్చిన కృష్ణుడు దైవజ్ఞానమును 'భగవద్గీత' అను గ్రంథరూపములో బోధించాడు. అప్పుడు మనుషులలోనున్న అజ్ఞానమును ఒక ప్రక్క చెప్పుచూ దానికి సమాధానముగా సరియైన ధర్మమును జ్ఞానరూపముగా బోధించాడు. ధర్మములకు ముప్పుకలిగి అధర్మములు అజ్ఞానరూపములో పెరిగి పోయినప్పుడు, దేవుడు అవతరించి తన జ్ఞానమును బోధిస్తాడని తెలిపిన కృష్ణుడు, ఆ దినము తన బోధలో అజ్ఞానము మతముల రూపములో ఉన్నదని చెప్పలేదు. అప్పటి పరిస్థితినిబట్టి చెప్పిన జ్ఞానములో మతము అను దానిని మనుషులు అనుసరిస్తున్నారనిగానీ, ఫలానా మతములో అజ్ఞానమున్నదనిగానీ చెప్పలేదు, ఆ దినము అనగా ఐదువేల సంవత్సరముల పూర్వము భూమిమీద మతముల ప్రసక్తే లేదు. అందువలన ఆ కాలములో చెప్పిన భగవద్గీతలో మతముల ప్రస్తావన రాలేదు. ఆ రోజు భగవద్గీతలో రాబోవు తరము వారికి జ్ఞానమును అందించుటకు జ్ఞానమును బోధించడము జరిగినది. అయితే భగవంతుడు తెల్పిన భగవద్గీతలోని జ్ఞానమును మనుషులు గ్రహించని దానివలన, తర్వాత కాలములో ఇతర మతములుగా మారిపోయి చీలిపోయారు. 'మతము మనుషుల గుంపును పెంచుతుంది' అను మా వాక్యము ప్రకారము మనుషులలోని మతములు మనుషులను గుంపులుగా, వర్గములుగా తయారుచేసినవి. దానివలన ముస్లీమ్‌లందరు ఒక వర్గమువారనీ, క్రైస్తవులందరు ఒక వర్గమువారనీ, అలాగే హిందువులు అందరూ ఒక వర్గమువారనీ భారతదేశములో మూడు రకముల గుంపులుగా మనుషులు చీలిపోయారు. ఒక ముస్లీమ్‌కు అన్యాయము జరిగితే ఆ

మతము వారందరూ తమ గుంపుకు లేక తమ మతమువారందరికీ అన్యాయము జరిగినట్లు తలచి దానికి స్పందించుచున్నారు.

ఈ విధముగా మతము అను ఉన్మాదములో చిక్కుకొన్నవారు, మిగతా విషయములకంటే మతము యొక్క విషయములో ఎక్కువగా స్పందించడమును గమనించిన కొందరు, దానిని ఆసరాగా చేసుకొని తాము మనుషులలో, మతములో గుర్తింపు పొందిన వ్యక్తులుగా ఉండుటకు, నాయకత్వమును పొందుటకు, మతము అను దానిని అడ్డము పెట్టుకొని ప్రజలను రెచ్చగొట్టి, మనుషుల మధ్యలో కలతలను లేపి, కలతలతో గుంపులుగా విడిపోయిన మనుషులకు నాయకులుగా, పెద్దలుగా పాత్రను పోషించవలెనని ప్రయత్నించుచుందురు. అటువంటివారు మతమును గురించి ఎక్కువగా మాట్లాడుచుందురు. మతమును గురించి మాట్లాడుచూ పరమతమును ద్వేషించుచూ నాయకులుగానో, మతపెద్దలుగానో, స్వాములు గానో ఉండుటకు ప్రయత్నించువారు ప్రమాదకరమైన మనుషులనీ, అటువంటివారు అమాయక ప్రజలను హింసకు బలిచేయుచుందురనీ ప్రజలు గ్రహించవలెను. **మతములతో మనుషులను రెచ్చగొట్టి, మనుషుల మధ్య కలతలు రేపి, మతమును దేవుని భక్తిగా పోల్చువారు, ఎంతటివారైన దేవుని దృష్టిలో క్షమించబడనివారని తెలియవలెను.** దైవజ్ఞానము తెలియని వారు పరమతద్వేషమును, స్వమత అభిమానమును కల్గియుందురు. దైవ జ్ఞానముకలవారు పరమతమును కూడ తన మతముగానే అభిమానించు చుందురు. దైవజ్ఞానముకలవారు ఎవరైనా అన్ని మతములలో ఇందూ జ్ఞానమును చూచుదురు. అన్ని మతములలో దైవము ఒక్కడేననీ, అన్ని మతముల గ్రంథములు ఒక్క దేవున్నే బోధించాయనీ చెప్పుచుందురు. ఆ పద్ధతి ప్రకారమే నాకు కూడా స్వమత అభిమానముగానీ, పరమత ద్వేషము

గానీ లేదు. అందువలన మా బోధలో ఎక్కడా మత ప్రసక్తే ఉండదు. త్రైత సిద్ధాంతము అన్ని మత గ్రంథములలో ఉండుట వలన అన్ని మూల గ్రంథములు నాకు సమానమేనని ముందే చెప్పాను. దాని ప్రకారమే అన్ని గ్రంథములలోనూ నాకు బాగా నచ్చిన వాక్యములున్నవని కూడా చెప్పియున్నాను.

నేను ఇంతగా చెప్పినా నమ్మని వారు అన్ని మతములలోనూ కొందరుండవచ్చును. అటువంటివారికి కనువిప్పు కలుగుటకు నేను మరియొక మాట చెప్పుచున్నాను. అదేమనగా! నా త్రైత సిద్ధాంతము ఎక్కడుందో అదంతయు నాదే అనుకొన్నప్పుడు, దానిని గురించి వేరుగా మాట్లాడడముగానీ, వ్యతిరేఖముగా మాట్లాడడముగానీ ఉండదు కదా! అందువలన నా త్రైత సిద్ధాంతము గల అన్ని గ్రంథములను గౌరవించు చున్నాను, వాటిని గురించి చెప్పుచున్నాను. నా విధానమును ఎవరు ఆచరించినా భారతదేశమంతా తిరిగి జ్ఞానము గల దేశముగా మారి పోగలదు. అప్పుడు నిజమైన ఇందూదేశము కాగలదు. నేను ఇందూ (హిందూ) సమాజములో పుట్టినవానిగా కనిపించినా, మిగత మతముల వారు వారి గ్రంథములలో తెలిసిన దానికంటే, కొంచెము ఎక్కువగానే గ్రహించిన వాడినని గర్వముగా చెప్పుకొంటున్నాను. అలా ఎందుకు చెప్పుచున్నాననగా! వారికి వారి గ్రంథములలో త్రైతసిద్ధాంతమున్నట్లు తెలియదు కదా! అందువలన వారికంటే కొద్దిగ నేనే గొప్ప అని చెప్పడము జరిగినది. ప్రస్తుతమున్న ఏ మతములోగానీ త్రైత సిద్ధాంతమంటే ఏమిటో తెలియదు. హిందూమతము లోని వారు త్రైత సిద్ధాంతమను పేరు వింటూనే త్రైతమంటే క్రైస్తవమనీ, నన్ను క్రైస్తవుడనీ అనుకొన్నవారు చాలామంది కలరు. ఎక్కువగా త్రైత సిద్ధాంతమును గురించి చెప్పిన భగవద్గీతగల హిందువులకే

త్రైతమును గురించి అర్థముకానప్పుడు, మిగత మతముల వారికి వారి గ్రంథములలో చెప్పిన త్రైతము తెలియదనియే చెప్పవచ్చును.

త్రైత సిద్ధాంతము తెలియని కాలములో, సృష్ట్యాదిలో దేవుడు చెప్పిన జ్ఞానములో త్రైతముందనీ, అదే విషయమునే ఐదువేల సంవత్సరముల పూర్వము చెప్పిన భగవద్గీతలో కూడా చెప్పాడనీ, అంతేకాక మిగతా మత గ్రంథములలో కూడా చెప్పారనీ మేము తెలుపుచున్నాము. ఆ విషయమును ఉదాహరణగా చూపుచూ, పవిత్ర ఖురాన్ గ్రంథములో 50వ సురా అయిన ఖాఫ్ సురాలో 21వ ఆయత్‌లో త్రైత సిద్ధాంతము ఉన్నట్లు చూపడము జరిగినది. అలా చూపడమే కాకుండా ఖురాన్ గ్రంథములో నాకు బాగా ఇష్టమైన 112 సురాను గురించి కూడా చెప్పాను. ఖురాన్ గ్రంథములో 112 సురాలో గల వాక్యమునే గొప్పగా చెప్పడమేకాక సురా 112 సంఖ్య యొక్క విశేషతను కూడా ఇలా చెప్పుచున్నాను చూడండి. త్రైతములో మూడు ఆత్మలు కలవు. ఆ విషయమును శాస్త్రబద్ధముగా చెప్పడమునే సిద్ధాంతము అంటున్నాము. త్రైత సిద్ధాంతము ప్రకారము జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను మూడు ఆత్మలలో మొదటి రెండు ఆత్మలు జోడు ఆత్మలుగా ఉన్నవి. జీవాత్మ, ఆత్మ అను రెండు ఆత్మలకంటే వేరుగా పరమాత్మ (దైవము) ఉన్నది. ప్రతి మనిషి శరీరములో జీవాత్మకు అనుబంధము కల్గి ఆత్మ ఉండును. అందువలన మనిషి హస్తములో కూడా క్రింద రెండు రేఖలు కలిసివుండి పైన వేరుగా ఒక రేఖ ఉన్నది. కలిసియున్న రెండు రేఖలను జీవాత్మ ఆత్మలుగా చెప్పుకోవచ్చును. క్రింది రెండు రేఖలకు సంబంధము లేకుండా పైన ప్రత్యేకముగానున్న రేఖను పరమాత్మ గుర్తుగా చెప్పుకోవచ్చును. హస్తములో మొత్తము మూడు రేఖలున్నవి, అలాగే అల్ ఇఖ్లాస్ అను 112 సురా మూడు సంఖ్యలతో కూడుకొనియున్నది. 112వ సురా పేరు అల్

ఇఖ్లాస్. దీని అర్థము ప్రత్యేకించుకోవటము దేవుడు సర్వమునకు ప్రత్యేకమైనవాడు కనుక "ప్ర" అనగా ముఖ్యమైన లేక గొప్పదైన అని చెప్పవచ్చును. విశేషతకల్గిన దేనికైన 'ప్ర' అను శబ్దమును చేర్చి చెప్పవచ్చును. ఉదాహరణకు ప్రకృతి, ప్రముఖులు, ప్రసిద్ధి, ప్రపంచము, ప్రజలు ఈ విధముగా ఎన్నో సందర్భములలో విశేషత కల్గిన దానిని గురించి చెప్పినప్పుడు 'ప్ర' అను అక్షరమును ఉపయోగిస్తాము. ఇక్కడ ఏకత అనగా ఒక్కటే లేక ఒక్కడే అను విషయమునకు ముందు ప్ర అను శబ్దమును వాడుట వలన ఏకత (ఒక్కడు) అనునది అన్నిటికంటే గొప్పది, ముఖ్యమైనది, అరుదైనది. కావున ఏకత ముందర 'ప్ర' ను ఉంచి ప్ర+ఏకత = ప్రత్యేకత అను శబ్ధముగా పలికారు. ప్రపంచములో ఉన్నవాటిలో అన్నిటికంటే దేవుడు ఏకమైనవాడు మరియు ప్రత్యేకమైనవాడు అందువలన 112 సురా పేరు ప్రత్యేకించుకోవడము అని ఉన్నది. దేవున్ని దేనితోను సమానముగా పోల్చక ప్రత్యేకించుకోవలెను. అందువలన అదే పేరునే అరబిక్ భాషలో "అల్ ఇఖ్లాస్" అని చెప్పారు. అల్ ఇఖ్లాస్ అనగా ప్రత్యేకత కల్గియున్నదని తెలిసినపుడు, మొత్తము ఖురాన్ గ్రంథములోనే 112 సురా ప్రత్యేకమైన దేవుని జ్ఞానమును అందించిన అధ్యాయముగా లెక్కించవచ్చును. అంతేకాక పేరుకు తగినట్లు 112 సురాలో ఒకే దేవుని జ్ఞానము నాలుగు వాక్యములలో చెప్పబడినది.

112వ సురా పేరులోనే ప్రత్యేకత కలదు. అందులోని జ్ఞానము అత్యున్నతమైన నాలుగు వాక్యములతో దేవుని గురించి చెప్పబడినది. 112 వ సురా పేరులోనూ, అందులోని ఆయత్‌లలోనూ సకలమునకు సృష్టికర్త అయిన దేవున్ని గురించి ఉండగా, 112వ సురా సంఖ్యలో కూడా ప్రాముఖ్యత కలదు. ఆ ప్రాముఖ్యత ఏమిటనగా! మానవుడు ఏ జాతివాడైనా

నల్లజాతి నీగ్రో అయినా, తెల్లజాతి అమెరికావాడైనా, పొట్టిజాతి జపాన్ వాడైనా, ఏ మతమువాడైనా అరబ్ దేశములోని ముస్లీమ్ అయినా, ఇజ్రయేల్‌లోని క్రైస్తవుడైనా, భారతదేశములోని హిందువు అయినా శరీరము తోనే జీవించుచున్నారు. శరీరములో పనిని చేయు కర్మేంద్రియములు ఐదు. ప్రపంచ జ్ఞానమును తెలుపు జ్ఞానేంద్రియములు ఐదు అందరి శరీరములకు ఉన్నవి. కర్మేంద్రియములలో హస్తము ప్రధానమైనది. అలాగే జ్ఞానేంద్రియము లలో నయనమ్ (కన్ను) ప్రధానమైనది. ఈ హస్తము, కన్ను రెండూ ప్రపంచములోని మానవులందరికీ ముఖ్యమైనవేనని ఒప్పుకోక తప్పదు. ఈ రెండు అవయవములు ఎందుకు అన్ని బాహ్యేంద్రియములకంటే ముఖ్యమైనవని ప్రశ్నవస్తే, దానికి ఈ విధముగా జవాబును చెప్పవచ్చును. జ్ఞానేంద్రియములలో ప్రధానమైన కన్నులోనూ, కర్మేంద్రియములలో ముఖ్యమైన హస్తములోనూ త్రైత సూత్రము ఇమిడియున్నది. కావున పైన కన్ను, క్రింద హస్తము రెండూ బాహ్య శరీరములో ముఖ్యమైనవని చెప్ప వచ్చును. ప్రక్క పేజీ చిత్రములలో కన్నులో, హస్తములో మూడు ఆత్మల సిద్ధాంతము ఎలా ఉన్నది చూడవచ్చును.

ఈ విధముగా ప్రతి మనిషి శరీరమునకు బయటికి కనిపించు హస్తములో మూడు రేఖలను మూడు ఆత్మలగుర్తుగా దేవుడుంచాడు. అందులో రెండు ఆత్మల కొనలు కలిసియుండి జోడు ఆత్మలుగా కనిపించు చున్నవి. జోడు ఆత్మలైన జీవాత్మ, ఆత్మలు రెండూ ఒక భాగముగా ఉండగా, మూడవదైన పరమాత్మ పైన ప్రత్యేకముగా ఉండునట్లు కనిపించు చున్నది. హస్తములో జీవాత్మ, ఆత్మలు రెండూ హస్తములో రెండు రేఖలుగా ఒకదాని ప్రక్కన ఒకటి కనిపిస్తూ, ఒక చివరిలో రెండు కొనలు కలిసి మేము జోడు ఆత్మలమని బయటికి తెలిపినట్లు, కన్నులో కూడా రెండు




కన్నులో త్రైతము




హస్తములో త్రైతము

ఆత్మలు జోడుగా ఉన్నట్లు తెలియుచున్నది. అలాగే రెండు ఆత్మలకు అతీతముగా మూడవ ఆత్మయున్నట్లు కనబడుచున్నది. కన్నులో విశాలముగా తెల్ల గుడ్డు ఉండగా, దానిలో దానికంటే చిన్నగా లేత నలుపు గుడ్డు గుండ్రముగా రేనికాయ (రేగి) విత్తనము సైజులో ఉన్నది. గుండ్రముగానున్న నల్లగుడ్డు కొందరిలో గోధుమరంగుగా కొందరిలో నీలిరంగుగా కూడా ఉన్నది. లేత నలుపు రంగుగానున్న గుండ్రని గుడ్డులో ఆవగింజసైజు వరకు పూర్తి నల్లని గుండ్రని కనుపాప అను భాగముండును. నల్లని గుడ్డు దానిలోని గుండ్రని పాప రెండూ రెండు జోడుఆత్మలకు గుర్తుగా యున్నవి. చిన్న నల్లని కనుపాపను జీవాత్మగా, నల్లని పెద్దగుడ్డును ఆత్మగా లెక్కించగా, పూర్తి విశాలముగా పూర్తి తెల్లగానున్న కన్నును పరమాత్మగా గుర్తించవచ్చును. హస్తములో రెండు జోడు ఆత్మలనుటకు రెండు ఆత్మల కొనలు ఒకటిగా కలిసియున్నవి. అదే విధముగా కన్నులో నల్లగుడ్డు, దానిలో పూర్తి నల్లగా నున్న చిన్న గుడ్డు రెండు ఒకే విధమైన ఆకృతి రంగు కలిగియుండుట వలన, ఆ రెండు ఆత్మ జీవాత్మలుగా గుర్తింపు పొందియున్నవి. ఈ విధముగా హస్తములోనూ, కన్నులోను త్రైత సిద్ధాంతమును దేవుడు ఇమిడ్చి ప్రతి మనిషికి అమర్చాడు.

ఇపుడు అసలు విషయానికి వస్తాము. సంఖ్యలో పెద్దది 9 మాత్రమే. మిగతావన్నియు దానికంటే చిన్నవే. అన్నిటికంటే పెద్ద (బ్రహ్మ) అయిన దేవున్ని సంఖ్యలలో '9' సంఖ్యగా గుర్తించవచ్చును. అలాగే ఆత్మను '6' సంఖ్యగా, జీవాత్మను '3' సంఖ్యగా చెప్పవచ్చునని మా రచనలోని "సృష్ఠికర్త కోడ్" అను చిన్న గ్రంథములో వివరముగా చెప్పియున్నాము. అట్లే మరియొక గ్రంథమైన **"జనన మరణ సిద్ధాంతము"** అను గ్రంథములో జీవాత్మ ఆత్మతో కలిసినపుడు ఆత్మయొక్క రూపు మారిపోయి పరమాత్మ

లోనికి కలిసి పోవునని చెప్పియున్నాము. జీవాత్మ ఆత్మ కలిస్తే దైవముగా మారిపోవునని చెప్పుటకు సంఖ్యలలోని 3+6=9 అని వ్రాసియున్నాము. అదే సూత్రమును మరియొక విధముగా కూడా చెప్పవచ్చును. అదెలా అనగా! జీవాత్మ, ఆత్మ కలిసితే పరమాత్మ అనునని చెప్పు సూత్రము ప్రకారము 1+1=2 అని కూడా చెప్పవచ్చును. ముందు చెప్పిన విధానములో మూడు అనబడు జీవాత్మ, ఆరు అనబడు ఆత్మ కలువగా, తొమ్మిది అనబడు పరమాత్మ అగుచున్నది అని చెప్పినట్లు, ఒకటి అనబడు జీవాత్మ మరియొకటి అనబడు ఆత్మ కలిసినప్పుడు మొత్తము రెండు అనబడు పరమాత్మ అగునని చెప్పవచ్చును. అదే అంకెలనే మధ్యలో ప్లస్, ఈజికోల్ట్‌లను తీసివేసి వ్రాస్తే 112 అగును. జీవాత్మ అయిన మనిషి లోపల తనకు తోడుగా జోడుగాయున్న ఆత్మను తెలుసుకొని, పరమాత్మను చేరవలెనను భావమును సూచనగా చూపుటకు 112 ను చూపవచ్చును. 112 అను సంఖ్యలోపల ఎంత గొప్ప భావము ఇమిడియున్నదో ఇప్పుడు అర్థమైనదా! జీవాత్మ ఆత్మ కలిసితే పరమాత్మ అగునని త్రైత సిద్ధాంతములోని మూడు ఆత్మలను 112 చూపుచున్నది. అందువలన ఖురాన్ గ్రంథములో కూడా 112 సురాలోనున్న సమాచారము పూర్తిగా దేవున్ని గురించి తెలిపినదేనని తెలియవలెను.

సృష్ట్యాదిలో త్రైతముగా విభజింపబడిన దేవుడు తన జ్ఞానమును భూమిమీద తెలిపినప్పుడు, త్రైతముగానున్న జీవాత్మ, ఆత్మ, పరమాత్మలను గురించి తన గ్రంథములలో తెలియజేశాడు. అంతేకాక తన విధానమును ఎవరూ మరచిపోకుండుటకు యుగముల యొక్క పేర్లను త్రైతాయోగము అనియు, ద్వాపరయోగము అనియు పేరు పెట్టియుంచాడు. మూడవవానిగా యున్న దేవునిలోనికి కలిసిపొమ్మని చెప్పుచూ ద్వాపరయోగము, త్రైతా యోగము అని చెప్పడము జరిగినది. కాలక్రమములో త్రైతా అను పదము

త్రేతా అయినది. అలాగే యోగము అను పదము యుగము అను పదముగా మారిపోయినది. పూర్వమున్న ద్వాపరయోగమునకు, త్రైతాయోగమునకు అర్థము మూడవ వానిలోనికి కలిసిపొమ్మని చెప్పడమే. 'యోగము' అనగా కలయిక అనియు, 'వియోగము' అనగా విడిపోవడము అనియు అర్థము. దేవుని నుండి వియోగములోనున్న మనిషి రెండుకంటే వేరుగానున్న మూడవ ఆత్మగానున్న దేవునిలోనికి కలిసిపొమ్మని చెప్పడమును ద్వాపరయోగము అని అన్నారు. త్రైతా యోగమును పొందవలెనన్నా లేక ద్వాపర యోగమును పొందవలెనన్నా ముందు త్రైతమంటే ఏమిటో, ద్వాపరమంటే ఏమిటో తెలిసి తీరాలి. మూడు ఆత్మలను గురించి తెలియని వాడు తాను జీవాత్మననీ, తనకంటే వేరుగా ఆత్మ పరమాత్మలుకలవనీ, పరమాత్మను చేరుటకు ఆత్మను తెలియవలెననీ గ్రహించలేడు. మూడు ఆత్మల జ్ఞానమును గ్రహించనంత వరకు జీవుడు దేవున్ని చేరలేడు.

జ్ఞానమంటే ఏమిటో కొంతవరకు తెలిసినవారికే మూడు ఆత్మల వివరము తెలియకుండా పోయినది. దేవుడు త్రైతసిద్ధాంతమును గురించి భగవద్గీతలో, బైబిలులో, ఖురాన్‌లో చెప్పినా దానిని గురించి ఏమాత్రము తెలియనివారున్నారు. జ్ఞానులమనుకొన్నవారికే మూడు ఆత్మల గురించి తెలియనప్పుడు, సర్వసాధారణ మనిషికి మూడు ఆత్మలను గురించి తెలియునా అని ప్రశ్నరాగలదు. దాని సమాధానము ఈ విధముగా కలదు. సాధారణ మనిషికి కూడా త్రైత సిద్ధాంతము తెలియుటకు బయట విషయములలో కూడా అనేకచోట్ల బాహ్యముగానే మూడు ఆత్మల విధానమును దేవుడు అందరికీ తెలియునట్లుంచాడు. అదెలా అనగా! ఉదాహరణకు ఒక విషయమును చూస్తాము. ఈ కాలములో ప్రతి ఇంటిలోనూ కరెంటు కనెక్షన్ ఉండును. కరెంటున్న ప్రతి ఇంటిలోను

స్విచ్‌బోర్డు ఉండును. ఆ బోర్డులో మూడు రంధ్రముల ప్లగ్ సాకెట్ ఉండును. ఆ రంధ్రములో మూడు పిన్నుల ప్లగ్‌ను పెట్టి కరెంటును వాడుకోవచ్చును. ఇంతవరకు అందరికీ తెలుసు. స్విచ్‌బోర్డుకున్న మూడు రంధ్రముల సాకెట్‌ను చూస్తే, రెండు రంధ్రములు కుడి ఎడమగా సమానముగా ఉండును. ఆ రెండు రంధ్రములకు పైన సమానదూరములో మధ్యలో మరియొక రంధ్రము ఉండును. పైనగల రంధ్రము క్రిందగల రెండు రంధ్రములకంటే పెద్ద రంధ్రముగా ఉండును. ప్లగ్ సాకెట్‌ను, ప్లగ్ పిన్‌లను క్రింది చిత్రములో చూడవచ్చును.




పర ఆత్మశక్తిని పోలినది కరెంటుశక్తి. అందువలన కరెంటు త్రైతముగానే (మూడుగానే) కనిపించుచున్నది. సాకెట్ రంధ్రములలో క్రింద గల రెండు రంధ్రములలో కుడిప్రక్కయున్న రంధ్రములో ధనధృవము (పాజిటివ్) ఉండును. ఎడమ ప్రక్కగల రంధ్రములో ఋణధృవము (నెగిటివ్) ఉండును. క్రిందగల రెండు రంధ్రములకు సమాన దూరములో పైనగల

పెద్ద రంధ్రము భూమితో సంబంధముండును, దానినే ఎర్త్ అంటారు. ఈ మూడు పైకి కనిపించు బోర్డులోనున్న సాకెట్ రంధ్రములు. ఇప్పుడు వీటిలో క్రిందగల చిన్న రెండు రంధ్రములలో కుడిప్రక్క పాజిటివ్‌గానున్న దానిని ఆత్మగానూ, ఎడమప్రక్క నెగిటివ్‌గానున్న దానిని జీవాత్మగానూ, ఈ రెండు రంధ్రములకంటే పెద్దదీ పైనగలది అయిన భూమి (ఎర్త్) అనునది పరమాత్మగానూ పోల్చి చెప్పవచ్చును. మూడు ఆత్మల పోలికకు కరెంటు బోర్డుకున్న మూడు రంధ్రములుగానీ, మూడు ప్లగ్ పిన్నులకుగానీ బాగా సరిపోవును. ఈ విధముగా సాధారణ మనుషులకు కూడా మూడు ఆత్మల వివరము తెలియునట్లు, వారు కూడా బాగా అర్థము చేసుకొనునట్లు దేవుడుంచాడు. అంతేకాక ఇంకా అనేక విషయములలో అనేక సందర్భములలో దేవుని యొక్క త్రైతసిద్ధాంతము అర్థమగునట్లు అమర్చాడు. ఇప్పుడు చెట్టుకు కాసిన ఒక కాయను ఉదాహరణగా తీసుకొని చూస్తాము. మామిడి పండును తీసుకొని చూస్తే అందులో కాయకు పైన తోలు ఒక భాగముకాగా, లోపలి తియ్యని గుజ్జు (కండ) అంతయు ఒక భాగముగా ఉన్నది. ఇక మిగిలినది లోపలి విత్తనము (టెంక) మాత్రమే. పండులో కూడా తాట, గుజ్జు, టెంక (విత్తనము) అను మూడు భాగములు కనిపిస్తున్నవి. కాయలో తినేదానికి పనికి రానిదానిగా భావించి తీసివేయు తాటను జీవాత్మగా, శక్తినిచ్చు ఆహారముగానున్న లోపల గుజ్జును ఆత్మగా, ఎన్ని రోజులున్నా చెడిపోని విత్తనముగానున్న టెంకను పరమాత్మగా పోల్చు కోవచ్చును. పోల్చుకోవడమే కాదు ఆ విధముగా కనిపించునట్లు దేవుడే చేసియుంచాడు. ఇట్లు సామాన్య మానవుడు సహితము అర్థము చేసు కొనుటకు బయటి ప్రపంచములో త్రైతమును ఉంచినప్పటికీ, దానిమీద ధ్యాస రాకపోతే ఏమీ తెలియకుండాపోవును. అలా కాకుండా ఆధ్యాత్మిక

విద్యలోనే త్రైతము తెలియునట్లు, బయటికి కనబడునట్లు పూర్వమునుండే దేవుడుంచడము జరిగినది. ఆధ్యాత్మిక జ్ఞానము అను విధానములో మొట్ట మొదట కృతయుగములోనే (కృత్‌యుగములోనే) దేవుడు పురుషుడు అని తెలియునట్లు దైవమును లింగాకృతిలో చూపడము జరిగినది. పురుషాకృతి అయిన లింగాకారములోనున్న దేవుడు మూడు భాగములుగా క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడు అను పురుషులుగా ఉన్నారని తెలియుటకు లింగము మీద అందరికి కనిపించునట్లు మూడు తెల్లని విభూతి రేఖలను ఉంచడము జరిగినది. మూడు రేఖలు మూడు ఆత్మల విధానము తెలుపును కావున వాటిని తెల్లని రంగుగా ఉన్నట్లు, కల్మషము లేని తెలుపు వర్ణముగా కనిపించునట్లు విభూతిరేఖలు పెట్టడము జరిగినది.

కృత్ యుగములో ఆ విధముగా మొదట విభూదిరేఖలను ఈశ్వర లింగము మీద పెట్టి చూపడము జరిగినది. తర్వాత ఈ మూడు ఆత్మలు మనిషిలోనే ఉన్నాయి అని ప్రతి మనిషి తెలియుటకు మానవాకృతియైన ప్రతిమను తయారు చేసి, ఆ ప్రతిమకు మూడు నామములుంచడము జరిగినది. మూడు నామములను మూడు ఆత్మలుగ పోల్చి చూపడమేకాక అందులో ఒకటి దైవము (పరమాత్మ), రెండవది ఆత్మ, మూడవది జీవాత్మ అని తెలియునట్లు, దైవముగానున్న మధ్యరేఖను ప్రత్యేకముగా కనపడునట్లు దానిని ఎరుపు రంగును దిద్దడము జరిగినది. మిగత రెండు రేఖలను ఆత్మ జీవాత్మలు అయిన జోడు ఆత్మలని తెలియుటకు తెలుపు రంగుతో ఉంచడము జరిగినది. ఇట్లు త్రి నామములు ఒకటి ఎరుపుగా, రెండు తెలుపుగా ఉండునట్లు ఉంచడము జరిగినది. ఇదే విధముగా ఈశ్వర లింగము మీది మూడు విభూతిరేఖలలో మధ్యగల రేఖకు ఎర్రని కుంకుమ బొట్టు ఉంచి పైన క్రిందగల ఆత్మలకంటే మధ్యలోనున్న ఆత్మ ప్రత్యేకమైన

దనీ, అదియే ఆత్మకు గుర్తనీ తెలియునట్లు చేయడము జరిగినది. ఈ విధముగా త్రైతసిద్ధాంతము శరీరములో కన్ను, హస్తములలోనూ, ఆధ్యాత్మికములో మూడు విభూతిరేఖలు, మూడు నామములలోనూ, బయట ప్రపంచములో కాయలోనూ, కరెంటు ప్లగ్‌లోనూ, భగవద్గీత పురుషోత్తమ ప్రాప్తియోగములో క్షర, అక్షర, పురుషోత్తములుగానూ, ఖురాన్ గ్రంథము నందు ఖాఫ్ అనబడు 50వ సురాలో 21వ ఆయత్‌యందు నీవు, నీవెంట వచ్చువాడు, సాక్షము చెప్పువాడు అను ముగ్గురుగానూ చెప్పబడియున్నది. అయినా మూడు మతములలోని ఏ మనిషికీ త్రైత సిద్ధాంతమును గురించి తెలియకుండాపోవడము విచిత్రము.

మూడు ఆత్మలనిగానీ, ముగ్గురు పురుషులనిగానీ ఏమాత్రము తెలియని మనిషి, "నేను దేవుడు చెప్పిన జ్ఞానమును అంతటినీ తెలుసు కొన్నాను, నేను దైవజ్ఞానిని అనుకోవడము పొరపాటు కాదా! మూడు ఆత్మల విషయమటుంచి దైవజ్ఞానములో మూడవ ఆత్మయిన పరమాత్మనుకాక, జోడు ఆత్మలని పేరుగాంచిన జీవాత్మ ఆత్మల విషయమును కూడా తెలియని వాడు ఆత్మజ్ఞాని అగునా? **మూడు ఆత్మల త్రైత సిద్ధాంతము తెలియనివాడు దైవజ్ఞాని కాలేడు. అలాగే రెండు జోడు ఆత్మల వివరము తెలియని వాడు ఆత్మజ్ఞాని కాలేడు. కనీసము జీవాత్మ విషయము తెలియని వాడు కనీస జ్ఞాని కూడా కాలేడు.** అందువలన మనిషి దైవజ్ఞాని, ఆత్మజ్ఞాని కావాలంటే త్రైత సిద్ధాంతమును తెలుసుకొని తీరవలసిందే. ఇది దేవునికి సంబంధించిన జ్ఞానము, కావున అన్ని మతముల వారికి త్రైత సిద్ధాంతమే మార్గము.

చాలామందికి జోడు ఆత్మలని మేము చెప్పుమాటయే క్రొత్తగా ఉండును. ఎందుకనగా వారికి జీవాత్మయిన తానుగానీ, తన ప్రక్కనే తనను ఎల్లప్పుడూ అంటిపెట్టుకొన్న ఆత్మగానీ ఏమాత్రము తెలియనివారై

యున్నారు. భగవద్గీతలో అనేక చోట్ల ఆత్మ ప్రస్థావనయున్నా, ప్రత్యేకించి ఆత్మసంయమయోగములో ఆత్మను గురించి చెప్పియున్నా, ఆత్మంటే ఏమిటో తెలియనివారు కొందరుండగా, ఆత్మనే పరమాత్మగా (దేవునిగా) లెక్కించు వారు కొందరున్నారు. ఆత్మకంటే పరముగా ఉన్నది దైవము అని తెలియు నట్లు పర+ఆత్మ=పరమాత్మ అని ఉండగా, ఆత్మను పరమాత్మ అనుకోవడము పొరపాటుకాదా! ఎల్లప్పుడు ప్రక్కనేవున్న రెండవ ఆత్మను తెలియని వారు ఆత్మజ్ఞాని కాలేడు అని నేను చెప్పుచుండగా, నాకు బాగా పరిచయమున్న ఇస్లామ్ ధర్మము తెలిసిన వ్యక్తి "మీరు చెప్పు రెండవ ఆత్మ మా గ్రంథములో ఎక్కడా లేదే! మా గ్రంథమును మీరు దైవగ్రంథమని నమ్ముచున్నప్పుడు దేవుడు ఈ విషయమును చెప్పలేదనీ, దేవుడు కూడా ఈ విషయమును మరచి పోయాడనీ, దేవునికి కూడా ఈ విషయము తెలియదనీ మీరు చెప్పగలరా? అని అడిగాడు. అతను ఖురాన్ గ్రంథమును బాగా చదివిన వ్యక్తియైవుండి అలా నన్ను తిరిగి అడగడము కొంత ఆశ్చర్యమేసింది. వెంటనే అతని మాటకు సమాధానమును ఈ విధముగా చెప్పడము జరిగినది. దేవుడు ప్రపంచమునకంతటికీ ఒక్కడే అయినప్పుడు, ప్రపంచములోని ప్రజలనందరినీ తానే సృష్ఠించియున్నప్పుడు దేవుడు అందరినీ సమానముగా చూచును, దేవుడు అందరికీ అన్ని మతములవారికీ సమానమే. అలాంటపుడు దేవుని జ్ఞానము దేవుడు చెప్పిన ఏ గ్రంథములోనైనా ఒక్కటిగానే ఉండును. ఇంతవరకు నేను చెప్పినది మీ మతములోనిది, మా మతము లోనిదికాదని నీవెందుకు అనుకోవాలి? అన్ని మతములను సృష్ఠించినది ఒక్కదేవుడే. ఆ ఒక్క దేవుడే అన్ని మతముల మూల గ్రంథములలోను తన జ్ఞానమును నింపి ఇచ్చాడు. అలాంటపుడు దేవుని జ్ఞానము భగవద్గీతలో ఉన్నదే బైబిలులో ఉన్నది, ఖురాన్‌లో ఉన్నది అని ఎందుకు అనుకోకూడదు.

మనము గ్రుడ్డిగా అనుకోవడమే కాకుండా దేవుడు ప్రత్యక్షముగా ఖురాన్ గ్రంథములో ఖాఫ్ అను 50వ సురాలో 18వ ఆయత్‌నందు జిబ్రయేల్ దూత ద్వారా ఇలా చెప్పించాడు. "(మనిషి) నోట ఒకమాట వెలువడటమే ఆలస్యము, అతని దగ్గర ఒక పర్యవేక్షకుడు (దానిని నమోదు చేయడానికి) సిద్ధంగా ఉంటాడు." చూచారా ఈ వాక్యములో నీ దగ్గర ఒక పర్యవేక్షకుడు అనగా నిన్ను కాపలా కాయువాడు ఒకడున్నాడనియేగా ఇక్కడ చెప్పారు. ఆ పర్యవేక్షకుడే నీవెంట ఎల్లప్పుడూ ఉండు ఆత్మ అని నీవు ఎందుకు అనుకోకూడదు? అంతేకాక అదే సురాలో (అదే ఆధ్యాయములో) 23వ వాక్యము (ఆయత్) ఇలా ఉన్నది చూడండి. "ఇదిగో (ఇతని కర్మల చిట్టా) నావద్ద సిద్ధముగా ఉంది అని అతని సహవాసి అంటాడు." ఈ వాక్యములో అతని సహవాసి అని చెప్పబడినవాడే ప్రతి జీవాత్మకు తోడుగా నివసించు ఆత్మ అని తెలియవలెను. ప్రతి మనిషి శరీరములోనూ జీవాత్మకు సహవాసిగా ఉన్నవాడు ఆత్మ. వాసి అనగా నివసించువాడు. సహవాసి అనగా నీతో సమానముగా నివసించువాడని అర్థము. ఇక్కడ సహవాసి అని చెప్పబడిన వాడే నీతో పాటు నీ శరీరములోనున్న ఆత్మ అని తెలియవలెను. నీవు మొదటి ఆత్మవు (జీవాత్మవు) కాగా, నీ సహవాసి అయిన ఆత్మయే నీ శరీరములోని రెండవ ఆత్మని జ్ఞాపకముంచుకోవలెను.

శరీరములోపల ద్వైతముగా (రెండుగా) నున్న జీవాత్మ ఆత్మలను తెలియనివాడు అన్ని మతములలోనూ ఉన్నారు. బైబిలులో నీ పొరుగు వాడని ఆత్మ చెప్పబడితే, దానినే ఖురాన్‌లో సహవాసి అని చెప్పారు. ఖురాన్‌లో 50వ సురాలోనే 18,23 ఆయత్‌లలోనేకాక, 27వ ఆయత్‌లో కూడా అక్షరుడైన (నాశనములేనివాడైన) ఆత్మను గురించి ఇలా చెప్పారు. "మా ప్రభూ! నేనితన్ని పెడదారి పట్టించలేదు. ఇతనే స్వయముగా బహు

దూరపు అపమార్గములో పడివున్నాడని అతని సహవాసి అంటాడు.” మనిషి పుట్టినప్పటినుండి చివరి మరణము వరకు శరీరమునకు చైతన్యమునిచ్చి నడిపించువాడు ఆత్మ అనబడు సహవాసియే. సహవాసి లేక పొరుగు వాడు అనబడు ఆత్మ మనిషిలోని జీవున్ని జ్ఞాన విషయములో స్వతంత్రముగా వ్యవహరించునట్లు చేయును. జీవునికి ఒక్క జ్ఞాన విషయములలో మాత్రము స్వతంత్రతయున్నది. జీవుని శ్రద్ధనుబట్టి వానికి జ్ఞానము లభించును. అందులో సహవాసి అయిన ఆత్మయొక్క జోక్యము ఏమీ ఉండదు. అందువలన ఆత్మ జీవున్ని గురించి “ఇతనే స్వయముగా బహుదూరపు అపమార్గములో పడి ఉన్నాడు” అని చెప్పుచున్నాడు. మనిషి (జీవుని) శ్రద్ధనుబట్టి జ్ఞానము లభించుననుటకు సాక్ష్యముగా ఇదే సురాలో 37వ ఆయత్‌లో ఇలా ఉన్నది చూడండి. “శ్రద్ధగా ఆలకించి, సావధానముగా మసలుకొనే ప్రతి వ్యక్తికీ ఇందులో హితబోధ కలదు.” ఇక్కడ ఉన్న వాక్యమును బట్టి మనిషి శ్రద్ధకలిగి జాగ్రత్తగా తెలుసుకొంటే, ఎంతటి జ్ఞానమునైనా ఏ గ్రంథమునుండైనా గ్రహించవచ్చునని తెలియుచున్నది. ఒక్క దైవ జ్ఞాన విషయములలోనే జీవునికి స్వతంత్రతగలదు. మిగత ఏ విషయములో అయినాగానీ సహవాసిగానున్న ఆత్మయే ప్రతి వానిని నడిపించుచున్నది. అందువలన ఇదే సురాలో 21 వాక్యములో “ప్రతి వ్యక్తి తనవెంట తనను నడిపించువాడొకడు (తనను తోలువాడొకడు) తనకు సాక్ష్యమిచ్చువాడొకడు ఉన్న స్థితిలో హాజరవుతాడు” అని చెప్పారు. తనను నడిపించువాడు తన వెంటవచ్చువాడు ఆత్మకాగా, తనలో ఎల్లప్పుడు సాక్షిగా ఉంటూ ఏమీ చేయకున్నవాడు పరమాత్మ అని తెలియవలెను. అయితే ఈ వాక్యమునకు తనను నడిపించువాడనీ, తనను తోలువాడనీ, తనను తీసుకవచ్చువాడనీ మిగత ఖురాన్ గ్రంథములలో వ్రాసినా, అవి అన్నియు

తనవెంట వుండువాడనీ, తనను నిత్యము నడిపించు సహవాసి అనియే తెల్పుచున్నవి.

అన్ని మూల గ్రంథములలో జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను త్రైతమును తెల్పియున్నా ఇస్లామ్‌లోని ముస్లీమ్‌లకు దేవుడు ఒక్కడే అర్థమైనాడు, మిగత ఆత్మ, జీవాత్మల విషయము ఏమీ తెలియలేదు. క్రైస్తవములోనికి పోయి చూస్తే తండ్రి, కుమారుడు, పరిశుద్ధ ఆత్మయని దానినే త్రిత్వమని వారు చెప్పినా వారికి త్రిత్వముగానీ, దిత్వముగానీ ఏమీ అర్థము కాలేదనియే చెప్పవచ్చును. త్రిత్వమనీ, ట్రినిటీ అని క్రైస్తవులు చెప్పుచున్నా అందులో త్రిత్వము లేదు. కుమారుడు, తండ్రి వేరువేరయినా, తండ్రి అనువాడు పరిశుద్ధాత్మ అనువాడు ఇద్దరూ ఒక్కరే అగుదురు. దేవుడైన పరిశుద్ధాత్మనే తండ్రి అని అక్కడ చెప్పబడుచున్నది. తండ్రి, పరిశుద్ధాత్మ ఒకే దేవుడు అగుట చేత రెండిటినే మూడవదైన పరమాత్మగా లెక్కించ వలెను. తండ్రి నుండి లేక పరిశుద్ధాత్మ నుండి వచ్చి పుట్టినవాడు కుమారుడగును. తండ్రి (దేవుని) అంశచేత పుట్టినవాడు కుమారుడు. కుమారుడు కంటికి కనిపించు శరీరము కల్గియుండును. తండ్రిలేక పరిశుద్ధాత్మ కంటికి కనిపించువాడు కాదు. తండ్రి జ్ఞానమును తననిండా నింపుకొని పుట్టువాడు కుమారుడు, ఆయనే ఏసుప్రభువు. ఏసు, కుమారుడు కాగా దేవుడు తండ్రిగాయున్నాడు. మనకు కూడా దేవుడు తండ్రే అయినా మనము మన తండ్రిగా దేవున్ని చెప్పక భౌతిక తండ్రిని చెప్పుచున్నాము. దేవుడే తన తండ్రిగా ఏ మనిషీ భావించడములేదు. ఒకవేళ చెప్పినా అది జ్ఞానము ప్రకారమేనని కనిపించు మనిషినే తండ్రి అని చెప్పడము జరుగు చున్నది. వాస్తవానికి అన్ని విధముల చూస్తే ఏసుప్రభువు ఒక్కడే తన నిజమైన తండ్రి అయిన దేవున్ని గురించి చెప్పాడు. అందువలన ఎంతటి

జ్ఞాని అయిన కొంత పొరపడి ఆత్మను పరమాత్మను విడిగా గుర్తించలేక పోవుచున్నాడు. క్రైస్తవులకు కూడా దేవుడైన యెహోవా ఉన్నాడను నమ్మకము తప్ప త్రైత సిద్ధాంతము ప్రకారము మూడు ఆత్మలున్నాయని తెలియదు.

ఇక హిందువులలోనికి వస్తే చాలామందికి భగవద్గీత విషయమే తెలియదు. వారు వేదములనే గొప్పగ చెప్పుకొనుచూ భగవద్గీతను మరచి పోయారు. వేదములను గ్రంథరూపములో వ్రాసిన వ్యాసుడే చివరిలో బాధపడి, తాను తెలియక చేసిన పొరపాటుకు చింతించి భగవంతుడు చెప్పిన భగవద్గీతను వ్రాసి తృప్తిచెందగా, ఆ విషయము తెలియని హిందువులు భగవద్గీతకంటే వేదములే గొప్పవని పొరపడి గీతను వదలి వేదములను ఆశ్రయించారు. అందువలన చాలామందికి గీతలోని త్రైత సిద్ధాంతము తెలియకుండాపోయినది. కొందరు భగవద్గీతను కూడా చదివిన వారు కలరు. అయితే శ్రద్ధాలోపము వలన గీతలోని పురుషోత్తమ ప్రాప్తి యోగమున గల త్రైత సిద్ధాంతమును గ్రహించలేకపోయారు. అయినా కొందరికి జీవుడు దేవుడు అను విధానము కొంత అర్థమైనదిగానీ, మధ్యలోని ఆత్మంటే ఏమిటో తెలియకుండా పోయినది. క్రైస్తవులకు, ముస్లీమ్‌లకు వారి మతములందు వారివారి దేవుడు వేరువేరన్నట్లు అర్థమైనది. క్రైస్తవులు, ముస్లీమ్ దేవుడు అల్లాహ్ వేరని భావించుచుందురు. అలాగే ముస్లీమ్‌లు క్రైస్తవుల దేవుడు యెహోవా వేరని భావించుచుందురు. చెప్పు బోధలలో విశ్వమునకంతటికి దేవుడు ఒక్కడేనని వాస్తవమునే చెప్పుచూ, ఆ దేవుడు మా దేవుడు మాత్రమే, వారి దేవుడు కాదను భేదభావము కలిగియుందురు. ఏది ఏమైన వారివారి మతములలో దేవుడొకడున్నాడని తెలిసియున్నారు. అయితే రెండవ ఆత్మ విషయముగానీ, మొదటికి తానొక జీవుడననిగానీ

తెలియక దేవున్ని ప్రార్థనను చేయుచున్నాడు. ఇట్లు క్రైస్తవ, ఇస్లామ్ మతములలో దైవములో భాగమైన జీవాత్మ విషయమునుగానీ, ఆత్మ విషయమునుగానీ తెలియక దేవుని విషయమును మాత్రము చెప్పుచుందురు. మరికొన్ని మతములలో జీవున్ని మాత్రము చెప్పుకొనుచూ దేవుడే లేడనుచున్నారు. ఒక్క హిందూమతములో మాత్రము జీవుడు దేవుడని కొందరనుచున్నారు. అయితే ఏ మతములోగానీ జీవునికి దేవునికి మధ్యలో ఆత్మ ఒకటున్నదని ఎవరూ గ్రహించలేదు. ఆత్మ విషయముగానీ, దాని వివరముగానీ, దాని జ్ఞానముగానీ తెలియకున్నా, అందరి నోటిలోనూ ఆత్మ అను శబ్ధము పలుకబడుచున్నది. ఆత్మహత్మ అనిగానీ, ఆత్మద్రోహము అనిగానీ, ఆత్మజ్ఞానము అనిగానీ, ఆత్మక్షోభ అనిగానీ, ఆత్మ బలము అనిగానీ ఎన్నో విధముల ఆత్మ అను పదము మనిషి చేత చెప్పబడుచుండినా ఆత్మంటే ఏమిటో, ఎక్కడుంటుందో, ఏమి చేస్తుంటుందో, ఎవరికీ తెలియదు. అందువలన హిందువులు ఆత్మ పరమాత్మలను రెండిటిని తెలియవలసి ఉండగా, మిగతా మతస్థులందరూ మూడు ఆత్మలను గురించి తెలియవలసి ఉన్నది. ఏ మతస్థులయినా మీ త్రైత సిద్ధాంతము మాకెందుకు అనకుండా, దేవుడు అన్ని మతముల గ్రంథములలోను మూడు ఆత్మలను గురించిన త్రైత సిద్ధాంతమును తెలిపియున్నాడు. అందువలన ఎవరుగానీ ఇది మీ జ్ఞానము అనుటకు వీలులేదు.

ఐదువేల సంవత్సరముల పూర్వము మనుషులలో మతముల ప్రసక్తే లేదు. దేవుని జ్ఞానమును గురించిన శ్రద్ధతో ఉండినా ఎక్కువ ఆరాధనలకు అలవాటుపడియుండెడివారు. దేవుడు సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానము మనుషులకు తెలియకుండపోయినది. కొందరు జ్ఞానులమనిపించుకొన్నవారు కూడా దైవధర్మములను వదలి అధర్మముల జ్ఞానమునే బోధించుచుండుట వలన,

ఆరాధనలు ఎక్కువై పోయి జ్ఞానము తగ్గిపోయినది. ఆ నేపథ్యములో ధ్యానము, దానము, వేదాధ్యయనము, యజ్ఞములను చేయుట ఎక్కువై పోయినది. అటువంటి పరిస్థితిలో దేవుడు తన ధర్మములను తెలియజేయు నిమిత్తము ఒక మనిషిగా అవతరించి, అసలైన జ్ఞానమును చెప్పిపోయాడు. అయినా అది మనుషులలో తొందరగా ప్రాకలేక పోయినది. అందువలన అప్పటినుండి ఇప్పటి వరకు దేవుడు మనిషిగా వచ్చి చెప్పిన జ్ఞానముయొక్క వివరము మనుషులకు తెలియలేదనియే చెప్పవచ్చును. దేవుడు భగవంతునిగా ద్వాపరయుగము చివరిలో అవతరించి తన జ్ఞానమును చెప్పిపోగా, తర్వాత కొంతకాలమునకు దేవుని జ్ఞానము భూమిమీద ప్రజలలో ప్రాకకనే మతములనునవి పుట్టుకొచ్చినవి. విదేశములలో క్రైస్తవ మతము అభివృద్ధికాగా, భారతదేశము దానిచుట్టు ప్రక్కల గల దేశములన్నిటిలో బౌద్ధమతము వ్యాపింపజొచ్చినది. బౌద్ధమతము భారతదేశములోనే పుట్టుట వలన, అశోక చక్రవర్తి కూడా దానిని అవలంబించుట వలన, ఆయనను చూచి చాలామంది బౌద్ధమతస్థులుగా మారిపోయారు. స్వయాన అశోక చక్రవర్తి మరియు ఆయన కూతురు ఎక్కువగా బౌద్ధమతమును ప్రచారము చేయుట వలన, రెండువేల సంవత్సరముల పూర్వము బౌద్ధమతము ఎక్కువ ప్రచారమై అందులోనికి చాలామంది పోవడము జరిగినది.

అటువంటి సమయములో బౌద్ధమతము అని ఒక మతము పేరు చెప్పువారు వచ్చినప్పుడు, అంతవరకు ఉన్న ఇందువులు మేము ఇందువుల మని చెప్పుకోవలసి వచ్చినది. అలా చెప్పుకోవడములో మాది ఇందూ మతమని చెప్పుకోవడము జరిగినది. కొంత కాలమునకు ఇందూ మతము కాస్తా హిందూమతముగా మారిపోయినది. కొద్దిపాటి శబ్ద భేదమును ఎవరూ గ్రహించక అందరూ మేము హిందువులమని చెప్పుకోవడము

జరిగినది. ప్రక్కలో బౌద్ధమతము పెరుగుట వలన, అంతవరకున్న హిందువులు ఒక్కొక్కరు బౌద్ధమతమును స్వీకరించుట వలన, హిందూ మతము క్షీణించుటకు మొదలుపెట్టినది. అటువంటి సమయములో కేరళ రాష్ట్రములో బ్రాహ్మణ కులమున పుట్టిన శంకరాచార్యులు హిందూమతములో అద్వైత సిద్ధాంతమును స్థాపించి, హిందూమతము బౌద్ధమతము వలన క్షీణించకుండా చూచారు. అంతటితో బౌద్ధమతము వ్యాప్తి చెందకుండ అగవలసివచ్చినది. తర్వాత కొంతకాలమునకు తమిళనాడు రాష్ట్రములో బ్రాహ్మణ కులమున రామానుజాచార్యుల వారు పుట్టి, అద్వైతములో కొంత విశిష్టత కల్గిన విశిష్ఠాద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించి, శంకరాచార్యుల వారికి కొంత విభిన్నముగా బోధించను మొదలుపెట్టెను. అప్పటిలో హిందుమతములోనే అద్వైతమును అనుసరించు వారికి, విశిష్ఠాద్వైతము అనుసరించువారికి పెద్దగా ఘర్షణలు కూడా జరిగాయి. ఒకరిమీద మరొకరు దాడులు చేసుకోవడము, చంపుకోవడము కూడా జరిగినది. అటువంటి సమయములో కర్ణాటక రాష్ట్రములో బ్రాహ్మణ కులములో పుట్టిన మధ్వాచార్యులు ద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించడము జరిగినది. అప్పటినుండి అద్వైత, విశిష్ఠాద్వైతములలో లేనివారు కొందరు ద్వైతమును అనుసరించడము జరిగినది. ఈ విధముగా హిందూమతములో అద్వైతులు కొందరు, ద్వైతులు కొందరు, విశిష్ఠాద్వైతులు కొందరు తయారు కాగా, మిగిలిన వారందరూ మేము హిందువులమని చెప్పుకొనెడివారు.

అటువంటి సమయములో ఒక ప్రక్క ఇస్లామ్‌వారు భారతదేశములో ప్రవేశించి తమ ధర్మమును ప్రచారము చేశారు. తర్వాత మరొక ప్రక్క క్రైస్తవులు భారతదేశములో ప్రవేశించి తమ క్రైస్తవమును ప్రచారము చేశారు. ఆ రెండూ రెండు మతములుగా ప్రచారమగుట వలన భారతదేశములో

మిగిలిన హిందువులు ఇతర మతములవైపు ఆకర్షింపబడడము జరిగినది. ఎంతకాలమున్నా తమ హిందూమతములో జ్ఞానము తెలియలేదని, బ్రాహ్మణులవద్ద శూద్రులమనీ, అంటరానివారమనీ అనిపించుకోవడము కంటే ఇతర మతములలోనికి పోయి, ఆ మతములో అందరితోపాటు సమానముగా ఉండవచ్చునని చాలామంది హిందువులు క్రైస్తవులుగా మారి పోవడము జరిగినది. కొద్దిపాటి వారు మాత్రము ఇస్లామ్‌లో చేరిపోగా, ఎక్కువమంది క్రైస్తవులుగా మారిపోయారు. దానితో నేటికి హిందూమతము భారతదేశములో కొంత క్షీణించిపోయినదని చెప్పవచ్చును. ఇప్పుడు మీరొక ప్రశ్నను అడగవచ్చును. అదేమనగా! "క్రైస్తవము, ఇస్లామ్ భారత దేశములోనికి ప్రవేశించక ముందే బౌద్ధమతము ప్రచారము చేయబడినది. బౌద్ధమతము వలన హిందూమతము క్షీణించి పోతుందను ఉద్దేశ్యముతో ఆదిశంకరాచార్యుడు అద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించి ప్రచారము చేశాడు. తర్వాత విశిష్ఠాద్వైత సిద్ధాంతమును రామానుజాచార్యుల వారు ప్రచారము చేశారు. అట్లే మధ్వాచార్యులు ద్వైత సిద్ధాంతమును ప్రచారము చేశారు. ఈ విధముగా ముగ్గురు ఆచార్యులు హిందూమతమును ఉద్ధరించాలని చూచినప్పటికీ చివరకు హిందూమతము ఎందుకు క్షీణించుచున్నదనీ, ఇతర మతములు పెరుగుటకు కారణమేమి" అని అడుగవచ్చును.

దానికి మా జవాబు ఈ విధముగా ఉన్నది. ఆదిశంకరాచార్యులు గానీ, రామానుజాచార్యులుగానీ, మధ్వాచార్యులుగానీ ముగ్గురూ దక్షిణ దేశము వారే. వీరు ముగ్గురూ ద్రావిడ బ్రాహ్మణులే. మొదట వీరి ఉద్దేశ్యము మంచిదే అయినా, తర్వాత వీరి సిద్ధాంతములు రాజకీయపార్టీల మాదిరి మారిపోయి, నేను గొప్ప నేను గొప్ప అను స్థితికి వచ్చారు. ఆ విధముగా వీరిని మార్చినది ఆర్య బ్రాహ్మణులు. ఆర్య బ్రాహ్మణుల ప్రభావము

వీరిమీద పడుట వలన వీరు అసలైన ఇందూధర్మములను మరచిపోయారు. భగవద్గీతను ఎక్కడా చెప్పకుండా వేదములనే చెప్పుచూ వచ్చారు. పూర్తి లోపము అక్కడనుండి ప్రారంభమైనది. మొదట దక్షిణ భారతదేశము వారు సంపూర్ణ ఇందూ జ్ఞానమును (దైవజ్ఞానమును) తెలిసినవారు కాగా, తర్వాత ఆర్యబ్రాహ్మణుల గాలి తగిలి వారు తప్పుదారిలో నడువను మొదలుపెట్టారు. చివరకు భగవద్గీతలో దేవుడు చెప్పిన జ్ఞానము తెలియకుండా పోయి, మనుషులు చెప్పిన వేదములలో పాండిత్యమును సంపాదించుకొని దాని ప్రకారము నడువను మొదలుపెట్టారు. ఉత్తర భారతదేశములోని సంస్కృత భాషకు అలవాటు పడిపోయి వేదములనే చెప్పుచూ, తమ సిద్ధాంతములను ప్రత్యేక సమాజముగా చెప్పుకొనుచూ, అద్వైతులనీ, విశిష్ఠాద్వైతులనీ, ద్వైతులనీ చెప్పుకోవడము జరిగినది. తమ సిద్ధాంతములకు తగినట్లు అద్వైతులు విభూది ధారణ చేసుకోగా, విశిష్టాద్వైతులు మూడు నామములను పెట్టుకోగా, ద్వైతులు విశిష్టాద్వైతుల కంటే కొంత వేరుగానున్న మూడు నామములను పెట్టుకోవడము జరిగినది. అద్వైతులు పూర్తిగా తెల్లని విభూతిరేఖలను తల ఫాలభాగములో అడ్డముగా ధరించగా, విశిష్టాద్వైతులు, ద్వైతులు ఇద్దరూ మూడు నామములనే వేరువేరు రంగులలో నుదుటి భాగములోనే ధరించారు. ఆ విధముగా ధరించడము వలన ఆయా సిద్ధాంతకర్తలు సిద్ధాంతములతో పాటు నామములను కూడా కనిపెట్టారని కొందరనుకొనుచున్నారు.

చరిత్రలో ఏమి జరిగినదని తెలియనపుడు ఆదిశంకరాచార్యుడే విభూది నామములను తన అద్వైతము కొరకు తయారు చేశాడనీ పొరపాటుగా అనుకోవడము జరిగినది. వాస్తవానికి మూడు విభూది రేఖలతో గానీ, మూడు నామములలోగానీ నేడున్న అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత

సిద్ధాంతములకు సంబంధములేదు. ఆ సిద్ధాంతకర్తలు తమ చిహ్నాములుగా పెట్టుకొన్న నామములను వారు కనిపెట్టనూలేదు. కృత్‌యుగములోనే దైవ జ్ఞానమును తెలిసిన కొందరు ప్రజలకు అందరికీ జ్ఞానము తెలుపు నిమిత్తము, త్రైతసిద్ధాంతమును నిరాకార దేవునియందునూ, సాకార భగవంతునియందును చూపుటకు అడ్డనామములనూ, నిలువు నామము లనూ పెట్టి చూపించారు. సృష్ట్యాదిలో దేవుడు తన జ్ఞానమును బోధించినపుడే త్రైత సిద్ధాంతమును బోధించాడు. ఆదిలో దేవుడు బోధించిన జ్ఞానమును కొందరు జ్ఞానులు ఇతరులకు మాటలరూపములోనే కాకుండా దృశ్య రూపములో కూడా బోధించారు. అలా దేవున్ని దృశ్యరూపములో తెలుపుచూ దేవునికి ఆకారము లేదు, పేరులేదు, పని లేదు అను సూత్రమును చూపుటకు ముక్కు, ముఖము లేని గుండ్రనిరాయిని దేవునిగా చూపించడము జరిగినది. దేవుడు పురుషుడు కావున ముక్కు ముఖము అను ఆకారములేని రాయిని లింగము అని పిలువడము జరిగినది. లింగము అను పదము పురుషున్ని సూచించును. కావున దేవుని గుర్తుగా పెట్టిన రాయికి 'లింగము' అని పేరుంచడము జరిగినది. దేవుడు విశ్వమునకంతటికి అధిపతి కావున ఆయనను అధిపతి అను అర్థమునిచ్చు పదమైన 'ఈశ్వర' అను శబ్ధముతో పిలువడము జరిగినది. ఈశ్వర అను పదము పేరుకాదు అర్థమును తెలుపు పదమని జ్ఞాపకముంచుకోవలెను. ఈ విధముగా పెట్టిన ఈశ్వర లింగము నకు రూపములేదు, పేరూలేదు. అలాగే ఒకచోటున్న లింగరూపమైన రాయి కదలదు మెదలదు, కావున క్రియలేనివాడు దేవుడు అని చెప్పుటకు వీలగు చున్నది. మొత్తము మీద దేవునికున్న రూప, నామ, క్రియలు లేనివాడను సూత్రము లింగములో దృశ్యరూపముగా తెలియుచున్నది. దేవుడు మూడు భాగములుగా ఉన్నాడను త్రైత సిద్ధాంతమును తెలుపు నిమిత్తము లింగము

మీద మూడు విభూదిరేఖలను అడ్డముగా పెట్టడము జరిగినది. మూడు విభూదిరేఖలను మూడు ఆత్మలుగా తెలుపుచూ ఆ దినము మూడు రేఖలను లింగము మీద పెట్టడము జరిగినది. మూడు ఆత్మలను మూడు తెల్లని విభూదిరేఖలుగా చూపడమే కాకుండా, అందులో ముఖ్యమైన ఆత్మగా ఒక దానిని గుర్తించుచూ మధ్యలోగల రేఖమీద ఎర్రని కుంకుమ బొట్టునుంచడము జరిగినది. (లింగాకారము యొక్క సంపూర్ణ సమాచారము మా రచనలలోని **"దేవాలయ రహస్యములు"** అను గ్రంథములో లభించును.) ఈ విధముగా పూర్వము కృత్‌యుగమందే విభూదిరేఖలు నిర్మించబడ్డాయి. మూడు యుగముల తర్వాత వచ్చిన కలియుగములో అద్వైతులు విభూది రేఖలను తమ అద్వైతమునకు గుర్తుగా వాడుకొన్నారు. అంతేతప్ప అద్వైతులకు విభూది రేఖలకు ఏమాత్రము సంబంధములేదు. మూడు విభూది రేఖలు మూడు ఆత్మల వివరమును తెలియజేయు త్రైతసిద్ధాంతమునకు ప్రతీకగా ఉన్నవని తెలియవలెను.

ఇక మూడు నిలువు నామముల విషయమునకు వస్తే దేవుడు నిరాకారుడే కాదు, ఆయన తన జ్ఞానమును బోధించుటకు ఎప్పుడో ఒకప్పుడు సాకార రూపమున భగవంతునిగా వచ్చుననీ, అలా వచ్చినప్పుడు ఆయన తన జ్ఞానమును బోధించడమేకాక, తాను మూడు ఆత్మలుగా విభజింపబడి యున్నానని తెలుపు నిమిత్తము మూడు నిలువు నామములను ధరించుననీ, మనిషిని పోలిన ప్రతిమ ఆకారమును తయారు చేసి, ఆ ప్రతిమకు నిలువు నామమును ఉంచారు. దేవుడే భగవద్గీతయందు మనుషులలో ధర్మములకు ముప్పు ఏర్పడి, అధర్మములు అభివృద్ధి అయినప్పుడు నేను అవతరించి జ్ఞానమును తెలియజేస్తానని, జ్ఞానయోగమను అధ్యాయములో 5,6,7,8 శ్లోకములలో చెప్పియున్నారు. ఇదే విషయము దేవుడు సృష్ట్యాదిలోనే

చెప్పాడు. అందువలన కృత్‌యుగములోనే కొందరు బాగా జ్ఞానమును తెలిసినవారు మొదట నిరాకార దేవుని రూపమైన ఈశ్వర లింగమును తయారు చేసి చూపించారు. లింగము మీద త్రైత సిద్ధాంతము తెలియు నట్లు మూడు విభూదిరేఖలనుంచారు. నిరాకార రూపమును సూచించు ఈశ్వరలింగమును ఉంచడమే కాకుండా, సాకార భగవంతుని రూపమును కూడా ప్రతిమ రూపములో ఉంచారు. అలా మనిషి ఆకార ప్రతిమను ఉంచడము వలన దేవుడు మనిషిగానే వచ్చి తన ధర్మములను తెలియ జేస్తాడని అందరికీ తెలియునట్లు చేశారు. దేవుడు సాకారములో వచ్చినప్పుడు తన విధానమంతయు మూడు ఆత్మలుగా ఉన్నదని తెలుపుటకు, తల నుదుటి భాగమున మూడు నిలువు నామములను ధరించి చూపునని, జ్ఞానులైన వారు ప్రతిమకు మూడు నిలువు నామములనుంచారు. ఎవరిని చూచినా ముఖమువైపే చూస్తాము, కావున ముఖము మీద నామములు పెట్టుట వలన దేవుని త్రైతసిద్ధాంతము అందరికీ సులభముగా తెలియునని ఆనాటి జ్ఞానుల భావము.

ఈ విధముగా కృత్‌యుగములోనే గొప్ప జ్ఞానులైన వారు దేవుని యొక్క నిరాకారమునూ, సాకారమునూ తయారుచేసి, వాటిని చూచిన వారంతా దైవజ్ఞానమును తెలియగలరని ఆశించారు. అయితే మంచిలోనే చెడు జరిగిందన్నట్లు అద్వైత, విశిష్ఠాద్వైత సిద్ధాంతకర్తలు వచ్చిన తర్వాత నిరాకార ఈశ్వర లింగము అద్వైత దేవునిగా, లింగము మీది విభూది గుర్తులు అద్వైత అడ్డనామములుగా (విభూది రేఖలుగా) అద్వైతులు చెప్పు కోవడము జరిగినది. అదే విధముగా సాకార రూపమునూ, దానిమీది మూడు నామములనూ విశిష్ఠాద్వైతులు తమ దేవునిగా, నామములు తమ సాంప్రదాయగుర్తులుగా చెప్పుకోవడము జరిగినది. ఈ విధముగా హిందూ

మతమును ఉద్ధరించుటకు వచ్చిన సిద్ధాంతకర్తలే తప్పటడుగులేసి ఒకరు విభూతిరేఖలనూ, మరొకరు మూడు నామములను తమ సిద్ధాంత గుర్తులుగా చెప్పుకోవడము వలన మొదటి జ్ఞానుల భావము గాలిలో కలిసిపోయి, వాటిలో త్రైతసిద్ధాంతము ఇమిడియున్నదను రహస్యము తెలియకుండా పోయినది. ఎంతో గొప్ప ఉద్దేశ్యముతో పెట్టిన విభూదిరేఖలు, త్రి నామముల భావము ఎవరికీ తెలియకుండా పోయినది. నిరాకార, సాకార చిహ్నములుగా నున్న విభూదిరేఖలు, మూడు నామములు అద్వైతులకుగానీ, విశిష్ఠాద్వైతు లకుగానీ ఏమాత్రము సంబంధములేనివి. అయినా అవి నేడు అద్వైత, విశిష్ఠాద్వైత చిహ్నములుగా మారిపోయాయి. విశిష్ఠాద్వైతము తర్వాత పుట్టుకొచ్చినది ద్వైతము. ద్వైత సిద్ధాంతమును మధ్వాచార్యులవారు కర్ణాటక రాష్ట్రమునుండి ప్రచారము చేయడము జరిగినది. అప్పుడు అద్వైతులకు, విశిష్ఠాద్వైతులకు విభూదిరేఖలు, మూడు నామముల చిహ్నములున్నట్లే తమకు ఒక చిహ్నము అవసరమైనది. కృతయుగమునుండి ఉన్న విభూది రేఖలనూ, మూడు నామములనూ అద్వైతులు, విశిష్ఠాద్వైతులు వాడు కోవడము జరిగినది. పూర్వమునుండి ఉన్నవి రెండు చిహ్నములే, ఆ రెండు చిహ్నములను ముందే ఇద్దరు సిద్ధాంతకర్తలు వాడుకొన్నారు. తమకంటూ ఏమీ మిగలలేదు. అప్పుడు ద్వైత సిద్ధాంతకర్త అయిన మధ్వాచార్యులు కొంత ఆలోచించి, తన యోచనకందినట్లు విశిష్ఠాద్వైతులు వాడుకొన్న మూడు నామములనే కొంత మార్పుచేసి వాడుకోవాలనుకొన్నాడు. అనుకొన్నట్లే మూడు నిలువు నామములను కొంతవరకు రంగు, రూపులలో మార్పు చేర్పుచేసి రంగు, రూపు మారిన నామమునే తమ ద్వైత చిహ్నముగా వాడుకొన్నారు. మూడు సిద్ధాంతములకు చిహ్నములుగానున్న విభూది రేఖలనూ, మూడు నామములను తర్వాత పేజీ పటములలో చూడవచ్చును.




**అద్వైతుల అడ్డ విభూదిరేఖలు**




**విశిష్టాద్వైతుల నిలువు నామము**




**ద్వైతుల నిలువు నామము**

ముందు పేజీలో పటములలో అద్వైతుల విభూతిరేఖలు, విశిష్ఠాద్వైతుల నిలువు నామములను చూచారు కదా! అలాగే నిలువు నామములో కొంత మార్పు చేయబడిన నామము మధ్వులకు (ద్వైతులకు) ఉన్నది. నిలువు నామములు రెండూ ఒకే సూత్రమును సూచించుచున్నవి. విశిష్ఠాద్వైతులకు ద్వైతులకు నామముయొక్క ఆకారములో కొంత తేడాను పై పటములో గమనించవచ్చును. ఆత్మ, జీవాత్మలుగా గుర్తించిన రెండు ప్రక్క నామములు క్రిందివైపున 90 డిగ్రీల కోణమును కలిగియున్న నామములు విశిష్ఠాద్వైతులవి. రెండు నామములు తెలుపురంగు కలిగియుండి మధ్యలోగల నామము మాత్రము ఎరుపురంగుతో గుర్తింపబడియుండును. అదే విధముగా రంగులో తేడా లేకున్నా రెండు తెల్లనామములు క్రింది ప్రక్కన కోణములు మూలలో లేకుండా గుండ్రని ఆకారమును కలిగి యుండును. అలా క్రిందివైపున గుండ్రముగా ఉన్న నామమును ద్వైతులు తమ గుర్తుగా పెట్టుకొనుచుందురు. అద్వైతులేమో అడ్డముగా మూడు విభూదిరేఖలను పెట్టుచుందురు. విశిష్ఠాద్వైతులకు ద్వైతులకు కొంత తేడాతో నామము ఒక్కటేననీ, అద్వైతులకు పోటీ లేకుండా విభూదిరేఖలు మాత్రము గలవని అర్థమగుచున్నది. అయితే ఇక్కడ కొంత గమనించవలసిన విషయ మొకటున్నది. అద్వైతుల మూడు విభూదిరేఖలను అడ్డముగా పెట్టడము వలన క్రిందిది ఒక రేఖ, పైది ఒక రేఖ, మధ్యలోనిది ఒక రేఖగా విడివిడిగా చెప్పబడుచున్నవి. మూడు విభూది రేఖలు మూడు ఆత్మలకు గుర్తుగా ఉండుట వలన అన్నిటికంటే క్రింది రేఖను జీవాత్మగానూ, మధ్యరేఖను ఆత్మగానూ, పై రేఖను పరమాత్మగానూ చెప్పవలసివచ్చినది. పరమాత్మ రెండు ఆత్మలకంటే పెద్ద అయినందున విభూదిరేఖలలో కూడా క్రింది రేఖలకంటే పైనవున్న రేఖనే పరమాత్మకు గుర్తుగా చెప్పవలసివచ్చినది.

ఇక మధ్యరేఖను ఆత్మగానూ, క్రిందిరేఖను జీవాత్మగానూ పోల్చుట క్రమబద్ధమైనది. క్రింది రెండు రేఖలు జీవాత్మ, ఆత్మకాగా, పై రేఖ పరమాత్మయనుటకు మన హస్తములో కూడా అదే విధముగా పరమాత్మ రేఖ పైన క్రింద జోడు ఆత్మలు ఉన్నట్లు కనిపించుచున్నవి. మన హస్తములో కూడా క్రింది రెండు రేఖలు జీవాత్మ ఆత్మలుగా, పైనగల రేఖ పరమాత్మగ లెక్కించబడినట్లు తెలుసుకొన్నాము కదా! అదే విధముగా మూడు విభూది రేఖలున్నవని అర్థమగుచున్నది. మూడు విభూదిరేఖలలో పరమాత్మకు చిహ్నముగానున్న పై రేఖను వదలి జీవాత్మకు చిహ్నముగానున్న క్రింది రేఖను వదలి ఆత్మకు చిహ్నముగాగల మధ్యరేఖకు మధ్యలో ఎర్రని గుర్తును పెట్టడము జరిగినది. అలా మధ్యరేఖకు ఎర్రని గుర్తును పెట్టడము పూర్వము కృతయుగములోనే జరిగినది. ఆ దినము ఆత్మ జ్ఞానమును సంపూర్ణముగ తెలిసిన యోగులు, ఆ విధముగా ఆధ్యాత్మిక అర్థముతో మధ్యరేఖకు ఎర్రని గుర్తును పెట్టడము జరిగినది.

ఇక్కడ కొందరికి ఒక సంశయము రావచ్చును. ఆధ్యాత్మికములో ఏ భావముతో మధ్యరేఖకు ఎర్రని గుర్తునుంచుచున్నారని అడుగవచ్చును. దానికి మా జవాబు ఇలా కలదు. ప్రతి మనిషి పైకి ఏ శరీరమును ధరించియున్నా, లోపల మాత్రము అతను జీవాత్మగానే ఉన్నాడు. శరీరమే తాననుకొన్న మనిషి, తాను కేవలము శరీరములో ఒక భాగముగావున్న జీవున్నేననీ, శరీరము తానుకాదనీ తెలియదు. శరీరములో ఒకచోట స్వల్ప భాగముగాయున్న జీవునికి ఆత్మజ్ఞానము లేనందున శరీరమువేరు, తాను వేరనీ, శరీరములో తనను నడిపించు ఆత్మ శరీరమునకంతటికి అధిపతిగా ఉంటూ శరీరమంతా వ్యాపించియున్నదని తెలియదు. ఆత్మ అనునది శరీరమంతా ఉంటూ జీవాత్మకు సహవాసిగా లేక జోడు ఆత్మగా ఉన్నదని

కూడా జీవునికి తెలియదు. శరీరములో ఒక్కచోట రవ్వంత ఉండువాడు జీవాత్మకాగా, శరీరమంతా వ్యాపించి ఉండువాడు ఆత్మకాగా, శరీరము లోపల, శరీరము బయట అంతటా వ్యాపించియున్నవాడు పరమాత్మ. జీవుడు దేవుడైన పరమాత్మను తెలియాలంటే ముందుగా తన శరీరములో అంతటా నిండియుండి తనకు తోడుగా, పొరుగువాడుగానున్న ఆత్మను గురించి తెలియాలి. మూడు ఆత్మలలో పెద్దది పరమాత్మే అయినా దానిని తెలియుటకు ముందు ఆత్మను తెలియాలి. ఆత్మను తెలియాలంటే ఆత్మజ్ఞానము అవసరము. ప్రతి మనిషికి ఆత్మజ్ఞానము అవసరమనీ, ఆత్మను తెలియడము ముఖ్యమనీ అర్థమగుటకు విభూదిరేఖలలో ఆత్మకు చిహ్నముగానున్న రెండవ రేఖకు ఎర్రని గుర్తునుంచారు. మధ్యరేఖకు ఎర్రని బొట్టును ఉంచడము వలన దానికి ఏదో విశేషతయున్నట్లు అర్థము కాగలదు. ఆ విశేషత ఏమిటి అని అడిగి తెలుసుకోగలిగితే, రెండవ ఆత్మను ముందు తెలుసుకోమని తెలియగలదు. ఈ విధముగా దృశ్య రూపములో ఆత్మజ్ఞానమును తెలుసుకొన్న తర్వాత పరమాత్మను తెలియునను సందేశమును మన పెద్దలైన పూర్వపు జ్ఞానులు మూడు విభూదిరేఖలలో మధ్యదానికి ఎర్రని గుర్తునుంచి చూపించారు.

విశిష్ఠాద్వైతులు ద్వైతులు ఇరువురు ఒకే నామమును తమ సిద్ధాంత ములకు గుర్తుగాయుంచుకొని ఉన్నారు. రెండు రకముల నామములవారు తిరుపతి తిరుమలలో ఎక్కువగా కనిపించుచుందురు. మంత్రాలయము రాఘవేంద్రస్వామి ద్వైత సిద్ధాంతమునకు చెందిన వాడు కనుక అక్కడి వారు కూడా గుండ్రని నామములు ధరించుచుందురు. వాస్తవానికి నామములు సిద్ధాంతకర్తలకు సంబంధించినవి కావు. నామములు కృత యుగములోనే త్రైత సిద్ధాంతమును తెలుపునిమిత్తము తయారు చేయబడినవి.

కలియుగములో సిద్ధాంతకర్తలు దైవజ్ఞానమునకు సంబంధించిన నామము లను కబ్జాచేసి వాడుకొన్నారు. వాస్తవానికి ముందు యుగములలో అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత సిద్ధాంతములులేని కాలములో కూడా విభూది రేఖలు, నిలువు నామములున్నవి. పూర్వము దైవజ్ఞానము ప్రకారము త్రైత సిద్ధాంతమును బహిర్గతముగా తెలుపుటకు మూడు నామములను జ్ఞానులుంచడము జరిగినది. నిలువు నామములలో జోడుగా కలిసియున్న జీవాత్మ ఆత్మలను రెంటినీ ఒకే తెల్లని రంగు కలిగిన రెండు నామములుగా పెట్టడము జరిగినది. మన హస్తములో మూడు రేఖలలో క్రింది రేఖలు రెండూ ఒక ప్రక్క ఒకదానితో ఒకటి కలిసియున్నవి. అదే విధముగా శరీరములో జీవాత్మ, ఆత్మ రెండూ జోడు ఆత్మలుగా ఉన్నవి. అదే విధానమును తెలుపుటకు మూడు నామములలో రెండు నామములను ఒక ప్రక్క కలిపి వుంచి చూపడము జరిగినది. క్రింది భాగమున రెండు నామములను కలిపియుంచడమేకాక ఆ రెండు నామములను తెల్లని రంగుతో చూపడము జరిగినది. మధ్యలోగల నామమును ఎర్రని రంగుతో చూపడమేకాక తెల్లగనున్న రెండు నామములతో సంబంధములేకుండా కొద్దిగ పై భాగమునకు పెట్టి చూపడము జరిగినది. ఎర్రని రంగుతో చూపడమే కాకుండా ఆత్మ జీవాత్మ అను రెండు నామములకంటే మధ్యలో పరమాత్మకు గుర్తుగానున్న నామమును పొడవుగా ఉండునట్లు పెట్టడము జరిగినది. అలా పెట్టడము వలన జీవాత్మ ఆత్మలను జోడు ఆత్మలకంటే పరమాత్మ పెద్దదని అందరికీ తెలిసిపోవునని అలా పెట్టారు.

ఇక్కడ కొందరికి మరియొక సంశయము రావచ్చును, అదేమనగా! “విభూది అడ్డరేఖలలో మధ్యదానికి ఎర్రని బొట్టు పెట్టి దానినేమో ఆత్మ అన్నారు. ఇప్పుడు నిలువు నామములలో మధ్యలో ఎర్రని నామము నుంచి

దానినేమో పరమాత్మ అని చెప్పుచున్నారు. విభూది రేఖలలో మధ్యరేఖను ఆత్మని, నిలువు నామములలో మధ్యనామమును పరమాత్మ అని చెప్పు చున్నారు. విభూదిరేఖలలో పైది పరమాత్మ అని చెప్పి, నామములో మధ్యది పరమాత్మ అని చెప్పడములో ఆంతర్యమేమిటి? మీరు తెలిసే చెప్పుచున్నారా లేక పొరపాటుగా చెప్పుచున్నారా" అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! విభూదిరేఖలు విడివిడిగా ఉన్నాయి, అంతేకాక ఒకదాని మీద ఒకటున్నాయి. దాదాపు మన హస్తములో ఉన్నట్లు ఉన్నాయి. వాటిలో అన్నిటికంటే పైన ఉన్న రేఖను పరమాత్మగా చెప్పాము. పరమాత్మ రెండు ఆత్మలకంటే పెద్దది, కావున పైన ఉన్న రేఖనే పరమాత్మగా చూపడము జరిగినది. హస్తములో కూడా పై రేఖనే పరమాత్మగా చెప్పవలసి వచ్చినది. ఎందుకనగా! హస్తములో క్రింది రెండు రేఖలు కలిసియున్నవి. అందువలన వాటిని జోడు ఆత్మలని చెప్పుచూ పైన ప్రత్యేకముగానున్న రేఖను పరమాత్మగా చెప్పాము. నిలువు నామము యొక్క విషయములోనికి వస్తే రెండు ప్రక్క నామములు కలిసియుండుట వలన, మధ్యలో నామము రెండు నామములకంటే ప్రత్యేకముగా పొడవుగా ఉండుట వలన, రెండు నామములను ఆత్మ జీవాత్మలుగా, మధ్యనామమును పరమాత్మగా చెప్పాము. ఇక్కడ కూడా కొందరికి మరియొక ప్రశ్న మిగిలివుండవచ్చును. అదేమనగా! "నిలువు నామములలో మధ్యది పరమాత్మయని దానికి ప్రత్యేకముగా ఎర్రని రంగును ఉంచినప్పుడు, అదే అర్థముతో విభూది రేఖలలో కూడా పరమాత్మ గుర్తుగానున్న పై రేఖకు ఎర్రని గుర్తు పెట్టక మధ్యలో దానికి పెట్టి చూపారు. అక్కడేమో ఆత్మకు ఎర్రని గుర్తన్నారు, ఇక్కడేమో పరమాత్మకు ఎర్రని నామమంటున్నారు. విభూది రేఖలలో ఆత్మే ముఖ్యమని మధ్యదానికి ఎర్రని గుర్తుంచారు. నిలువు నామములలో పరమాత్మే జీవాత్మ ఆత్మలకంటే

గొప్పయని మధ్యదానికి ఎర్రని రంగునుంచారు. ఏది సరియైనది, ఏది సత్యము?" అని ప్రశ్నించవచ్చును. దానికి మా సమాధానము ఇలా ఉన్నది చూడండి.

విభూదిరేఖలలో మధ్యరేఖకు చిన్న గుర్తును మాత్రము ఎర్రగ ఉంచాము. అక్కడ ఆ రేఖను పూర్తి ఎర్రగ మార్చలేదు. నిలువు నామము లలో మధ్యరేఖను పూర్తిగా ఎర్రరంగుతో చూపించాము. విభూదిరేఖలు నిరాకార పరమాత్మకు గుర్తుగానున్న ఈశ్వర లింగము మీద చూపడము జరిగినది. తర్వాత నిలువు నామములను దేవుని సాకార రూపమైన ప్రతిమ మీద చూపడము జరిగినది. ఈశ్వర లింగము నిరాకార పరమాత్మకు గుర్తుగాయున్నందువలన మూడవవాడు అయిన పరమాత్మ ఏ మనిషికైనా, జ్ఞానికైనా, యోగికైనా, మహర్షులకైనా జీవించియున్న ఎవనికీ తెలియబడదు. పరమాత్మను జీవితమంతా వెదకినా కనిపించడు. ఆయన ఎప్పటికీ దేవులాడబడేవాడే కావున ఆయనను దేవుడు అన్నారు. నిరాకారము ఎప్పటికీ తెలియదు. కావున మనిషి దేవున్ని నేరుగా తెలియుటకు వీలుపడదు. అందువలన విభూదిరేఖలలో పైనగల మూడవ రేఖను ఏమాత్రము గుర్తించ లేదు. నిరాకారముగా, పేరులేనివాడుగా, పనిలేనివాడుగా దేవున్ని చెప్పు చున్నప్పుడు పరమాత్మ ఉందని రేఖను చూపాముగానీ, రేఖను ఏమాత్రము ఎరుపురంగుతో గుర్తించలేదు. నిరాకార పరమాత్మకు గుర్తుగాయున్న ఈశ్వర లింగము మీద పరమాత్మగా చెప్పబడు పై రేఖను ప్రత్యేకముగా గుర్తించ కూడదు. కావున ఆ మూడవ రేఖకు ఎర్రని గుర్తునుగానీ, మరి ఏ విధముగా గానీ గుర్తించి చూపలేదు. అలా చూపకుండా ఉండడము అర్థముతో కూడుకొన్న పని అగును. ఈశ్వర లింగము మీద పరమాత్మ రేఖగా చెప్పు దానికి ఎరుపు గుర్తు పెట్టడడముగానీ, ఎరుపు రంగును దిద్దడముగానీ

చేయకూడదు, అలా చేస్తే అది తప్పగును. దేవుడు మాకు తెలుసు, మేము చూచామను అర్థమొచ్చును. భూమిమీద ఎవరయినా దేవున్ని తెలిసిన వారుగానీ, దేవున్ని చూచినవారుగానీ లేరు. అందువలన విభూదిరేఖలలో పరమాత్మ గుర్తయిన పై రేఖకు ఎటువంటి గుర్తింపు పెట్టకూడదు. అంతేకాక పూర్తి క్రింది రేఖకు కూడా ఎర్రని బొట్టు పెట్టకూడదు. జీవాత్మకు ఆత్మే ముఖ్యమైన దని తెలుపుటకు మధ్యరేఖకే గుర్తునుంచాలి. అలా కాకుండా క్రింది రేఖకు బొట్టు పెట్టితే ఆత్మకంటే నేనే గొప్ప అనినట్లుంటుంది.

ఇప్పుడు నన్ను ఇరుకున పెట్టే ప్రశ్న అడుగుటకు అందరికీ అవకాశము దొరికినది. ఆ ప్రశ్న నేనే చెప్పుచున్నాను చూడండి. "మీరు పరమాత్మ గుర్తుగానున్న రేఖకు ఎర్రని బొట్టు పెట్టడముగానీ, మొత్తము ఎర్రని రంగు పూయడముగానీ చేస్తే తప్పగుననీ, అర్థరహితమగునని చెప్పారు కదా! అలాంటపుడు నిలువు నామములలో పరమాత్మ గుర్తుగానున్న మధ్య రేఖను పూర్తిగా ఎరుపురంగు పూచి చూపమన్నారు. అందరి ఆచరణలో కూడా మధ్యలోని నామమునే ఎరుపు రంగునుంచారు. పరమాత్మను ఎవరూ గుర్తించి చూపకూడదని అలా గుర్తించి ఎర్రని రంగుతో చూపడము పూర్తి తప్పని పైన చెప్పి, ఇపుడు క్రింద నిలువు నామములలో పరమాత్మ గుర్తుగా నడుమనున్న నామమునకు పూర్తిగా ఎరుపురంగు పూచి చూపమనడము మీది తప్పుకాదా! అక్కడేమో చూపకూడదన్నారు, ఇక్కడేమో చూపమన్నారు. మీ మాట రెండు నాలుకల ధోరణి కాదా" అని గట్టిగా దండించి అడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! పరమాత్మ గుర్తును ప్రత్యేకించి ఏ విధముగానూ చూపకూడదని నిరాకార శివలింగము వద్ద మూడు విభూదిరేఖల విషయములో చెప్పామని ఎవరూ మరువకూడదు. అలా చెప్పడము శాస్త్రబద్ధము హేతుబద్ధము. అందువలన అక్కడ చెప్పిన

దానిలో ఏమాత్రము తప్పులేదు. ఇదే విషయము సాకార ప్రతిమదగ్గర పూర్తి వ్యతిరిక్తముగా ఉండును. సాకార ప్రతిమకు పెట్టు నామములలో మధ్యరేఖ పరమాత్మగుర్తుగా ఉండుట వలన దాని యొక్క ప్రత్యేకత తెలియుటకు పూర్తి ఎరుపు రంగుతో నింపి చూపవలెనని చెప్పాము. ఈ మాట నిరాకార శివలింగ విషయములో పూర్తి తప్పని అలా చూపకూడదని చెప్పడము జరిగినది. అయితే ఒక సాకార ప్రతిమ వద్ద మాత్రము పరమాత్మ నామమును ఎరుపురంగుతో చూపమని ఎందుకు చెప్పుచున్నామనగా!

రూప, నామ, క్రియలు లేని దేవుడు దేనిచేత తెలియబడని దేవుడు, ఎంతటివాడైనా సజీవముగానున్నప్పుడు తెలియని దేవుడు, ఎప్పటికైనా వెదకబడే దేవుడు, ఎవరికీ దొరకబడని దేవుడు ఎట్లుంటాడో ప్రపంచములో ఏ మనిషికీ తెలియదు. అటువంటి వానిని ఏ విధముగానూ గుర్తించుటకు వీలుపడదు. కేవలము ఉన్నాడనుటనకు మాత్రము విభూది రేఖనుంచి రంగు పూయకుండా వదలివేయమన్నాను. ఖురాన్ గ్రంథములో 112 సురాలో నాల్గవ ఆయత్‌లో చెప్పినట్లు దేవునితో ఎవరినీ దేనినీ పోల్చ కూడదు, ఆయనతో ఎవరూ సమానులు కారు అను వాక్యము ఉండుట వలన ముస్లీమ్‌లందరు దేవుని జ్ఞానము ప్రకారము ఆ భావమును గట్టిగా కల్గియుండి వారు దేనినిగానీ, ఎవరినీగానీ దేవునిగా ఒప్పుకోరు. ఇక్కడ వారట్లుండుట పూర్తి జ్ఞానమని చెప్పిన మేమే, మరియొక చోట ముస్లీమ్‌లు దేవుని జ్ఞానమును పూర్తిగా అర్థము చేసుకోలేక దేవుడు వచ్చి ఎదురుగా కనిపించినా తెలియలేరు అని చెప్పాము. మేము ముందు చెప్పిన వాక్యము నకు రెండవమారు చెప్పిన వాక్యమునకు పూర్తి విరుద్ధముగా ఉన్నది. అట్లుండుట వలన అందులో ఏదో ఒక వాక్యము సత్యమగును, మరియొక వాక్యము అసత్యమగునని ఎవరైనా చెప్పగలరు. అయితే మేము మాత్రము

రెండు మాటలు సత్యమే అంటున్నాము. అట్లుంటే మా మాటను ఎవరూ సమర్థించరు. రెండు రకముల మాటలు ఎలా సత్యమగునని ప్రశ్నింతురు. దీనికి జవాబు చెప్పుటకంటే ముందు ఒక విషయమును చెప్పుతాను వినండి. కామెర్ల రోగమున్న ఒక వ్యక్తి డాక్టరు దగ్గరికిపోయి, తన ఆరోగ్యమును గురించి చూపించుకొన్నాడు. అప్పుడు డాక్టరుగారు ఆ వ్యక్తికి కామెర్ల రోగముందని గ్రహించి మందులిచ్చి పంపుతూ నీవు మాంసము తినవద్దు, నీవలెనున్న వాడు ఎవడైనా మాంసము తింటే బ్రతకడు, చావు తప్పదు అని చెప్పాడు. అప్పటినుండి ఆ రోగి మాంసమును మానివేశాడు. డాక్టరు చెప్పిన మాటను బాగా జ్ఞాపకము పెట్టుకొన్నాడు. తర్వాత కొంత కాలమునకు తన కుటుంబములోని మరొక వ్యక్తిని డాక్టరుగారి వద్దకు పిలుచుకొని పోయాడు అప్పుడు ఆ డాక్టరు ఆ రోగికి నీవు మాంసము తిను, మాంసము తినకపోతే చచ్చిపోతావు అని చెప్పాడు. అప్పుడు మొదట డాక్టరు దగ్గరకు పోయిన వ్యక్తికి డాక్టరుగారు తనను మాంసము తినవద్దు తింటే చచ్చిపోతావు అని చెప్పినమాట జ్ఞప్తికి వచ్చినది. ఇప్పుడు మాంసము తిను తినకపోతే చచ్చిపోతావు అని చెప్పడము విచిత్రముగా తోచినది. రోగమునుబట్టి డాక్టరు అప్పటికి ఏది అవసరమో దానినే చెప్పాడు అని అనుకోక, డాక్టరు చెప్పిన మాటలలో నాకు చెప్పినదే సత్యము, రెండవవానికి చెప్పినది అసత్యము అనుకొన్నాడట. అదే విధముగా భగవద్గీతలో జ్ఞానయోగము నందు ఆరవ శ్లోకమున మొదటనే 'అజోపి' అను పదమును చెప్పారు. దానికి నేను పుట్టువాడను కాను అని అర్థము. అయితే దానికంటే ముందు ఐదవ శ్లోకమున నాకు ఎన్నో జన్మలు కలిగాయి అని చెప్పియున్నారు. ఈ రెండు మాటలు దైవవాక్యములే దేవుడు ముందు శ్లోకములో నేను ఎన్నోమార్లు భూమిమీద పుట్టాను, జ్ఞానమును బోధించాను అని చెప్పాడు.

ఆరవ శ్లోకములో నేను పుట్టువాడనుకాను, చచ్చువాడనుకాను అన్నాడు. తర్వాత తొమ్మిదవ శ్లోకమున నేను పుట్టి భూమిమీద ఉన్నప్పుడు నా జన్మను గుర్తుపట్టినవాడు చనిపోయిన తర్వాత తిరిగి పుట్టకుండ నాలోనికి ఐక్యమైపోవునని చెప్పాడు. ఇక్కడ కూడా దేవుడే స్వయముగా ఒకచోట పుట్టువాడను కాను అని చెప్పుచూ, రెండవ చోట నేను ఎన్నోసార్లు పుట్టాను అని చెప్పినట్లు తెలియుచున్నది. ఇందులో ఒకటి సత్యము మరొకటి అసత్యము అనుకొంటే దేవున్నే శంకించినట్లగును. దేవుడు ఎప్పుడూ అసత్యము చెప్పడు. డాక్టరు చెప్పిన రెండు వాక్యములు సత్యమే అయినట్లు దేవుడు చెప్పిన రెండు వాక్యములు సత్యమే. డాక్టరు రోగమును బట్టి ఆహారమును చెప్పాడని అర్థము చేసుకోక, డాక్టరు రెండు రకములుగా మాట్లాడినాడు అనీ, అందులో ఒకటి సత్యము మరొకటి అసత్యము అని అనుకొంటే మనదే పొరపాటగును.

ఇస్లామ్ ధర్మమును బోధించు పవిత్ర ఖురాన్‌గ్రంథములో 'అల్‌ఫజ్ర్' అను 89వ సురాలో 22వ వాక్యములో దేవుడు అవతరిస్తాడు అని వ్రాయ బడివున్నది. అదే ఖురాన్ గ్రంథములో అల్‌ఇఖ్లాస్ అను 112వ సురాలో మూడవ ఆయత్‌లో దేవుడు పుట్టువాడు కాడు అని ఉన్నది. ఒకచోట అవతరిస్తాడు అని ఉండగా, ఒకచోట అవతరించడు అని ఉన్నది. ఇక్కడ కూడా అర్థము చేసుకోవడములో పొరపాటుపడితే, ఇందులో ఒకటి నిజము మరొకటి అబద్ధముగా కనిపించును. ముస్లీమ్‌లు దేవుడు అవతరించడు అను మాటను నమ్మారు. అవతరిస్తానను మాటను వేరుగా చెప్పుకొనుచూ దేవుడు పుట్టడను భావమునే కల్గియున్నారు. క్రైస్తవులు దేవుని కుమారుడు భూమిమీదికి పంపబడుతాడు, దేవుడురాడు అని నమ్మియున్నారు. ఇప్పుడు మేము చెప్పు విభూతిరేఖల విషయములో మరియు మూడు నామముల

విషయములో మా మాట పరస్పర విరుద్ధముగా కనిపించుచున్నా ఒకటి సత్యమూ, మరొకటి అసత్యమూ అనుకోవడము పొరపాటగును. అందువలన మేము చెప్పు రెండు మాటలు సత్యమే అగునని చెప్పుటకు ముందు మేము కొంత వివరమును చెప్పవలసియున్నది.

దేవుడు ఫలానా అని చెప్పుటకు ఎక్కడా వీలులేదు. దేవుని ధర్మములు, దేవుని విధానము, దేవుని జ్ఞానము ఏమిటో దేవునికి తప్ప ఇతరులకెవరికీ తెలియదు. అటువంటపుడు మనిషి ఎంత గొప్ప మేధావి అయినా, ఎంతో పెద్ద హెూదాలో ఉన్నా, ఎంతో పెద్ద మహర్షి అని అనిపించుకొనినా దేవుని విషయము మాత్రము తెలియదు. దేవుని విషయము దేవుడే స్వయముగా చెప్పితేనే తెలియబడుతుంది. అందువలన తన విషయము భూమిమీద మనుషులకు తెలియుటకు, ఎప్పుడో ఒకప్పుడు దేవుడు దేవుడుగా కాకుండా భగము (తల్లిగర్భము) నుండి పుట్టిన భగవంతుడైన మనిషిగా భూమిమీద పుట్టి, అందరివలె కొంత కాలముండి సందర్భమునుబట్టి తన జ్ఞానమును బోధించి పోవును. అంతవరకు దేవుడెవరో తెలియని మనిషికి దేవుని జ్ఞానము తెలియబడును, అంతవరకు పుట్టని దేవుడు భగవంతుడుగా భూమిమీద పుట్టి తన జ్ఞానమును మనుషులకు చెప్పినపుడు, దేవుడు పుట్టినట్లే కదా! దేవునికి తప్ప ఎవరికీ తెలియని జ్ఞానమును దేవుడు చెప్పినట్లే కదా! దేవుడు భూమిమీదకు వచ్చినపుడు అందరికీ సర్వసాధారణముగా కనిపించుచున్నాడు. అందరూ ఆయనను చూస్తున్నారు. అయితే ఇతను దేవుడనీ, భగవంతునిగా మనిషి ఆకారములో కనిపిస్తున్నాడనీ ఎవ్వరూ తెలియలేరు. ఇతరులు భగవంతునిగా వచ్చిన దేవున్ని గుర్తించినా, గుర్తించకపోయినా వచ్చినవాడు మాత్రము దేవుడే, ఆయన్ను అందరూ చూడగలుగుచున్నారు.

దేవుడు నిరాకారుడుగా ఉన్నప్పుడు అనగా దేవుడు భూమిమీద పుట్టకుండా దేవుడు దేవునిగానే ఉన్నప్పుడు ఎవరికీ తెలియువాడు కాడు. కావున నిరాకార ఈశ్వర లింగము మీద ఉన్న విభూదిరేఖలలో దేనినీ దేవునిగా రంగుపూసి గుర్తించకూడదు. నిరాకారమును తెలియజేయు లింగము మీద రేఖలలో పై రేఖ పరమాత్మ అని ఆయన ఉనికిని తెలుపుటకు చెప్పవచ్చునుగానీ, ఎరుపు రంగుపూసి గుర్తించి చూపకూడదని చెప్పాము. అదే సాకార రూపము యొక్క విషయములోనికి వస్తే, దేవుడు సాకారముగా భగవంతుని రూపములో కనిపిస్తున్నాడు, కావున సాకారమునకు ధరించిన నామములలో పరమాత్మ గుర్తుగాయున్న నామమునకు ఎరుపురంగుపూసి చూపడము జరుగుచున్నది. సాకారములో దేవుడు కనిపిస్తున్నాడు, కావున రంగుపూసి చూపడములో తప్పులేదు. అలా చూపడము వలన నిరాకార మైన దేవుడు సాకారమున కనిపిస్తాడని అందరికి తెలియునట్లు చెప్పవచ్చును. నిరాకారమున దేవుని గుర్తును రంగుతో గుర్తించడము తప్పగును. అదే సాకారమున మూడు నామములలో దేవుని గుర్తయిన మధ్య నామమును రంగుతో చూపకపోతే తప్పగును. నిరాకారములో దేవుడు తెలియనివాడు కనుక రంగుతో గుర్తించి చూపకూడదు. సాకారమున దేవుడు తెలియువాడు కనుక రంగుతో గుర్తించి చూపవలెను. నిరాకారమున ఎవరికీ తెలియని దేవుడు సాకారమున అందరికీ తెలియుచున్నాడు. అందువలన నిరాకారమున ఒకమాట, సాకారమున మరొక మాట చెప్పవలసివచ్చినది. నిరాకారమున నాకు పుట్టుకేలేదు అన్నవాడు, సాకారమున నేను పుట్టి ధర్మములను బోధిస్తున్నాను అని చెప్పడము జరిగినది.

రోగమును బట్టి ఒకప్పుడు మాంసాహారమును తినవద్దని చెప్పిన వైద్యుడే, తర్వాత కాలములో తినమని చెప్పుచున్నాడు. ఒకే వైద్యుడు

రెండు రకముల పత్యమును చెప్పినా అవి పరస్పర విరుద్ధములుకానట్లు, ఒకే దేవుడు రెండు స్థితులలో, రెండు రకములుగా చెప్పిన మాటలు పరస్పర విరుద్ధములు కావు. అందువలన దేవుని జ్ఞానమును సంపూర్ణముగా తెలిసిన తర్వాతే దేవుడు ఎటువంటివాడో, దేవునిలోని సత్యాసత్యములు ఏమిటో తెలియును. అట్లుకాకుండా కొద్దిపాటి జ్ఞానమును తెలిసి మాట్లాడితే ఒకచోట సత్యమైనది మరొక చోట అసత్యమగును. అట్లే ఒక సందర్భములో అసత్యమైనది మరొక సందర్భములో సత్యమగును. చాలామందికి సంపూర్ణ జ్ఞానము తెలియని దానివలన, దేవుని నిరాకార సాకార విధానములను రెండిటిని తెలియలేక, హిందువులేమో ఎక్కువగా సాకారమును పట్టుకొని నిరాకారమును వదలివేశారు. ముస్లీమ్‌లేమో నిరాకారమును పట్టుకొని సాకారమును వదలివేశారు. దేవుడూ ఒక్కడే, దేవుని జ్ఞానమూ ఒక్కటే అయినా దేవునియందునూ, జ్ఞానమునందునూ హిందువులకు, ముస్లీమ్‌లకు వేరువేరు అభిప్రాయములు గలవు. ఈ విధముగా అర్థము చేసుకొన్న వానికి అర్థము చేసుకొన్నంత దేవుని జ్ఞానము అర్థమగుచున్నది. సంపూర్ణ జ్ఞానము లేకపోతే దేవుని నిరాకార సాకార ధర్మములు అర్థము కావు.

నేడు హిందూమతముగా పిలువబడేది పూర్వము ఇందూ ధర్మముగా చెప్పబడుచుండెడిది. ఐదు వేల సంవత్సరముల పూర్వము ఇతర మతములు లేవు. ఆ రోజున్నది ఒక్క ఇందూ ధర్మమొక్కటే. తర్వాత మతములు ఏర్పడేకొద్దీ ఇందూ ధర్మము కాస్త మారిపోయి చివరకు హిందూ మతముగా చెప్పబడుచున్నది. అలా చెప్పబడు హిందూమతములో అద్వైత, ద్వైత, విశిష్ఠాద్వైత సిద్ధాంతకర్తలు రావడము జరిగినది. వారు పూర్వము కృత్‌యుగములోనే ఉన్న విభూదిరేఖలనూ, మూడు నిలువు నామములనూ కొంత మార్పులు చేర్పులతో తమ సిద్ధాంతములకు జెండాగుర్తులుగా

పెట్టుకోవడము జరిగినది. విశిష్టాద్వైత, ద్వైత సిద్ధాంతములవద్ద నామము కొంత మారిపోగా తర్వాత కాలములో కూడ మార్పుచెందుచూ వస్తున్నదని చెప్పవచ్చును. ఒక్క విభూదిరేఖలు మారుటకు వీలులేకుండ మూడు అడ్డ రేఖలుగానే ఉన్నప్పటికీ మధ్యలోనున్న రేఖమీద బొట్టుమాత్రము స్థానము మారిపోయి కొన్నిచోట్ల క్రింది రేఖమీద కనిపిస్తున్నది. కాలము జరుగు కొలది ఆధ్యాత్మికము అను పేరుతో క్రొత్త విధానములు పుట్టుక రావడమూ, వారు తమకొక గుర్తును తయారు చేసుకోవడము జరుగుచున్నది. ఇప్పటికీ చాలా పేర్లుగల ఆధ్యాత్మిక సంస్థలు ఎక్కువగా నామమునే తమ ఇష్టమొచ్చి నట్లు మార్చి పెట్టుకొనుచు అది వారి సంస్థ గుర్తుగా చెప్పుకొనుచున్నారు. ఉదాహరణకు ఇస్కాన్ సంస్థవారు శ్రీకృష్ణభక్తి తత్త్వమును బోధించుచున్నారు. ఆ సంస్థవారు మూడు నిలువునామములలో కొంత మార్పుచేసి పెట్టుకొను చున్నారు. వారు ధరించు నామములో ఎరుపురంగు గుర్తుగల మధ్య నామముండదు. వారు ధరించు నామము లేత పసుపురంగు కలిగి రెండు వైపుల ఆత్మ జీవాత్మలనబడు నామములు మాత్రమే ఉండును. అంతేకాక వారి నామము క్రింద ముక్కుమీద ఒక బొట్టువలె వెడల్పుగా పెట్టబడి తర్వాత పైన రెండు నామములు మాత్రమే ఉండును. ఈ విధముగా చాలా ఆధ్యాత్మిక సంస్థలవారు మేము వేరు, మా దారివేరు, మా జ్ఞానము వేరు అన్నట్లు వారికొక ప్రత్యేకమైన గుర్తింపు నామమును పెట్టుకోవడము జరిగినది. కొందరు మూడు నామములలో ప్రక్క నామములను వదలి మధ్య నామమును మాత్రము పెట్టుకోగా, కొందరు మధ్యనామమును వదలి ప్రక్క నామములను పెట్టుకోగా, మరికొందరు ప్రక్క నామములను మాత్రము పెట్టుకొనుచూ అందులో కుడి ప్రక్కదానిని పొడవుగా ఎడమ ప్రక్క దానిని పొట్టిగా పెట్టుకోగా, మరియొక ఆధ్యాత్మిక పీఠమువారు నామములో ప్రక్క

నామములను రెండిటిని పెట్టి మధ్యలో నామము లేకుండా కేవలము బొట్టును మాత్రము పెట్టుచున్నారు. కొందరు నామము లేకుండా వెడల్పు బొట్టును వారి గుర్తుగా పెట్టుకోవడము జరుగుచున్నది. కొందరు మూడు విభూది రేఖలను పెట్టుకోకుండా కేవలము ఒక్క రేఖను పసుపురంగుతో పెట్టు కోవడము జరుగుచున్నది. కొందరైతే చంద్రవంకనూ, మరికొందరు సూర్యబింబమును తమ గుర్తులుగా నుదుటి భాగములో పెట్టుకోవడము జరుగుచున్నది.

ఈ విధముగా పూర్వ కాలములో లేని ఆధ్యాత్మిక విద్యలు అనేక పీఠములు, మఠములు అను పేరుతో తయారైనవి. రాజకీయములో వేరు వేరు విధానములతో రాజకీయపార్టీలు తయారైనట్లు, ఆధ్యాత్మికములో వేరువేరు సిద్ధాంతములతో అద్వైత, విశిష్ఠాద్వైత, ద్వైత పీఠములు తయారైన వని చెప్పుకొన్నాము. వారు విభూదిరేఖలను, నామములను తమతమ గుర్తులుగా పెట్టుకోవడము జరుగుచున్నది. అద్వైత, విశిష్ఠాద్వైత, ద్వైత పీఠములలో ఆదిశంకరాచార్యులవారు అద్వైత పీఠమునూ, రామానుజా చార్యులవారు విశిష్ఠాద్వైత పీఠమునూ, మధ్వాచార్యులువారు ద్వైత పీఠమునూ తయారు చేశారు. మాకు ఇంటర్‌నెట్‌లో దొరికిన సమాచారము ప్రకారము శంకరాచార్యులవారు 788వ సంవత్సరము కేరళ రాష్ట్రములో పుట్టాడనీ, అతను కేవలము 32 సంవత్సరములు మాత్రము జీవించి చనిపోయాడని తెలియుచున్నది. ఆయన జీవితముతో అద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించి దానినే ప్రచారము చేయగా, ఆయనకు ఎందరో శిష్యులు ఏర్పడి అద్వైత సిద్ధాంతమును తెలుసుకోగలిగారు. ఆయన చనిపోయిన తర్వాత అద్వైత సిద్ధాంతమును బాగా తెలిసిన ఆయన శిష్యులలో ఒకడు ఆ సిద్ధాంతమును ప్రచారము చేయుటకు శంకరాచార్యునిగానే నియమింపబడుచున్నాడు.

ఆయన కూడా చనిపోయిన తర్వాత మరియొక వ్యక్తిని శంకరా చార్య స్థానములో గురువుగా ఉంచడము జరుగుచున్నది. ఈ విధముగా ఆది శంకరాచార్యులవారు పోయినా వారి స్థానములో శంకరాచార్యుల వారి పేరు మీద మిగతావారు నియమింపబడడమూ, అదే అద్వైత సిద్ధాంతమును ప్రచారము చేయడమూ జరుగుచున్నది. ఇట్లు ఆ సిద్ధాంతము పరంపరగా ఒకరి తర్వాత ఒకరి ద్వారా నేటికినీ ఉన్నది.

ఒక సిద్ధాంతమును ఒకరు కనుగొని దానిని అమలుపరచి ప్రచారము చేయగా, తర్వాత అతని స్థానములో అదే విధామును మరియొకరు సాగించుచుందురు. ఈ విధముగా వచ్చు పరంపరను 'పీఠము' అంటాము. ఉదాహరణకు ఆదిశంకరాచార్యులవారు అద్వైత సిద్ధాంతమును ఆధ్యాత్మిక విద్యలో తెలుపగా, ఆ అద్వైత సిద్ధాంతమును తర్వాత ప్రచారము చేయు బాధ్యతను స్వీకరించిన వారు ఒకరి తర్వాత మరొకరు వస్తూ నేడు 71వ శంకరాచార్యులుగా చెప్పబడు ఆచార్యులు ఉన్నట్లు తెలియుచున్నది. మొదట అద్వైతము అను సిద్ధాంతము పేరుతో ఒక పీఠము తయారుకాగా దానిమీద ఒకరి తర్వాత ఒకరు కూర్చొనుచూ అద్వైత సిద్ధాంత పరిపాలన చేయుచున్నారు. మొదట తయారైన సిద్ధాంతము ఒక సింహాసనము లాంటిది. ఆ సింహాసనమునకు ఒకే రాజు ఉండడు. ఒక రాజు ఉన్నట్లే మరియొక యువరాజు తయారుకావడమూ, రాజు గతించిన తర్వాత యువరాజు రాజుగా సింహాసనమును అధిష్ఠించడము జరుగుచుండును. ఒక గురువు లేక ఆచార్యుల వారు ఒక సిద్ధాంతము అను పీఠమును తయారు చేయగా, ఆయన తర్వాత ఆ పీఠమును మరియొక ఆచార్యులవారు అధిష్ఠించుచుందురు. ఒక ఆచార్యులు ఉన్నట్లే మరియొక యువ ఆచార్యులు తయారు కావడమూ తర్వాత సిద్ధాంత పీఠమును అధిష్ఠించి ఆ సిద్ధాంతము

నకు ప్రతినిధిగా ఉండడమూ ఆధ్యాత్మిక విద్యలో జరుగుచున్నది. రాజరికములో పూర్వము ఒక సింహాసనమునకు ఒక రాజు, యువ రాజులున్నట్లు, ఆధ్యాత్మిక విద్యలో ఆచార్యుల సిద్ధాంత పీఠము, దానికి కొత్త యువ ఆచార్యులు తయారు కావడము జరుగుచున్నది. ఇదే విధానము అద్వైత పీఠములో నేటికినీ కొనసాగుతున్నది. ఆదిశంకరాచార్యుల వారు అద్వైత సిద్ధాంతముతో అద్వైత పీఠమును తయారుచేయగా ఎందరో ఆచార్యులు వారు దానిని అధిష్ఠించుచూ వచ్చారు. చంద్రశేఖరేంద్ర సరస్వతి వారు 68వ పీఠాధిపతిగా ఉండగానే, జయేంద్ర సరస్వతివారు యువ ఆచార్యులుగా తయారు కావడమూ, చంద్రశేఖరేంద్ర సరస్వతి ఆ పీఠమునుండి దిగిన తర్వాత జయేంద్రసరస్వతిని 69వ పీఠాధిపతిగా చేయడమూ జరిగినది. ఇప్పుడు ప్రస్తుత పీఠాధిపతిగా జయేంద్రసరస్వతి వారుండగా, వారి తర్వాత అద్వైత సిద్ధాంత పీఠమును సాగించుటకు శంకర విజయేంద్ర సరస్వతి 70వ పీఠాధిపతిగా ముందుగానే తర్ఫీదు కావడము జరుగుచున్నది. ఈ విధముగా వచ్చు పరంపరను పీఠము పీఠాధిపతులు అని చెప్పవచ్చును.

అద్వైత పీఠము తర్వాత రామానుజాచార్యులవారు విశిష్ఠాద్వైత పీఠమును స్థాపించారు. ఆయన 1017వ సంవత్సరము జన్మించి సంపూర్ణముగా 120 సంవత్సరములు బ్రతకగలిగాడు. ఆయన జీవితములో విశిష్ఠాద్వైతము అను ఒక ప్రత్యేక సిద్ధాంతమును ప్రతిపాదించి, తన విశిష్ఠాద్వైత పీఠమును స్థాపించాడు. తర్వాత విశిష్ఠాద్వైత పీఠమును ఎందరో స్వాములు అధిష్ఠించి పరంపర సాగించారు. పెద్ద జియ్యర్ స్వామి 31-12-1979వ సంవత్సరము చిన్న జియ్యర్ స్వామికి పీఠమును అప్పగించాడు. ఈ విధముగా ఒక సిద్ధాంతము ఆధ్యాత్మిక సామ్రాజ్యములో

స్థాపించబడిన తర్వాత ఆది పీఠముగా రూపాంతము చెంది పరంపరగా వచ్చును. ఆధ్యాత్మిక విద్యలో ఒక పీఠము ఉంది అంటే దానివెనుక ఒక సిద్ధాంతము ఉంటుంది. పూర్వము ఇదే విధానముతో అద్వైత, విశిష్ఠాద్వైత, ద్వైత పీఠములు తయారైనవి. అయితే ఈ మధ్య కాలములో సిద్ధాంతము లేని పీఠములు కూడా తయారైనవి. ఒక రాజ్యము ఉన్నప్పుడు దానికి ఒక రాజు, రాజుకొక సింహాసనము ఉంది అని చెప్పితే సరిపోతుంది, దానికొక అర్థముంటుంది. కానీ రాజ్యము ఏమాత్రము లేకుండా నేనొక రాజును, నాకొక సింహాసనము ఉంది అంటే, అది అతని గొప్పతనము కొరకు చెప్పుకొనునదేగానీ వేరుకాదని తెలియుచున్నది. గత వంద సంవత్సరములలోనే చాలా పీఠములు తయారైనవి. ద్వాపరయుగము చివరిలో దేవుడు భగవంతునిగా వచ్చి తన జ్ఞానమును చెప్పిపోగా, దేవుడు స్వయముగా చెప్పిన జ్ఞానమును ఎవరూ నేటివరకు గ్రహించలేకపోయారు. ద్వాపర యుగము చివరిలో భగవద్గీత చెప్పబడితే, కలియుగము వచ్చిన మూడువేల సంవత్సరములకే మతములు తయారై, మతమేలేని భారత దేశములో కూడా మతముల గాలి సోకినప్పుడు హిందూమతమును ఉద్ధరించుటకు అద్వైత, విశిష్ఠాద్వైత, ద్వైత సిద్ధాంతములు తయారైనవి. అయినా భారతదేశములో ఇస్లామ్, క్రైస్తవమతములు బాగా ప్రాకిపోయాయి. క్రైస్తవమతము చాలా వేగముగా విస్తరించింది.

ఇందూమతమును రక్షించుటకే అద్వైత, విశిష్ఠాద్వైత, ద్వైత సిద్ధాంతములను ఆయా సిద్ధాంతకర్తలు ప్రచారము చేశారని కొందరు హిందువులు చెప్పుచున్నప్పటికీ, ఆ సిద్ధాంతముల వలన ఏమి మేలు జరిగిందో తెలియదుగానీ, ఇతర మతములు బాగా అభివృద్ధి కావడమూ, హిందూమతము క్షీణించడము మాత్రము జరిగినది. దీనికి కారణము దేవుడు

చెప్పిన భగవద్గీత ప్రజలలో ప్రచారము కాకపోవడమేనని నేను అనుకొంటున్నాను. భగవద్గీతా జ్ఞానమును ప్రక్కన పెట్టి తమ తమ స్వంత జ్ఞానములను చెప్పడము వలన, హిందూమతములోని వారు ఇతర మతముల వైపు ప్రాకిపోయారని తెలియుచున్నది. హిందూమతము కాపాడుటకని సాకుచూపి కొంతమంది స్వామీజీల పేరుతో వేరువేరు పీఠములను స్థాపించి, వేరువేరు బోధలను సాగించుచున్నారు. వారు స్థాపించిన పీఠము వెనుక ఏ సిద్ధాంతమూ ఉండదు. అయినా తనదొక ప్రత్యేకపీఠమని చెప్పుకొనుచూ తనకొక ప్రత్యేక నామమును పెట్టుకొను వారు తయారైనారు. అటువంటి వారికి ఒక సిద్ధాంతమంటూ లేకపోవడము వలన, మతమును అసరాగా చేసుకొని స్వమతములో అభిమానము, పేరు ప్రఖ్యాతులను సంపాదించు కోవడానికి తన మతమును పొగుడుచూ, ఇతర మతములను ద్వేషించు చుందురు. దానివలన ప్రజలలో చిచ్చుపెట్టడము తప్ప జ్ఞానమును తెలిపినట్లు కాదు. అద్వైత, విశిష్ఠాద్వైత, ద్వైత సిద్ధాంతములు తమవంతు జ్ఞానమును తెలుపుచుండగా, వారిని కాదని ఏ సిద్ధాంతమూ ఆధారములేకుండా పీఠములను ఎందుకు తయారు చేసుకొన్నట్లు? శంకరాచార్యులవారు, రామానుజాచార్యులవారూ, మధ్వాచార్యులవారూ ఆధ్మాత్మిక సంబంధమైన పేర్లుగల సిద్ధాంతములను ప్రతిపాదించారు. వారి సిద్ధాంతములు ఆత్మల సంఖ్యమీద, ఆధ్యాత్మికము మీద ఆధారపడియున్నవి. వారిని వారి సిద్ధాంతములను కాదనీ, వారికంటే మించిన జ్ఞానము మావద్దయున్నదన్నట్లు కొందరు దేవీపీఠమనీ, దేవతపీఠమని దేవతల పేర్లతోనూ, ఓం పీఠమనీ, ఓంకార పీఠమనీ, శ్రీం పీఠమని, శ్రీంకార పీఠమనీ అక్షరముల పేర్లతోనూ, బ్రహ్మపీఠము, గురు పీఠము, జ్ఞాన పీఠమను జ్ఞానుల పేర్లతోనూ మొదలగు అనేక పీఠములను తయారు చేశారు. ఆ విధముగా క్రొత్తక్రొత్త పీఠముల

వలన హిందూమతము చీలిపోవడమూ, క్షీణించి పోవడమూ జరుగుచున్నది. 'దశకోటి దరిద్రాలకు శతకోటి శకునాలన్నట్లు' ప్రస్తుత కాలములో క్షీణదశలోనున్న హిందూమతమునకు రాజకీయము తోడయినది. పూర్తి వైద్యము తెలియని వైద్యుడు పాముకాటుకు ఏమి ఇవ్వాలని వైద్యగ్రంథమును చూచాడు. అందులో మత్తును వదలించు మందు ఇవ్వమని వ్రాసివుండగా, దానిని చూచిన వాడు మత్తును కలిగించు మందును ఇచ్చాడట. ఇప్ప కషాయము ఇమ్మని వ్రాసివుంటే కషాయమంటే అర్థము తెలియక ఇప్ప సారా ఇచ్చాడంట. దానితో పాముకాటు పొందిన వాడు మరీ తొందరగా చచ్చాడట. అదే విధముగా నేటి కొత్త పీఠములవారు హిందుత్వమును కాపాడుతామని చెప్పుకొంటూ, తమ మతతత్త్వబోధలతో హిందుత్వమును తొందరగా క్షీణింపజేయుచున్నారు.

దేవుడు తనవైపు ప్రజలు రావాలని భారతదేశములోనూ, ఇజ్రయేల్ దేశములోనూ భగవంతుని రూపముతో వచ్చి తన జ్ఞానమును బోధించగా, అరబ్‌దేశములో తన దూత ద్వారా తన జ్ఞానమును చెప్పించాడు. భారత దేశములో భగవద్గీతగా, ఇజ్రయేల్ దేశములో బైబిలుగా, అరబ్‌దేశములో ఖురాన్ రూపముగా దేవుని జ్ఞానము తెలుపబడియున్నా, ఆ గ్రంథములలోని వివరమును పూర్తిగా తెలియని మనుషులు మతములుగా చీలిపోయారు. దేవున్ని కూడా నీ దేవుడు, నా దేవుడని చీల్చుకొన్నారు. దేవుడు చెప్పిన జ్ఞానమును అర్థము చేసుకోలేకపోవడమేకాక, తామే గొప్ప జ్ఞానులమని భ్రమించియున్నారు. మనుషులు ఎటువంటి పరిస్థితులలో ఉన్నారో వారిని పాలించు భూతములకు, గ్రహములకు తెలుసు. నేను గొప్ప జ్ఞానిని అని అనుకొను వ్యక్తులను గ్రహములు గమనిస్తూ వారిలో జ్ఞానముంటే జ్ఞానిగా, జ్ఞానములేకపోతే అజ్ఞానిగా లెక్కించుకొనుచున్నారు. చాలామందికి తమను

భూతములు, ఉపభూతములు, గ్రహములు, ఉపగ్రహములు ఎల్లప్పుడు గమనించుచున్నవని తెలియదు. సూర్యుడు భూమిమీద మొట్టమొదటి జ్ఞానమును చెప్పినప్పుడే కొన్ని లక్షల భూతములు గ్రహములు జ్ఞానమును వినడము జరిగినది. తర్వాత వారి ద్వారా మరికొన్ని గ్రహములు భూతములు జ్ఞానమును తెలుసుకోవడము జరిగినది. ఈ విధముగా ఖగోళములో సూక్ష్మముగ, స్థూలముగానున్న కోట్లాది గ్రహములు భూతములు దేవుని జ్ఞానమును సంపూర్ణముగా తెలిసియున్నవి. వారి దృష్టిలో ఏ మనిషికి ఎంత జ్ఞానమున్నది వారికి తెలుసు. భూతములు గ్రహములలో కొందరు దేవుని జ్ఞానమును ప్రజలకు తెలియజెప్పడము జరిగినది. అలా వారు చెప్పగా తెలుసుకొన్న ప్రజలు గొప్ప జ్ఞానులుగా తయారైనారు. ప్రజలు నిజమైన జ్ఞానులను గుర్తించలేకపోయినా, గ్రహములు భూతముల దృష్టిలో కొందరు పెద్ద జ్ఞానులుగా గుర్తింపబడినారనుమాటను మరువకూడదు.

భూమిమీద అధర్మములు చెలరేగి ధర్మములు తెలియకుండా పోయినప్పుడు, దేవుడు భగవంతునిగా అవతరించి తన జ్ఞానమును చెప్పి పోవునని చెప్పుకొన్నాము కదా! ఆ విధముగా దేవుడు వచ్చి చెప్పిన జ్ఞానము భూమిమీద అన్ని ప్రాంతములకు తొందరగా చేరకపోతే, ఏదో ఒక విధముగా దేవుడు చెప్పిన జ్ఞానమును కొన్ని ప్రాంతములలోని ప్రజలకు కొన్ని గ్రహములుగానీ, భూతములుగానీ తెలియచేయుచున్నవి. దైవ జ్ఞానమును శ్రద్ధ కలిగిన వారివద్దకు గ్రహములు, భూతములు ఎలా చేరవేయుచున్నది ఎవరికీ తెలియదు. నాకు కూడా తెలియదు. అయితే అదృశ్యరూపములోనున్న ఖగోళములోని ఒక గ్రహము భూమిమీదికి వచ్చి భారతదేశములో కృష్ణుడు చెప్పిన బోధగానీ, ఇజ్రయేల్ దేశములో ఏసు చెప్పిన బోధగానీ తెలియని స్థితిలోనున్న వారికి తెలియజెప్పాలనుకొన్నది.

అప్పటికి భగవద్గీత చెప్పి 3600 సంవత్సరములుకాగా, ఏసు జ్ఞానమును చెప్పి 600 సంవత్సరములుకాగా, దేవుని జ్ఞానము యొక్క విషయము తెలియని అరబ్‌దేశములో, దేవుని జ్ఞానము మీద శ్రద్ధగల వ్యక్తిని ఎన్నుకొని దేవుని జ్ఞానము తెలియచేయాలనుకొన్నది. అటువంటి సమయములో జిబ్రయేల్ అను గ్రహము దేవదూతగా వచ్చి దేవుని జ్ఞానము మీద శ్రద్ధగల ముహమ్మద్‌ను ఎన్నుకోవడమూ, ఆయనకు జ్ఞానము చెప్పి ముహమ్మద్‌ను ప్రవక్తను చేయడము జరిగినది. ఈ విధముగా ఖగోళములోని జిబ్రయేల్ దూత దేవుడు చెప్పగా వినిన జ్ఞానమును ముహమ్మద్ (సం) ప్రవక్తకు తెలియజేసి ఆయన ద్వారా ఆ ప్రాంత ప్రజలకు తెలియునట్లు చేసినది. భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తియోగమను అధ్యాయములో 16,17వ శ్లోకములలో చెప్పిన త్రైత సిద్ధాంతమును జిబ్రయేల్ దూత ఖురాన్‌లో 50వ సురాలో వ్రాయబడిన 21వ ఆయత్‌లో చెప్పియున్నాడు. సూర్యుని ద్వారా మొట్టమొదట భూమిమీద చెప్పబడిన జ్ఞానమునే జిబ్రయేల్ దూత ముహమ్మద్ (సం) ప్రవక్తకు చెప్పడము జరిగినది. కావున గీతలో చెప్పిన జ్ఞానమే ముందు వెనుకగా ఖురాన్ గ్రంథములో కనిపిస్తున్నది. గీతలో చెప్పిన త్రైతసిద్ధాంతము నేటి హిందువులకు అర్థము కాలేదు. అలాగే ఖురాన్‌లో చెప్పిన త్రైతసిద్ధాంతము ముస్లీమ్‌లకు అర్థముకాలేదు. దేవుడు చెప్పిన త్రైతము తెలియని దానివలన హిందువులు నిరాకారమును వదలి ఎక్కువగా సాకారమును పట్టుకొని పూజిస్తున్నారు. అలాగే ముస్లీమ్‌లకు కూడా వారి గ్రంథములోని త్రైతము తెలియని దానివలన నిరాకారమును పట్టుకొని సాకారమును లేనే లేదంటున్నారు. ఇరువురకు దేవుడు మొదట నిరాకారుడు తర్వాత సాకారుడు అని తెలియలేకపోయారు. ఇదే విషయములో క్రైస్తవులు కూడా పొరపడియున్నారు. అందువలన

అవసరమొచ్చినప్పుడు, అధర్మములు చెలరేగినప్పుడు, దేవుడు సాకార రూపమున భగవంతునిగా వస్తే, ఈ మతముల వారందరు ఆయన చెప్పు జ్ఞానమును గ్రహించలేక సాటి మనిషిగానున్న వాడు ఇతను మా దేవునికంటే గొప్పవాడా? అని హేళనగా మాట్లాడుదురు. సాకార రూపమున వచ్చిన వాడు తమ గ్రంథములలోని జ్ఞానముకంటే గొప్పగా వివరించి చెప్పినా అతనిని ఏమాత్రము గొప్పగా విశ్వసించరు. ఇది ఒక మతమునకు సంబంధించిన విషయముకాదు. అన్ని మతములకు సంబంధించిన విషయముగా తెలియవలెను. అలా మనిషిగా వచ్చిన దేవున్ని అవమాన పరిచిన మానవులున్నారు. కాబట్టి దేవుడు భగవద్గీతలో రాజవిద్యా రాజగుహ్య యోగమను అధ్యాయములో 11వ శ్లోకమున ఇలా అన్నాడు.

*శ్లో॥ అవజానన్తి మాం మూఢా మనుషీమ్ తను మాశ్రితమ్,*
*పరం భావ మజానన్తో మమ భూత మహేశ్వరమ్.*

**భావము :** "సకల జీవరాసులకు (మనుషులకు, భూతములకు, గ్రహములకు) నేను దేవుడనైయుండి, మానవశరీరమును ధరించిన నన్ను చూచి మూఢులైన (అజ్ఞానులైన) మనుషులు నన్ను అవమానించుచున్నారు." అని దేవుడు చెప్పడము జరిగినది. అలా మనుషులకు జ్ఞానమును తెలియజేయుటకు జీవునిగా, ఆత్మగా, పరమాత్మగా మూడు రకములగానున్న దేవుడు, జీవునిగా మనిషి ఆకారములో భూమిమీదికి కొన్ని వేల లేక లక్షల సంవత్సరముల కొకమారు వస్తే, దేవుడు త్రైత సిద్ధాంతమును ఆధారము చేసుకొని ముగ్గురుగా ఉన్నాడని తెలియని మనుషులు, అజ్ఞానముచేత దేవున్ని కూడా అవమానించు చున్నారని దేవుడే స్వయముగా చెప్పాడు కదా! దేవుడు చెప్పిన గ్రంథములోని త్రైతసిద్ధాంతమే అర్థముకానప్పుడు, అన్నిటికీ మూలసూత్రమైన త్రైతము తెలియని దానివలన, మిగతా జ్ఞానము తెలియుననుటకు కూడా వీలులేదు.

అందువలన తమతమ మూలగ్రంథములలోని జ్ఞానము ఏ మతమువారికీ సరిగా గోచరించలేదనీ, దానివలన మత బేధములు మనుషులలో చేరినవనీ చెప్పవచ్చును.

ఏ మతములోనైనా త్రైతసిద్ధాంతమును ముఖ్యముగా తెలియవలెనని దేవుడు దానిని గురించిన జ్ఞానమును తెలిపియున్నాడు. త్రైత సిద్ధాంత జ్ఞానము సూక్ష్మముగానున్న మూడు ఆత్మల రూపముగా ఉంటూ స్థూలమైన శరీరములో ఉన్నది. అందువలన ప్రతి మనిషి, ప్రతి మతస్థుడు తన శరీరములోనే మూడు ఆత్మల వివరమును తెలియాలని ముందే చెప్పు కొన్నాము. దేవుడు ఎక్కడో ఉన్నాడని అనుకోకుండా పరమాత్మరూపములో నీ శరీరములోనే సకల సాక్షిగా ఉన్నాడని తెలియాలి. అలాగే ఆత్మ రూపములో నీ శరీరములోనే ఉంటూ, శరీరమును కదలించి నడుపు చున్నాడనీ తెలియవలెను. ఇక దేవునిలోని ఒక అంశ అయిన జీవుడు కూడా శరీరములో కష్టసుఖములను అనుభవించు పనిని చేయుచు కాలమును గడుపుచున్నాడని తెలియవలెను. ఈ విధముగా తమ శరీరములోనే త్రైతమును, దానికి అనుబంధమైన శరీరరూపములోనున్న ప్రకృతినీ ప్రతి ఒక్కరూ తెలియవలెను. అదే నిజమైన జ్ఞానము.

త్రైతము అనగా మూడు అని అందరికీ తెలుసు, ఏకము ఏకత్వము అనగా ఒకటి అని కూడా తెలుసు. ద్వితీయము అనగా రెండవదని కూడా అందరికీ తెలుసు. అద్వితీయము అనగా రెండు కానిది మూడవది. విశ్వములో మూడు ఆత్మల మినహా ఉన్నదంతా ప్రకృతియే. అయితే ఒకటవ ఆత్మకు జీవాత్మ అను పేరుంది. రెండవ దానికి ఆత్మయను పేరు కలదు. ఇక మూడవదైన దేవునికి లేక పరమాత్మకు పేరులేదు. మూడు ఆత్మల మినహా ఉన్న దానిని ప్రకృతియని అంటున్నాము. ప్రకృతి అనేక

రూపములతో అనేక పేర్లతో ఉన్నది. కృతి అనగా చేయబడినదని అర్థముకాగా 'ప్ర' అనగా ముఖ్యమైన అని తెలియుచున్నది. మొత్తము ప్రకృతికి ముఖ్యముగా చేయబడినదని లేక విశేషముగా చేయబడినదని అర్థము రాగలదు. విశేషతతో చేయబడినది ప్రకృతికాగా, దానిని చేసిన వాడు దేవుడు. అందువలన సర్వమునకు సృష్ఠికర్త దేవుడు అని చెప్పు చున్నారు. దేవుడు ఆత్మలలో మూడవ ఆత్మగా చెప్పబడినా ఆయనకు పేరులేదు, కావున మూడవ ఆత్మని ఆయనను అనకూడదు. దేవునికి దేవుడనునది కూడా పేరుకాదు. దేవునికి పరమాత్మ అనునది కూడా పేరు కాదు. దేవునికి పురుషోత్తమ అనునది కూడా పేరుకాదు. ఈ విధముగా ఆయనకు ఏ విధముగా పేరు లేదు. దేవుడు అంటే వెదకబడే వాడు లేక దేవులాడబడేవాడు అని అర్థము. అట్లే దేవుడు ఆత్మకంటే పరముగా (వేరుగా) ఉండువాడు కావున దేవున్ని పరమాత్మయని అంటున్నాము. దేవునికి రూప, నామ, క్రియలు ఉండవు, కావున అదే అర్థము వచ్చునట్లే ఆయనను చెప్పవలసియున్నది. దేవుడు ఆత్మలలో మూడవవాడు కావున ఆయనను 'త్రైతా' అను శబ్ధముతో చెప్పవచ్చును. 'త్రైతా' అనగా మూడవవాడు అని నేరుగా గుర్తించి చెప్పినట్లుండును. దేవుడు నేరుగా తెలియు వాడుకాడు, కావున ఆయనను రెండుకంటే వేరుగానున్న వాడు అని చెప్పడము మంచిదని 'ద్వాపర' అని అన్నారు. త్రైతా అనినా, ద్వాపర అనినా రెండు ఒకే అర్థము నిచ్చుచున్నవి. మూడవ ఆత్మగా లేక పరమాత్మగానున్న దేవునిలోనికి జీవుడు కలిసిపోతే మోక్షమవుతుంది.

యోగము అనగా కలయిక వియోగము అనగా విడిపోవడము అని అర్థము కదా! మూడవ ఆత్మ అయిన దేవునిలోనికి కలిసిపొమ్మని చెప్పడమును త్రైతాయోగము అని అన్నారు. అలాగే రెండవ ఆత్మకంటే

వేరుగానున్న పరమాత్మలోనికి కలిసిపొమ్మని అర్థమునిచ్చు వాక్యము ద్వాపర యోగము అని కలదు. త్రైతాయోగము, ద్వాపర యోగము అను శబ్దములను పూర్వము కాలము కొలతలో వినియోగించారు. నేడు యోగము అను శబ్దము కొద్దిగా మార్పుచెంది యుగము అని పలుకబడుచున్నది. అట్లు మారుట వలన త్రైతాయోగము, త్రైతాయుగముగా, ద్వాపర యోగము ద్వాపర యుగముగా మారిపోయినవి. ధర్మములు అధర్మములుగా ఎంత సులభముగా మారిపోయాయో ఈ పదములను చూస్తూనే అర్థముకాగలదు. దేవునికి మారుపేరుగా చెప్పబడిన త్రైతా, ద్వాపర అను శబ్దములలో త్రైతా అను శబ్దము కూడా కొద్దిగ మారిపోయి త్రేతా అయినది. దానితో త్రేతాయుగము అయినది. చివరకు త్రేతాయుగము అనుమాటలో మూడు అనునది లేదు, దానిలోనికి కలియమను చెప్పు యోగము అనునది లేదు. దైవములోనికి చేరిపొమ్మని చెప్పు త్రైతా యోగము చివరకు అర్థములేని త్రేతాయుగము అయినది.

కృత్ అనగా చేసినవాడు అని అర్థము కృత అనగా చేయబడినదని ప్రకృతియని అర్థము. కృత్ అనగా సృష్టినంతటిని చేసినవాడు సృష్టికర్తయనీ, ఆయనే దేవుడనీ అర్థము. సృష్టికర్తయిన వానిలోనికి చేరిపొమ్మని అర్థము నిచ్చునదే కృత్‌యోగము. అయితే ఆ పదము కూడా మార్పుచెంది కృత యుగము అని పిలువబడుచున్నది. కలి అనగా నాశనము అని అర్థము. సర్వమును నాశనము చేయువాడు దేవుడు ఒక్కడే, అందువలన ఆయనను కలి పురుషుడు అని అంటారు. మొదట కృత్ అను శబ్ధములో తయారైన యోగముల పేర్లు (యుగముల పేర్లు) చివర కలి అను శబ్ధముతో ముగియు చున్నది. కాలమును కొలుచు పేర్లలో వార, మాస, వత్సరము, యోగము నాలుగు భాగములు చేసి చెప్పడము జరిగినది. దినములు ఏడు (7),

మాసములు పన్నెండు (12), సంవత్సరములు అరవై (60) యోగములు నాలుగు (4) అని కాలమును నాలుగు పరిమాణములుగా లెక్కించుచున్నారు. అందులో అన్నిటికంటే పెద్దవయినవి యోగములు వాటిముందు దేవుని ప్రతీకగానున్న శబ్ధములను ఉంచడము జరిగినది. దేవునిలోనికి నీవు కలిసిపో అను అర్థమునిచ్చు శబ్ధములే కృత్ యోగము, త్రైతా యోగము, ద్వాపర యోగము, కలి యోగము కాగా, యోగము అను శబ్ధము పూర్తిగా మారిపోయి యుగము అయినది. దేవునికి గుర్తుగా చెప్పబడు కృత్ పోయి కృత అయినది, త్రైతా పోయి త్రేతా అయినది, ముందుగల రెండిటి శబ్ధములు పూర్తిగా మారిపోగా ద్వాపర, కలి అను రెండు శబ్ధములు అలాగే మిగిలి యున్నవి. అవి మిగిలియుండుట వలన మేము చెప్పుమాటలు సత్యమని నమ్ముటకు కొంత అవకాశమున్నది. ద్వాపర, కలి అను రెండు శబ్ధములు మారిపోయివుంటే నా మాట సత్యమనుటకు ఎటువంటి ఆధారము లేకుండా పోయెడిది.

కాల పరిమాణమునకు గుర్తుగాయుంచిన దేవునిలోనికి కలిసిపో అను వాక్యములు ఎలా మారిపోయాయో, ఎంత సులభముగా ఎవరూ గుర్తించుటకు వీలులేకుండా ఎలా మారిపోయాయో మీకు అర్థమైనది కదా! అదే విధముగా దేవుడు చెప్పిన ధర్మములు కూడా చాలా సులభముగా, ఎవరూ గుర్తించనట్లుగా మారిపోవునని చెప్పుటకు నాలుగు యుగముల (యోగముల) పదములే మనకు తార్కాణముగా కనిపించుచున్నవి. యోగము సులభముగా ఒక తలకట్టుతో యుగము అయిపోయినది. అలాగే కృత్ కూడా ఒక తలకట్టుతో కృత అయినది, త్రైతా అను శబ్ధములో త్రై కింద ఐత్వము కనిపించకుండ పోయి త్రేతా అయినది. అలాగే ఇందూ అను శబ్ధము సులభముగా అచ్చు హల్లుగా మారిపోయి హిందూ అయినది.

దానితో ఈనాడు మనము హిందువులము కాదు ఇందువులము అని చెప్పినా వినని స్థితిలోనికి మనుషులు మారిపోయారు. మాయ ప్రభావము వలన దేవుని ధర్మములు అధర్మములుగా మారిపోవుట జరుగుచున్నది. అలా మారిపోయిన ధర్మములను తిరిగి తెలుపుట దేవునివంతయినది. ఉన్నదున్నట్లు చెప్పితే మనుషులకు జీర్ణముకాదు. అందువలన ఇవి అధర్మములు, ఇవి ఇలా ఉండకూడదు అని చెప్పితే, అజ్ఞానములో కూరుక పోయినవారు పరమతమును బోధిస్తున్నారని సాకు చూపి దాడులకు పాల్పడుదురు. హిందూ కాదు అని ఒక్క ఇందూ శబ్దమును చెప్పితేనే మమ్ములను పరాయిమతమువారని చెప్పిన మనుషుల స్వభావమును గుర్తించిన కృష్ణుడు చాలా తెలివిగా, ఏ గొడవాలేకుండా తన జ్ఞానమును అర్జునునికి ఒక్కనికి మాత్రమే చెప్పిపోయాడు అదియు ఎవరూ వినుటకు అవకాశములేని స్థలములో, ఎవరూ గుర్తించలేని యుద్ధసమయములో తనకు అనుకూలమైన మనిషికి మాత్రము చెప్పాడు. అదే ఏసు ప్రజలలోనికి పోయి దేవుని జ్ఞానమిది అని చెప్పితే ఏమాత్రము సరిపోనివారు ఆయనను శిలువమీద చంపివేయడము జరిగినది. దీనినంతటిని గమనించిన దేవుడు చాటుగా ఒకరికి చెప్పిన భగవద్గీతా జ్ఞానము మూడు వేల సంవత్సరములు అయినా బయటికి రాకపోవడముతో, రెండువేల సంవత్సరముల క్రింద ప్రత్యక్షముగా చెప్పి మనుషులతో హింసింపబడ్డాడు. తర్వాత తాను చాటుగా చెప్పినా, ప్రత్యక్షముగా చెప్పినా ఇబ్బందిగానే ఉన్నదని తన దూత అయిన జిబ్రయేల్‌తో జ్ఞానమును చెప్పించాడు. అయితే చెప్పిన జ్ఞానము ప్రజల లోనికి పోయినా, అది వేరు అర్థముతో కూడుకొని వేరు విధానమును ఆచరించుట వలన మూడవ మారు దేవుడే వచ్చి చెప్పవలసివున్నది. ఈ మారు ఆయన భగవంతునిగా భూమిమీదకు వస్తే తన జ్ఞానమును ఎలా ప్రజలకు చెప్పునో వేచి చూడాలి.

దేవుడు రెండుమార్లు భగవంతుని రూపముతో ప్రత్యక్షముగా, ఒకమారు తన దూత ద్వారా పరోక్షముగా తెలిపిన జ్ఞానము అర్థహీనమై పోయి, భావరహిత ఆచరణలుగా మారిపోయినదని చెప్పుకొన్నాము. అయినా కొందరు మేము జ్ఞానులము, స్వాములము, పీఠాధిపతులము అనువారు మా మాటలను ఒప్పుకోవడము లేదు. కొందరికి మా మాటలు సత్యమని తెలిసినా, మరికొందరు తీవ్రమైన అభ్యంతరములు తెలుపు చున్నారు. దేవుని జ్ఞానము ప్రకారము మేము ఆచరణకల్గియున్నామని చెప్పుకొనుచున్నారు. అటువంటివారు ఎలా మాయ చేతిలో మోసపోవు చున్నారో త్రైత సిద్ధాంతము తెలిసినవారికి మాత్రము తెలియుచున్నది. భూమిమీద ఏ అజ్ఞానమయినా, ఏ రూపములో ఉన్నా, త్రైత సిద్ధాంతము తెలిసినవారికి అది ధర్మమో అధర్మమో, జ్ఞానమో అజ్ఞానమో ఏదయినది తెలిసిపోవును. మాది జ్ఞానము అను భావముతో మనుషులలో పెద్దపెద్ద జ్ఞానులుగా ఉన్నవారే మాయచేతిలో ఎలా మోసపోవుచున్నారో, త్రైత సిద్ధాంత జ్ఞానము వలన అధర్మములు ఎలా బయటపడగలవో ఉదాహరిస్తూ చివరిగా ఒక విషయమును చెప్పుకొందాము. ఇప్పుడు ఒక ధర్మమును త్రైతసిద్ధాంత భగవద్గీతనుండి తీసుకొని అదే ధర్మమే బయట ప్రపంచములో ఇందువు హిందువుగా, కృత్ కృతగా, త్రైతా త్రేతాగా, యోగము యుగముగా ఎలా మార్పు చెందాయో అలాగే గుర్తించలేని విధముగా ధర్మము ఎలా అధర్మముగా మారిందో వివరించుకొందాము. ఇప్పుడు మేము చెప్పు విషయము ప్రజలను జ్ఞానులుగా చేయుటకే చెప్పుచున్నాము గానీ, ఎవరినీ కించపరచుటకుగానీ మరి ఏ ఇతర భావములతోగానీ చెప్పడములేదని గ్రహించవలెను.

భగవద్గీతలోని జ్ఞానము చాలాగొప్పది, ఎందుకనగా అది దేవుడు చెప్పిన జ్ఞానము కావున అది ఏ భాషలోవున్నా, ఏ పేరుతో పిలువబడుచున్నా, ఏ దేశములో ఉన్నా, ఏ మత గ్రంథముగా పిలువబడుచున్నా దేవుని జ్ఞానము దేవుని జ్ఞానమే దానికి సాటి ఏ మనుషులు చెప్పినదీ రాదు. భగవద్గీతలో ఆత్మ సంయమ యోగము అను అధ్యాయములో మొట్టమొదటి శ్లోకము ఇలా కలదు.

*శ్లో॥ అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతియః*
*ససన్న్యాసీచ యోగీచ ననిరగ్ని ర్నచాక్రియః*

**భావము :** "కర్మఫలమును ఆశ్రయించక కార్యములను చేయవలెనని తలచి ఎవడు చేయునో, వాడే నిజమైన సన్న్యాసి, నిజమైనయోగి. అగ్ని లేనివాడు, పనులను చేయనివాడు సన్న్యాసి కాడు, యోగికాడు." అని దేవుడు చెప్పాడు. ఈ శ్లోకములో ససన్న్యాసి అని కలదు కదా! దానికి మంచి సన్న్యాసి లేక నిజమైన సన్న్యాసి అని అర్థము గలదు. సన్న్యాసీచ, యోగీచ అని సన్న్యాసికి యోగికి రెండు పదములకు ముందు "స" అను అక్షరమును వాడడము చేత "స" అను విశేషము రెండు పదములకు వర్తించుచున్నది. అందువలన విడదీసి చెప్పితే ససన్న్యాసీచ, సయోగీచ అని చెప్పవచ్చును. ససన్న్యాసి అనగా మంచి సన్న్యాసి లేక నిజమైన సన్న్యాసి అనియూ, సయోగి అనగా మంచి యోగి లేక నిజమైన యోగి అనియు చెప్పవచ్చును. ఇక్కడ ఈ శ్లోకములో సన్న్యాసి,యోగి అని రెండు పదములను వాడియుండుట వలన సన్న్యాసి వేరు యోగి వేరని కొందరనుకొనుటకు అవకాశము కలదు. అయితే బ్రహ్మవిద్యా శాస్త్రమును అనుసరించి యోగి అనినా, సన్న్యాసి అనినా రెండు పేర్లు ఒకే వ్యక్తికి వర్తించును. అందువలన ఎవడు సన్న్యాసి

అనుబడునో వాడే యోగి, అలాగే ఎవడు యోగి అనబడునో వాడే సన్న్యాసి అని తెలియవలెను.

మీకు బాగా అర్థమగుటకు మరొక విధముగా చెప్పుచున్నాము చూడండి. సన్న్యాసి అనగా విడిపించుకొనువాడు అని అర్థము. కర్మను విడిపించుకొనువాడు, కర్మను అంటనివాడు, కర్మను అంటించుకోనివాడు సన్యాసియని చెప్పవచ్చును. అలాగే యోగి అనగా కలిసిపోవువాడు అని అర్థము. సన్యాసి కర్మను విడిపించుకొనువాడు కాగా, యోగి పరమాత్మలో కలిసిపోవువాడు. కర్మను లేకుండా కర్మను అంటకుండా చేసుకొను సన్యాసి చివరకు దేవునియందైక్యమైపోవును. అలాగే పరమాత్మ లేక దేవునియందు కలిసిపోవలెనని ప్రయత్నము చేయువాడు యోగి అనబడును. యోగి అయినవాడు చివరకు దేవునియందు ఐక్యమైపోవును. ఈ విధముగా అన్నిరకముల యోగి సన్యాసి ఇద్దరూ ఒక్కటేనని చెప్పుచున్నాము. ఈ శ్లోకములో కర్మఫలములను ఆశ్రయించక కార్యములను చేయువానిని అని ఒకే వ్యక్తిని చూపి అతనిని నిజమైన సన్యాసి నిజమైన యోగి అని అనుచున్నారని చెప్పడము జరిగినది.

శ్లోకములో మొదటి వాక్యములో "కర్మఫలమ్" అను ఒక పదమూ, "కార్యమ్" అను మరియొక పదమునూ, వినియోగించి చెప్పడమేకాక వాక్యము చివరిలో "కర్మకరోతియః" అని మూడవ పదమును కూడ ఉపయోగించారు. ఇప్పుడు ఈ మూడు పదములకు అర్థమును తెలుసు కొందాము. వీటి అర్థము తెలుసుకోకముందు మనిషి శరీరములోనున్న విధానమును తెలుసుకొందాము. అలా తెలుసుకోవడము వలన ఈ మూడు పదములకు అర్థము సులభముగా గ్రహించవచ్చును. ఒక మనిషి

మంచి ప్రవర్తన కలిగియుండాలనీ, దేవుని జ్ఞానము తెలుసుకోవాలనీ, ఇతరుల దృష్టిలో ఏ చెడూ తనలో కనిపించకూడదనీ అన్ని రకముల సచ్ఛీలతతో మెలగాలనీ అనుకొన్నాడు. అప్పటినుండి ఆధ్యాత్మిక గ్రంథ పఠనము చేయుచూ, ఎక్కడా అసత్యమును చెప్పకుండా, అన్యాయముగా ప్రవర్తించకుండా అందరి దృష్టిలో సజ్జనుడుగా పేరుగాంచియున్నాడు. అయితే ఆ వ్యక్తి చేయు వ్యాపారములో కొందరు స్త్రీలు భాగస్వాములుగా ఉండడము వలన వారితో అప్పుడప్పుడు కలిసి మాట్లాడవలసి వస్తున్నది. అలా వచ్చు వారిలో ఒక స్త్రీని చూస్తూనే అతనికి ఆమెమీద ఆశ అను గుణము కలగడము మొదలవుతుంది. అది మంచిది కాదని అనేకమార్లు అతను అనుకోవడము జరిగినది. చివరికి కొంత కాలము గడువగా ఇతనికి ఎవరిమీద ఆశ కలుగుచున్నదో, అలాగే అమెకు కూడా ఇతని మీద ఆశ కలుగడము ప్రారంభమైనది. ఇద్దరిలోని గుణములు అనేకమార్లు ప్రేరేపింపగా, ఒకమారు ఇద్దరు కలిసిపోవడము జరిగినది. అలా వారు తమ అశ అను గుణము వలన అనేకమార్లు కలుసుకోవడము జరిగినది. సత్‌ప్రవర్తన కలిగియుండవలెనని అన్ని విధముల మంచిగా ప్రవర్తించు ఆ వ్యక్తి ఒక విషయములో పొరబడినానని అనుకోవడము జరిగినది. ఇక ఆమెతో సంబంధము పెట్టుకోకూడదని అనుకొన్నాడు. అలా అనుకొన్న మూడవ దినమే ఆమెతో తిరిగి కలువడము జరిగినది. తర్వాత మరుసటి దినము తాను అక్రమమైన పనిని చేయుచున్నాననీ, తాను అనుకొన్నదానికి నడుచుకొన్నదానికి ఎంతో తేడా ఉన్నదనీ, ఇక అలా ఉండకూడదని అనుకోవడమే కాకుండా ఇక ఎప్పటికీ ఆమెతో సంబంధము పెట్టుకోను అని ప్రతిజ్ఞ చేసుకొన్నాడు. అయినా మరుసటి దినమే ఆమె రావడమూ, ఆమెతో మాట్లాడడమూ తన ఉద్దేశము ప్రతిజ్ఞ రెండూ అడ్డము రాకుండా

పోయి ఆమెతో కలువడమూ జరిగినది. తర్వాత రెండవరోజు జరిగిన పనిని గురించి తేరుకొని, నేను వద్దనుకొనినా ఆ సమయమునకు అన్నిటిని మరచిపోయి అప్పటికి అదే ముఖ్యకార్యమన్నట్లు ఎందుకు చేయుచున్నాను? అని చింతించి అలా తాను ప్రవర్తించినందుకు తనను తాను తిట్టుకొన్నాడు. నాకు బుద్ధి లేదనీ, నేను మనిషిని కాను జంతువుననీ, నీచాతి నీచముగా తిట్టుకోవడము జరిగినది.

అలా కాలము జరుగగా తాను వద్దనుకొన్న కార్యము జరుగడము చూచి, తాను అన్ని విధముల బాగానే ఉన్నా ఒకే ఒక్క పరిస్థితిలో, ఒకే వ్యక్తి వద్ద ఎందుకు అంత బలహీనముగా మారిపోవుచున్నానో అని ఆలోచించి, ఆలోచించి చివరకు ఆలోచించడమే మానివేశాడు. ఆ విషయము తన చేతకాక ఒక గురువువద్దకు వచ్చి ఇలా చెప్పాడు.

వ్యక్తి :- స్వామీ మీరు జ్ఞానమును తెలిసిన గురువులు. నేను కూడదు అనుకొన్న పనిని నాకు తెలిసి చేయుచున్నాను. నేను వందమార్లు వద్దను కొనినా, చేయను అనుకొనినా, తిరిగి వద్దనుకొన్న పనినే చేయుచున్నాను. దీనికి కారణమేమి? నాలో ఏ లోపముంది. నేను జ్ఞానమును తెలిసినా, పూజలు చేసినా, అన్ని విధముల సత్‌ప్రవర్తన కలిగియున్నా, ఒకే ఒక విషయములో ఎందుకు ఓడిపోవుచున్నాను? నా ఉద్దేశ్యము ఏమైపోవుచున్నది?

గురువు :- ఇందులో నీ తప్పు ఏమీ లేదు. అసలు విషయము అర్థము కావాలంటే కొంతవరకైనా జ్ఞానముండాలి. అప్పుడైతేనే అర్థమవుతుంది.

వ్యక్తి :- నేను కొంతవరకు జ్ఞానమును కూడా తెలుసుకొన్నాను. అయినా జ్ఞానము కొద్దిమాత్రము కూడా అడ్డము రాలేదు.

గురువు : ఇల్లు అంటే మిద్దెకావచ్చు, మేడకావచ్చు, పూరిగుడిసెకావచ్చు. అలాగే జ్ఞానములో కూడా ఎన్నో రకములు గలవు. జ్ఞానములో కర్మను పోగొట్టు జ్ఞానముకావచ్చు, కర్మను తగిలించు జ్ఞానముకావచ్చు, నీవు నేర్చినది ఏ జ్ఞానమో? అద్వైత జ్ఞానమా, ద్వైత జ్ఞానమా, త్రైత జ్ఞానమా? ఏది?

వ్యక్తి :- హెూటల్‌లో పూరి, ఇడ్లి, దోశ అను టిఫిన్‌లు ఉన్నట్లు జ్ఞానము కూడా వివిధ రకములుంటుందా! స్వామీ!

గురువు :- అవును జీవితములోని సమస్యలకు అన్నిటికి సమాధానము దొరకవలెనంటే ఒకే ఒక త్రైత సిద్ధాంత జ్ఞానములో మాత్రము దొరుకు తుంది.

వ్యక్తి :- త్రైతము క్రైస్తవుల జ్ఞానము కదా! అది మనకెందుకు? హిందువుల జ్ఞానముంటే చెప్పండి స్వామీ?

గురువు :- త్రైత సిద్ధాంత జ్ఞానము ఏ ఒక్క మతమునకు సంబంధించినది కాదు. అది ఎవరికీ తెలియకుండా అన్ని మతములలోనూ ఉన్నది. నీవు క్రైస్తవముది అనుకొంటే అందులో త్రైతసిద్ధాంతమును గురించి ఎవరికీ తెలియదు. అందువలన ఇది మా జ్ఞానము కాదు అంటారు. ఒకవేళ నీవు ముస్లీమ్‌ల జ్ఞానమనుకొంటే వారికి కూడా ఈ త్రైత సిద్ధాంతమంటే ఏమిటో తెలియదు. కావున వారు కూడా ఇది మా జ్ఞానము కాదంటారు. ఇక దీనిని నీవు హిందువుల జ్ఞానమనుకొనినా, హిందువులు కూడా ఇది పరమత జ్ఞానము మా జ్ఞానముకాదని మాతోనే చాలామార్లు వాదించారు. అందువలన హిందువులు కూడా త్రైత సిద్ధాంతమును మా జ్ఞానమని ఒప్పు కోవడములేదు. నీవు హిందువే, నేను హిందువే, నీకు కావలసినది నీ సమస్యకు జవాబు. అది ఏ జ్ఞానమైతే నీకెందుకు? దేవుని జ్ఞానమొక్కటే

నీ సమస్యకు జవాబును చెప్పగలదు. జాగ్రత్తగా విను. భగవద్గీత ఆత్మ సంయమయోగములో మొదటి శ్లోకమునందు మొదటి వాక్యములోనే ముఖ్యముగ మూడు పదములు గలవు. అందులో ఒకటి కర్మఫలమ్, రెండవది కార్యమ్, మూడవది కర్మకరోతియః అని కలవు. వీటి అర్థములను తెలుసుకొంటే కార్యమ్ అనగా మనము చేయుచున్న పని అని అర్థము, అది ఏ పని అయినా కావచ్చును. సందర్భానుసారము నీవు చేసిన పనినే కార్యము అని అన్నారనుకో. కర్మఫలమ్ అనగా పని చేయగా వచ్చిన ఫలితము అని తెలియవలెను. ఇకపోతే చివరిది కర్మకరోతి అనగా వివరము చెప్పుకొంటే "కరో" అను శబ్ధమునకు హిందీలోను, ఉర్దూలోనూ సంస్కృతములోనూ చేయుము అని అర్థము. కరోతి అనగా చేయించునది అని అర్థము. కర్మకరోతి అనగా! చేయించు కర్మ అని అర్థము. కార్యము అనగా నీవు చేశాను అనుకొన్నది. కర్మ కరోతి అనగా కర్మచేయించునది, కర్మఫలమ్ అనగా నీవు చేశాను అనుకొన్న పనిలో వచ్చిన ఫలితము పాపము. ఇప్పటికి కూడా నీకు సరిగా అర్థమైవుండదు. నీకు అర్థమగుటకు విపులముగా చెపుతాను విను.

ప్రతి మనిషి శరీరములో తలయందు జీవుడున్నాడు. మూలము పైన ఉన్నదని భగవద్గీత పురుషోత్తమ ప్రాప్తియోగము అను అధ్యాయములో మొట్టమొదటి శ్లోకములో చెప్పినట్లు, మనిషి తలలో మధ్య భాగమున భృకుటికి సమతలమున బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములను నాలుగు చక్రముల సముదాయము కలదు. అందులో క్రింది చక్రమైన గుణచక్రము మూడు భాగములుగా ఉండగా, అందులో ఏదో ఒక భాగమున జీవుడు నివసించుచుండును. జీవుడు గుండ్రని ఆకారముగల శూన్యముగా ఉండగా, దానిని చుట్టుకొని ఒక పొరలాగ బుద్ధి ఉండును. బుద్ధి తర్వాత

చిత్తము అను పొరవుండును. చిత్తము తర్వాత అహము అను పొరవుండును. బ్రహ్మ, కాల, కర్మ, గుణ నాల్గుచక్రముల ఆకారమును మరియు జీవుని ఆకారమును క్రింది చిత్రములలో చూడవచ్చును.




**బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములు**




**జీవుని ఆకారము**

గుణచక్రములో జీవుడుండగా, దానిపైనగల కర్మచక్రములో ప్రారబ్ధ, ఆగామి, సంచిత అను మూడు కర్మలుండును. దానిపై కాలచక్రములో క్రింది చక్రములోని ప్రారబ్ధకర్మను ఆ క్రింది చక్రములోని జీవుడు ఎప్పుడు

అనుభవించవలెనను కాలనిర్ణయముండును. గుణచక్రములోని జీవుడు మాత్రము ప్రారబ్ధములోని పాపపుణ్యములను నిత్యము అనుభవించు చుండును. ఇది శరీరములోని చక్రముల యంత్రాంగము. ఇంకా శరీరములోని యంత్రాంగమేమనగా! శరీరమునకు బయటనున్న జ్ఞానేంద్రియములైన కన్ను, ముక్కు, చెవి, నాలుక, చర్మము అను ఐదు భాగములు అందించు సమాచారమును ఆ అవయవములవరకున్న మనస్సు తీసుకొని లోపల తలలో గుణచక్రములోని జీవునివద్దయున్న బుద్ధివరకు చేర్చును. బయటి జ్ఞానేంద్రియముల నుండి మనస్సు తెచ్చిన సమాచారమును బుద్ధి గ్రహించి, మనస్సు తెచ్చిన విషయము గుణములలో ఏ గుణమునకు సంబంధించినదో ఆ గుణముతో ఆలోచించును. బుద్ధి గుణముతో ఆలోచించగా వచ్చిన ఆలోచనలలో ఏది సరియైనదో దానిని చిత్తము నిర్ణయించును. జీవుని దగ్గర బుద్ధి ప్రక్కనేయున్న పొర చిత్తము. అందువలన అక్కడ జరుగు సమాచారమంతయు బుద్ధికి ఒక దానికేకాక జీవునికీ, చిత్తమునకూ, అహమునకూ తెలియుచుండును. గుణములను కదిలించి ఆలోచించిన బుద్ధి, చిత్తము నిర్ణయించిన నిర్ణయమును తిరిగి మనస్సుకు తెలుపగా, మనస్సు ఆ సమాచారమును శరీరము బయటనున్న కర్మేంద్రియములకు చేర్చును. ఇక్కడ బుద్ధి ఆలోచించిన గుణములను చిత్తము స్వయముగా నిర్ణయించదు. పైన కర్మ చక్రములోని ప్రారబ్ధకర్మను బట్టి చిత్తము నిర్ణయించును. ఈ విధముగా బయటి జ్ఞానేంద్రియములనుండి వచ్చిన సమాచారము మనస్సు ద్వారా బుద్ధికి చేరి, అక్కడ తతంగమంతయు జరిగిన తర్వాత చిత్తము నిర్ణయించిన సమాచారమును మనస్సు బయట కర్మేంద్రియములకు అందించగా, లోపల నుండి వచ్చిన ఆజ్ఞ ప్రకారము కర్మేంద్రియములైన కాళ్ళు, చేతులు, నోరు పని చేయుచున్నవి.

కర్మేంద్రియములు పని చేయగా కలుగు సుఖముగానీ, దుఃఖముగానీ మనస్సు ద్వారా బుద్ధికి, బుద్ధినుండి జీవునికి చేరగా జీవుడు అనుభవించుచున్నాడు. శరీరములో 24 భాగములు ఒక్కొక్కటి ఒక్కొక్క పనిని చేయుచుండగా, 25వ భాగమైన జీవుడు కేవలము కష్టసుఖములను సుఖదుఃఖరూపములో అనుభవించుచున్నాడు.

ఇది శరీరములో దేవుడు పెట్టిన యంత్రాంగము. దీనిని ఏ మనిషి గానీ, ఏ జ్ఞానిగానీ, ఏ స్వామీజీగానీ, ఏ మతస్థుడుగానీ కాదనుటకు వీలులేదు. బయట జ్ఞానేంద్రియములు మరియు కర్మేంద్రియములైన పది భాగములకు లోపలి 13 భాగములకు మనస్సు మధ్యవర్తిలాగ పని చేయు చున్నది. మనస్సు అందించిన సమాచారము నేరుగా బుద్ధికి చేరగా అక్కడనున్న జీవునికి, చిత్తమునకు, అహమునకు ఆ సమాచారము తెలిసి పోవుచున్నది. బుద్ధి గుణములతో ఆలోచించిన విధానము, గుణములు అందించిన ఆలోచనలు, చిత్తము నిర్ణయించిన విషయము మనస్సు బయటికి తీసుకొని పోయిన సమాచారము, బయట శరీరము చేసిన పని, మొత్తము తతంగమంతయు జరుగగా లోపల జీవుని ప్రక్కనయున్న అహము ఇవన్నియు నీవే చేశావు అని చెప్పుచున్నది. లోపల జీవుడు ఒకవైపు బుద్ధితోను, ఒక వైపు అహముతోనూ సంబంధము పెట్టుకొని ఉండుట వలన, బుద్ధివలన సమాచారము సుఖము దుఃఖము తెలియుచున్నది. ఇక అహము మాత్రము జీవున్ని పూర్తిగా మభ్యపరచి శరీరమే నీవు, శరీరములో జరిగిన కార్యము లన్నియు నీవే చేయుచున్నావని, దుర్యోధనునికి శకుని మంచిని బోధించినట్లు నటిస్తూ చెడును బోధించి చెడుదారి పట్టించినట్లు జీవునికి మంచిగా చెప్పుచూ చెడు దారిని పట్టించుచున్నది. అప్పుడు జీవుడు అహము యొక్క మాటలకే ఎక్కువ ఆకర్షితుడై, శరీరములో అన్ని భాగములు చేసిన పనులను తానే

చేశానని అనుకొనుచున్నాడు. శరీరములోని మూడు ఆత్మలలో జీవుడు (జీవాత్మ) శరీరములో ఒకచోటయుండి అనుభవములను అనుభవించడము తప్ప ఏమీ చేయడము లేదు. శరీరములో ఒక్కచోటనున్న జీవుడు పాప పుణ్యములను ప్రారబ్ధకర్మలను అనుభవించువాడు మాత్రముకాగా, రెండవ ఆత్మ శరీరమంతా వ్యాపించియుండి శరీరములోని బయటి ఇంద్రియము లకూ, లోపలి ఇంద్రియములకూ మధ్యవర్తి అయిన మనస్సుకూ, అంతఃకరణ ములనబడు జీవునికి, బుద్ధికి చిత్తమునకు, అహమునకు అన్నిటికీ చైతన్యశక్తి నిచ్చి కదలించి పని చేయించుచున్నది. శరీరములో బయట సమాచారము లోపలికీ, లోపలి సమాచారము బయటికీ చేరవేయుటకు, లోపల మనస్సు బుద్ధి చిత్తము, అహము పని చేయుటకు శక్తిని ఆత్మయే ఇచ్చి వాటిచేత పని చేయించుచున్నది. భూమిమీద ఏ సమాజములోని మనిషికైనా, రాజుకైనా, మంత్రికైనా, ఏ మతస్థునికైనా వాని శరీరములో అన్ని భాగము లను ఆత్మే పని చేయించుచున్నది. శరీరమంతటికి శక్తినిచ్చుచున్నది ఆత్మేనని తెలియవలెను. శరీరమున కంతటికీ అధికారి, అధిపతి ఆత్మయే. ఆత్మ మనిషి పుట్టినప్పటి నుండి చనిపోవువరకు శరీరమంతా వ్యాపించియున్నది. ఆత్మ చేయిస్తే శరీరములో పని జరుగుచున్నది. ఆత్మ కదిలిస్తే శరీరము కదలుచున్నది.

మూడు ఆత్మలలోని మొదటివాడైన జీవుడు శరీరములో ఒక్కచోట ఉండి సుఖదుఃఖములను మాత్రము అనుభవించుచున్నాడు. ఇక రెండవ దైన ఆత్మ శరీరమంతా వ్యాపించియుండి శరీరములోని అన్ని భాగముల చేత పనిని చేయించుచున్నది. శరీరములోని చిన్న కదలికగానీ ఆత్మ వలనే జరుగుచున్నది. త్రైతములో రెండు ఆత్మల వివరము శరీరమునందు ఎలా ఉన్నది తెలిసిపోయినది. తర్వాత మూడవ ఆత్మయిన పరమాత్మ

విషయమును గమనించితే దేవుడు చెప్పిన సమాచారము ప్రకారము పరమాత్మ శరీరములో జరుగు పనులన్నిటికీ, జీవాత్మ అనుభవించు అనుభవములన్నిటికీ, ఆత్మ చేయించు కార్యములన్నిటికీ, మొత్తము శరీరములోని 26 భాగములను ఎల్లప్పుడు చూస్తూ సాక్షిగా నిలచియున్నది. పరమాత్మ ఎటువంటి పరిస్థితులలోనూ ఏమీ చేయక అన్నిటికీ సాక్షిగా మాత్రమున్నది. త్రైత సిద్ధాంతము ప్రకారము జీవాత్మ శరీరములో ఒక్కచోట రవ్వంతగా ఉండగా, ఆత్మ శరీరమంతా వ్యాపించియుండగా, పరమాత్మ శరీరము లోపలా శరీరము బయటా అణువణువునా వ్యాపించియున్నది. శరీరమంతా వుండి శరీరమును దాటి ఏమాత్రము లేకుండా ఆత్మ ఉండగా, పరమాత్మ మాత్రము అన్ని శరీరములలోనూ ఉంటూ బయట భూమిలో, నీటిలో, గాలిలో, అగ్నిలో, ఆకాశములో అణువణువునా వ్యాపించియున్నది. ఖగోళములో సూర్యమండలము నక్షత్రమండలము ఇంకా ఇంకా హద్దు అనునది లేకుండా పరమాత్మ వ్యాపించియున్నది. పరమాత్మ, ఆత్మ, జీవాత్మ సూక్ష్మములు అయినందున ఎవరికీ కనిపించవు.

మూడు ఆత్మలలో పరమాత్మకు అనగా దేవునికి ఎల్లలు లేవు. ఆత్మకు మాత్రము శరీరమే హద్దుగాయున్నది. జీవాత్మ శరీరములో ఒకచోట ఒక్క బిందువుగా ఉన్నది. ఇప్పుడు శరీరములోని సూత్రములన్నియు తెలిసి పోయినవి. కావున అసలు విషయానికి వస్తాము. నీ శరీరములో నీవు కేవలము ఒక్కచోటవున్న జీవునివి మాత్రమే. నీకు ఏ బలమూ లేదు, నీవు శరీరములో ఏ పనినీ చేయడము లేదు. నీవు శరీరములో నీ వరకు వచ్చిన సుఖము యొక్క అనుభవమును, దుఃఖముయొక్క అనుభవమును అనుభవిస్తున్నావు తప్ప జీవుడయిన నీకు ఏ పని లేనే లేదు. అయితే జీవుడు శరీరములోని యంత్రాంగమును తెలియక అన్నిటిని తానే చేయు

చున్నాననుకోవడమే అజ్ఞానము. శరీరములో ఏమి జరుగుచున్నదో, శరీరములో జీవునిపాత్ర ఎంతో, ఆత్మపాత్ర ఎంతో, పరమాత్మ ఎలా ఉన్నాడో తెలియడమే నిజమైన జ్ఞానము. శరీరములోని జ్ఞానము తెలియకుండా బయట ఎంత పండితుడనిపించుకొనినా, బయట జ్ఞానమును ఎంతగా చెప్పుకొనినా, బయటి గ్రంథములలోని విషయములను ఎంత తెలిసినా, వేదములను చదివినా, యజ్ఞములను చేసినా, తపస్సులను చేసినా అది ఏమాత్రము ఆత్మజ్ఞానమనిపించుకోదు. ఆత్మజ్ఞానమును తెలియనివాడు ఎంతటి పెద్ద స్వామీజీ అయినా, మత పెద్దలయినా దేవున్ని తెలియలేరు.

నీ విషయానికి వస్తే నీవు జీవునివే కదా! లోపలికి విషయము వచ్చినపుడు గుణముల ప్రేరణ జరుగును, గుణముల ప్రేరణ ప్రకారము వచ్చిన ఆలోచనలలో ప్రారబ్ధకర్మ ప్రకారము పనిని చేయమని చిత్తము నిర్ణయించగా, ఆ నిర్ణయము బయటికి వచ్చి కర్మేంద్రియముల ద్వారా పని జరిగిపోవును కదా! నీ విషయములో కర్మచక్రముకంటే పైనవున్న కాలచక్రములో ఫలానా సమయములో ఫలానా ప్రారబ్ధకర్మ అమలుకు రావాలని ముందే నిర్ణయింపబడియుండుట చేత, ఆ సమయానికి నీకు పరిచయమున్న స్త్రీ నీవద్దకు రావడము జరుగగా, ఆమెను నీ కన్నులు చూచి ఆమె విషయమును కన్నులు తెలుపగా, కన్నువరకుయున్న నీలోని మనస్సు ఆ విషయమును లోపలి బుద్ధికి అందించింది. బుద్ధి ప్రస్తుతము అక్కడున్న ఆశ అను గుణముతో ఆలోచించగా, ఆమెను ముట్టుకోవద్దని కొన్ని గుణముల ఆలోచనలు, ముట్టుకొని ఆమెను అనుభవించమని కొన్ని గుణముల ఆలోచనలురాగా, బుద్ధి రెండిటిని గమనిస్తూ ఉన్నప్పుడు ఆ సమయానికి ఆమెతో అనుభవము పొందు కర్మయుండుట చేత చిత్తము అనుభవించమను ఆలోచననే నిర్ణయించి బుద్ధికి అందివ్వగా, ఆ విషయమునే

బుద్ధి మనస్సుకు అందించినది. అలా బుద్ధి అందించిన సమాచారమును మనస్సు బయటి కర్మేంద్రియములకు అందించినది అప్పుడు కర్మేంద్రియ ములు పనిని చేయగా కర్మేంద్రియములను అనుసరిస్తూ పని చేసిన జ్ఞానేంద్రియములు అక్కడ లభించిన అనుభవములను కంటి చూపుతోనూ, చర్మము యొక్క స్పర్శతోనూ మనస్సుకు అందివ్వగా మనస్సు బుద్ధికి చేర్చగా బుద్ధి ద్వారా వచ్చిన సమాచారములోని సుఖమును జీవుడయిన నీవు అనుభవించడము జరిగినది. తర్వాత మరుసటి దినము జీవుడు బుద్ధితో జరిగిన పనిని ఆలోచిస్తూ ఆ పనిని చేయకూడదనుకొనినా, తన నిర్ణయము శరీరములో అమలు జరుగలేదు. కర్మ నిర్ణయము ఎలా ఉంటే అలాగే జరుగును. అందువలన అన్ని విషయములలో నీది సక్రమమైన ప్రవర్తనే అయివున్నా, సమయమొచ్చినపుడు కర్మప్రకారము జరుగుట దేవుడు పెట్టిన నిర్ణయము, అదే శరీరయంత్రాంగము. కావున జీవుడు వద్దనుకొన్న పని కూడా ఏ ఆటంకములేకుండా జరిగిపోవుచున్నది. అహము మాట విను జీవుడు నేనే చేయుచున్నానని అనుకోవడము వలన అదే భ్రమలో ఉండి నేను ఎందుకు వద్దనుకొన్న పనిని చేయుచున్నానని నీవు చింతించుచున్నావు.

శరీరములోని ఆత్మలయొక్క యంత్రాంగము తెలియనిదే ఎవరూ ఆత్మజ్ఞాని కాలేడు. త్రైత సిద్ధాంతము తెలియనిదే మూడు ఆత్మలుగానీ, అందులో తాను ఎవరన్నది గానీ తెలియదు. అలా తెలియని వారిని అజ్ఞానులు అనవచ్చును. లోపలి జ్ఞానమును తెలియనివారు బయట జ్ఞానమును అవలంభించుచుందురు. గీతలో ఆత్మసంయమ యోగములో చెప్పిన మొదటి శ్లోకములోని మొదటి వాక్యములో కర్మఫలమ్, కార్యమ్, కర్మకరోతి అను మూడు పదములలో కర్మకరోతి అను పదమును తీసుకొంటే

గతములో చేసుకొన్న కర్మ ప్రారబ్ధకర్మముగా నిర్ణయింపబడివుండి ఆ కర్మ అమలు చేయించుచున్నది. కర్మ జరుగవలసిన దానిని శరీరముచేత చేయించబడడమే కర్మకరోతి అని చెప్పుకోవచ్చును. ఆ విధముగా శరీరములో గుణములు బుద్ధి మనస్సు చిత్తము అన్నీ కలిసి చేసిన కార్యమును కర్మకరోతి అని బాగా అర్థమైనది. లోపలి నిర్ణయము ప్రకారము బయట జరిగిన పనిని కార్యము అని చెప్పవచ్చును. బయట జరిగిన పని కార్యమ్ అని శ్లోకములో చెప్పబడినట్లు తెలియుచున్నది. బయట జరిగిన కార్యమును నేనే చేశాను అని జీవుడు అహము మాట విని అనుకోవడము వలన కర్మ అను ఫలితము జీవునకు వచ్చుచున్నది. దానినే శ్లోకములో కర్మఫలమ్ అని అన్నారు. నీ ప్రారబ్ధ కర్మ జరుగవలసిన పనిని చేయించుచున్నది. ఏ సమయానికి ఏమి జరుగవలెనో దానినే చేయిస్తున్నది. నీకు జ్ఞానము తెలియని దానివలన కర్మను మరచిపోయి, అహము మాట విని, నేనే చేయుచున్నాను అని అనవసరముగా అనుకొని చింతించడము జరిగినది. జరుగవలసినది జరగకమానదు. ఎవడూ దానిని ఆపలేడు. అది దేవుని చట్టము. నీవు పుట్టినప్పుడే ఒక స్త్రీతో నీవు ఇన్నిమార్లు శరీర సుఖమును అనుభవించవలెనని ప్రారబ్ధకర్మ నిర్ణయమై ఉన్నప్పుడు కర్మ దానిని చేయించును. దానినే కర్మకరోతి అనవలసివచ్చినది. ప్రతి మనిషి పుట్టినపుడు వాని జీవితమునకు సంబంధించిన ఫతకము నిర్ణయింపబడును. దానినే జాఫతకము అని పూర్వము అనెడివారు. నేడు జా ఫతకములో జా ప్రక్కన గల "ఫ" లేకుండపోయి జాతకముగా చెప్పబడుచున్నది. జాతకములో ప్రారబ్ధకర్మ ముందే నిర్ణయించబడియుండును. దానిని విష్ణు, ఈశ్వర, బ్రహ్మ కూడా తప్పించుకోలేరు. కర్మలో ఏదివుంటే అదే జరుగును. తెలిసిన వాడు చెడుపనికి చింతించడు, మంచి పనికి సంతోషించడు. తాను

చేయుచున్నానని అనుకోడు. ఆత్మజ్ఞానము లేనివాడు, శరీరములో జరుగు యంత్రాంగమును తెలియక నేనే చేశాను అని భ్రమించి కొన్ని పనులయందు కృంగిపోవడము, కొన్ని పనులయందు పొంగిపోవడము జరుగుచున్నది.

ఆత్మజ్ఞానము తెలియని దానివలన కర్మచేయించే పనిలో క్రొత్త కర్మ రావడమునే కర్మఫలమ్ అని గీతలో చెప్పడము జరిగినది. జ్ఞానము తెలిసినా తెలియకపోయినా కర్మ కరో, కరో, కరో అని శరీరముచేత చేయిస్తూనే ఉంటుంది. దానిని ఎవడూ మాన్పలేడు. అయితే జ్ఞానము తెలియుట చేత కర్మఫలమ్ అను దానిని లేకుండా చేయవచ్చును. కార్యమ్ కర్మకరో అను దానిని ఎవరూ నిరోధించలేకపోయినా, కర్మఫలమ్ అను దానిని మాత్రము నిరోధించవచ్చును. అనగా ప్రారబ్ధకర్మ నీ శరీరముచేత పనిని చేయించినా, ఆ కార్యములో నీకు పాపముగానీ, పుణ్యముగానీ రాదు. ఒక కార్యము జరుగుటచేత దాని ఫలితముగా పాపముగానీ, పుణ్యముగానీ రావడము సహజము. అయితే దానిని రాకుండా జ్ఞానము వలన చేసు కోవచ్చును. జ్ఞానము అంటే బయటి జ్ఞానముకాదు. శరీరములోని మూడు ఆత్మల జ్ఞానము, అదే త్రైతసిద్ధాంత జ్ఞానము. కర్మను అంటించుకోనివాడు సన్యాసి, కర్మఫలమైన పాపపుణ్యములను విడిపించు కొనువాడు, అంటని వాడు, అంటించుకోనివాడు సన్యాసి అని ముందే చెప్పుకొన్నాము. అదే శ్లోకములో మొదటిలోనే చెప్పిన "అనాశ్రితః" అను పదమునకు కర్మను ఆశ్రయించనివాడనీ, అంటించుకోనివాడని అర్థము. "కర్మకరోతి కార్యమ్ కర్మఫలమ్ అనాశ్రితః" ఇప్పుడు ప్రారబ్ధకర్మ ప్రకారము చేయబడిన కార్యములో వచ్చు కర్మ ఫలితమును అంటనివాడు అని వరుసగా చెప్పవచ్చును. "అనాశ్రితః కర్మ ఫలమ్ కార్యమ్ కర్మకరోతియః" అని చెప్పినా అదే అర్థము వచ్చును. అంటని కర్మఫలము గలవాడే కార్యములను

కర్మప్రకారము చేయునో అని తెలియుచున్నది. ఈ విధముగా శ్లోకము యొక్క మొదటి వాక్యము పూర్తి అర్థమైపోయినది.

ఇక శ్లోకములోని రెండవ వాక్యము గమనించితే "ససన్యాసీచ, యోగీచ ననిరగ్ని ర్నచాక్రియః" అని ఉన్నది. ఈ వాక్యములో ససన్యాసిచ, యోగీచన, నిరగ్ని, ర్నచాక్రియః అని నాలుగు పదములు గలవు. నచాక్రియః అను పదమునకు పనులు చేయనివాడు అని అర్థము. అలాగే నిరగ్ని అనగా అగ్నిలేనివాడు అని అర్థము. ససన్యాసీచ అను పదమునకు నిజమైన సన్యాసి అని అర్థము. యోగీచ న అనగా నిజమైన యోగి కాడు అని అర్థము. శోక్లము యొక్క పూర్తి భావమును చూస్తే కర్మఫలమును ఆశ్రయించక ఎవడు పనులు చేయునో, వాడు నిజమైన సన్యాసి అనబడును. అగ్నిలేనివాడు, పనులు చేయనివాడు యోగి కాడు అని తెలియుచున్నది. త్రైత సిద్ధాంతము ప్రకారము మూడు ఆత్మలను గురించి జ్ఞానము తెలిసిన వానికి శరీరములో ఏ ఆత్మ ఏమి పని చేయుచున్నదో తెలియును. ఆత్మల జ్ఞానము తెలియనిదే శరీరములో జరుగు యంత్రాంగము తెలియదు. ఆత్మల వివరము తెలిసినవాడు తాను ఏమీ చేయలేదనీ, అన్నిటినీ ఆత్మే చేయుచున్న దనీ పూర్తిగా తెలిసియుండును. అలా తెలిసినప్పుడే అహము అణచివేయబడి దానిమాట జీవుడు వినకపోవడము వలన జరిగెడి పనిలో వచ్చు కర్మఫలము కాలిపోవుచున్నది. ఆత్మజ్ఞానము తెలిసినవానికి జ్ఞానాగ్ని అనునది తయారగుచున్నది. కావున కార్యములోవచ్చు ఫలితము అను పాపపుణ్యములు జ్ఞానాగ్నిలో కాలిపోవుచున్నవి. అలా కాలిపోవడము వలన జీవుడు కర్మను ఆశ్రయించనివాడుగా, కర్మను అంటనివాడుగా, కర్మను విడిపించుకొను సన్యాసిగా తయారగుచున్నాడు. అటువంటి వానిని ససన్యాసి అని అనవచ్చును. అగ్నిలేనివాడు అనగా జ్ఞానాగ్ని వలన కర్మలు కాల్చుకోలేని వాడు సన్యాసికాడు, యోగీకాడు.

పనులు చేయుచూ అందులో వచ్చు కర్మయిన పాపపుణ్యములను అంటనివాడు, అంటించుకోనివాడు యోగి అనియూ, సన్యాసి అనియూ అనిపించుకొనుటకు అవకాశము కలదు. ఒకవేళ అతనివద్ద జ్ఞానాగ్ని లేకపోతే, కర్మలు వచ్చి అతనిని అంటుకొనును. కావున వాడు సన్యాసి అనిగానీ, యోగి అనిగానీ అనిపించుకొనుటకు అవకాశము లేదు. జీవితములో పనులు చేయువానిని చూచి, వాని జ్ఞానమునుబట్టి, వీడు సన్యాసి అనియో లేక సన్యాసి కాదు అనియో చెప్పవచ్చును. అసలు పనులే చేయనివానిని యోగి అని చెప్పుటకుగానీ, సన్యాసి అని చెప్పుటకు గానీ వీలులేదు. అదే విధముగా ఆత్మజ్ఞానమే తెలియనివానికి జ్ఞానాగ్నియే ఉండదు, కావున వానిని కూడా సన్యాసి అనిగానీ, యోగి అనిగానీ చెప్పుటకు అవకాశమేలేదు. పనులు చేస్తే కర్మవస్తుంది, పనులు చేయక పోతే కర్మేరాదు. కర్మవచ్చే వానిని ఎంచుకొని చూస్తే, వానికి కర్మ అంటుతూ వుంటే సన్యాసి కాదనీ, కర్మ అంటకవుంటే సన్యాసి అని చెప్పవచ్చును. పనులు చేయని వానిని సన్యాసి అని చెప్పుటకు వీలులేదు.

పనులు చేయుటయందే జ్ఞానము కలిగియుంటే సన్యాసమగుననీ, కార్యములను చేయుటయందే సన్యాసమును పొందవలెననీ, దేవుడు గీతయందు చెప్పియుండగా, మేము సన్యాసులమనీ, మేము పనులు చేయకూడదనీ చెప్పువారిని సన్యాసులు అని అనవచ్చునా అని ప్రశ్నించు కొని చూస్తే, నీటిలో దిగనివాడు నేను తడిసినవాడినని చెప్పడము ఎంత సత్యమో, పనులు చేయనివాడు సన్యాసినని చెప్పడము అంతే సత్యము. నీటిలో దిగనివాడు నేను తడిసిపోయాను అనుట ఎంత అసత్యమో, పనులు లేనివాడు జ్ఞానములేనివాడు నేను సన్యాసినని చెప్పడము అంతే సత్యమగును. పనులు చేస్తూ కర్మను అంటకుండ చేసుకోవడము సన్యాసమని దేవుడు

చెప్పితే, మేము సన్యాసులము, మేము అందరివలె పనులు చేయకూడదు. మేము భార్యతో కాపురము చేయము అని ఎరుపురంగు గుడ్డలు ధరించుకొని ప్రత్యేకముగా కనిపించితే, అది దేవుడు చెప్పినమాటకు వ్యతిరేఖము కాదా! దేవుడు ధర్మములను స్థాపించుటకు భూమిమీదికి అదేపనిగా వచ్చి ఇటువంటి వాడే సన్యాసి, యోగి అని చెప్పితే ఆ మాటను లెక్కచేయకుండా దేవుడు చెప్పిన దానికి వ్యతిరేఖముగా చెప్పుచూ, వ్యతిరేఖముగా ప్రవర్తించుచూ, సన్యాసత్వమంటే ఏమిటో తెలియనివారు మేము సన్యాసులము అంటున్నారు. తాను సన్యాసి కాకున్నా సన్యాసినని చెప్పువారు సన్యాసులుగా చాలామంది కనిపిస్తున్నారు. జ్ఞానాగ్ని లేనివాడుగానీ, కర్మను అంటించుకొనువాడుగానీ సన్యాసిగాడు అని దేవుడు చెప్పితే, భూమిమీద సన్యాసులుగా కనిపించు వారందరు ఆయన మాటకు వ్యతిరేఖముగా ప్రవర్తించుచున్నారు. మూడు ఆత్మల త్రైత సిద్ధాంతము తెలియనంతవరకు ఎవడుగానీ సన్యాసి అని చెప్పుకొనుటకు అర్హుడుగాడు. మీకు ఎక్కడైనా సన్యాసి కనిపించితే అతనికి మూడు ఆత్మల జ్ఞానము తెలియునా అని చూడండి. త్రైత సిద్ధాంత జ్ఞానము తెలియనిదే ఎర్రగుడ్డలు ధరించినా, పనులు చేయకుండా ప్రత్యేకముగా ఉండినా, అతను సన్యాసి కాదనీ, అతను దేవుడు చెప్పిన జ్ఞానమునకు వ్యతిరేఖముగా నడుచువాడనీ తెలియండి.

వ్యక్తి :- లోకములో సాధారణ మనుషులు కాకుండా పెద్దపెద్ద స్వామీజీలు పెళ్ళిళ్ళు చేసుకోకుండా, కొన్ని నియమములను పెట్టుకొని, ఆ నియమముల ప్రకారము అన్ని పనులు చేయకుండా కొన్ని పనులకే పరిమితమై, మూడు ఆత్మల జ్ఞానము ఏమాత్రము తెలియనివారైయుండి, మేము సన్యాసులము అని చెప్పుకొనుచున్నారు కదా! అటువంటి స్వామీజీలను ఏమనాలి?

గురువు :- దేవుని జ్ఞానము శాస్త్రబద్ధమైనది కావున ఎవరికైనా సమానముగా వర్తించును. దేవుని మాటకు వ్యతిరేఖముగా ప్రవర్తించువారు స్వామీజీలుగా ఉండినా, వారు కర్మబద్ధులై శిక్షార్హులై పోవుదురు. సామాన్య మనుషులకు కొందరు పెద్దస్వాములుగా ఉండినా, దేవుని పాలనలోని గ్రహములకు వారు సామాన్యులే అగుదురు. వారి శిక్షనుండి తప్పించుకోవాలంటే, కర్మను అంటకుండా దేవుని పాలనలోని భూతముల గ్రహముల లెక్కలో నిజమైన సన్యాసివి కావాలంటే, ఎంత పెద్ద స్వామీజీ అయినా త్రైతసిద్ధాంతములోని మూడు ఆత్మల జ్ఞానమును తెలియవలసిందే, అలా తెలియని వాడు సన్యాసి కాడు, యోగికాడని తెలియవలెను.

వ్యక్తి :- ఎవరు ఒప్పుకొన్నా గ్రహములు, భూతములు ఒప్పుకోరు అంటున్నారు. సన్న్యాసులు కానివారు తమను సన్న్యాసులని చెప్పుకోవడము వలన వారిని గ్రహములు, భూతములు తప్పక శిక్షించుదురు అన్నారు. గ్రహములు, భూతములు దేవతలను కూడా వదలక అజ్ఞానముగా ప్రవర్తించితే, వారిని కూడా శిక్షింతురు అని చెప్పారు. మీరు చెప్పుచున్న గ్రహములు, భూతములను గురించి ఎవరూ ఇంతవరకు చెప్పలేదు. నాకు తెలిసినంతవరకు చనిపోయినవారు దయ్యములయితే వారినే గ్రహములుగా, భూతములుగా చెప్పుచుండుట విన్నాను. అంతతప్ప మీరు చెప్పునటువంటి గ్రహములను, భూతములను గురించి ఎప్పుడూ వినలేదు. ఇప్పుడు త్రైత సిద్ధాంతము క్రొత్తదే, భూతములు గ్రహములు కొత్తవే. త్రైతసిద్ధాంతము గురించి బాగా అర్థమైనది. అయితే గ్రహములు, భూతములను గురించే పూర్తిగా అర్థముకాలేదు. వాటిని గురించి తెలుపమని కోరుచున్నాను.

గురువు :- గ్రహలు, భూతాలు అంటే దయ్యాలు అని చాలామంది అనుకోవచ్చును. అది వారి తెలియనితనమే. భూతములు గ్రహములను

గురించి కొంతవరకు మా రచనలలోని **"దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు"** అను గ్రంథములో వ్రాయడము జరిగినది. అందరూ అనుకొన్నట్లు దయ్యాలే భూతాలయితే మేము వ్రాసిన గ్రంథములో దయ్యాల భూతాల అని వేరువేరు పదములుగా ఎందుకు వ్రాస్తాము? దయ్యాలకు భూతాలకు నక్కకూ నాగలోకముకు ఉన్నంత తేడా ఉన్నది. మనుషులు, దయ్యాలు దేవుని ఆధీనములో ఉండి పాలింపబడువారు. గ్రహములు, భూతములు కూడా దేవుని ఆధీనములో ఉండి పాలించువారు. దయ్యాలు మనుషులు పాలించబడువారు కాగా, భూతములు, గ్రహములు పాలించు వారు. నీకు బాగా అర్థము కావాలంటే, ప్రజలు ప్రభుత్వము యొక్క పోలికను ఉదాహరణగా చూస్తాము. ఒక రాజ్యమునకు అధిపతిగా రాజువుంటాడు. రాజుయొక్క రాజ్యములో పాలించబడు ప్రజలువుంటారు. ప్రజలను పాలించు పరిపాలన ఉంటుంది. ఒక రాజ్యములోని వారందరిని మూడు భాగములుగా విభజించవచ్చును. ఒకరు రాజు, రెండు ప్రజలు, మూడు పాలకులు. రాజు అంతఃపురములో ఉంటాడు. బయట రాజ్యములో రెండవ భాగమైన ప్రజలూ, మూడవ భాగమైన పాలకులు ఉంటారు. పాలకులలో అనేక తరగతుల వారుందురు. మంత్రులు మొదలుకొని సిపాయిల వరకు పాలకులలోని వారిగా లెక్కించవచ్చును. పాలింపబడు వారు కూడా అనేక రకములవారుందురు. అయినా అందరినీ ప్రజలని అంటున్నాము. అలాగే పాలకులు అనేక హెూదాలుగా, తరగతులుగా ఉన్నా అందరిని కలిపి ప్రభుత్వము అని అంటాము. ఇటు ప్రజలకు, అటు ప్రభుత్వమునకు పెద్దగా ప్రభువు అను రాజు ఉండును. దేవుని రాజ్యము కూడా మూడును ఆధారము చేసుకొని, మూడు భాగములుగా ప్రజలు, ప్రభుత్వము, ప్రభువుగా ఉన్నది.

ప్రజలు తామస, రాజస, సాత్త్విక అను మూడు గుణముల పేర్లతో విభజింపబడియున్నారు. అట్లే ప్రభువు అయిన దేవుడు కూడా క్షర, అక్షర, పురుషోత్తమ అను మూడు పురుషులుగా విభజింపబడియున్నాడు. అలాగే ప్రజలకు ప్రభువుకు మధ్యలోనున్న ప్రభుత్వము (పాలకులు) కూడా మహా, మధ్య, స్వల్ప అను మూడు రకములుగా విభజింపబడియున్నది. మహా భూతములు, భూతములు, స్వల్పభూతములు బయట ప్రపంచములోని పాలనను సాగించుచున్నవి. ప్రభుత్వములోని పాలకులను భూతములనీ, గ్రహములనీ రెండు రకములుగా విభజించవచ్చును. ప్రజలను పాలించడములో గ్రహములు, భూతములు రెండూ పని చేయుచుండినా, వాటి పూర్తి పనితనము నాకు కొంత తెలియునుగానీ, పూర్తిగా తెలియదనియే చెప్పవచ్చును. దేవుని సృష్టిలో జీవమున్న దేనినైనా భూతము అనవచ్చును. వాటినే విడిగా చెప్పుకొంటే మనుషులువేరు, గ్రహములువేరు, భూతములు వేరని చెప్పవచ్చును. అన్ని సృష్టిలోని భాగములే అయినా, ఒక్కొక్కటి ఒక్కొక్క సామర్థ్యమును కలిగియున్నవి. భూతములు, గ్రహములు ఖగోళములో నివసించుచుండును. గ్రహించుకొను విధానమును కలిగియున్న దానిని గ్రహము అనవచ్చును. భూతములు అప్పుడప్పుడు గ్రహములకు సూచనలివ్వగా, దానిని గ్రహములు గ్రహించుకొని పని చేయును. ఖగోళములోని సూర్య, చంద్ర, అంగారక, గురు, శుక్ర మొదలగు గ్రహములన్నియూ అప్పుడప్పుడు భూతముల సూచనలను స్వీకరించి నడుచుకొనుచుండును. గ్రహములు స్థూల ఆకారమును కల్గియుండగా, భూతములు కొన్నిమార్లు కనిపించవచ్చును, కొన్నిమార్లు కనిపించకపోవచ్చును. భూతములకు ఎప్పటికీ ఒకే రూపముండదు. ఎప్పుడైనా కనిపిస్తే వేరువేరు రూపములలో కనిపించవచ్చును. ఉదాహరణకు మేఘము కూడా ఒక

భూతమే. మేఘము ఎప్పటికీ ఒకే రూపములో ఉండదు. ఎప్పటికప్పుడు రూపమును మార్చుకొనుచుండును. గ్రహము ఎప్పటికీ రూపమును మార్చుకోదు. భూతమైన మేఘము గ్రహరూపముగా కూడా మారవచ్చును. అలా మారినది కొద్దిసేపటికే కనిపించకుండా పోవచ్చును. భూతములు మేఘముల రూపములో ఎలా పని చేయుచున్నదీ, పాలనా విధానమును ఎలా సాగించుచున్నదీ ప్రబోధానంద యోగీశ్వరుల రచనలలోని **"దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు"** అను గ్రంథములో కొంతవరకు వివరించారు. భూతములు, గ్రహములు మనుషులను ఎలా పాలించు చున్నవో, మనుషులు చేసిన తప్పులకు ఎలా శిక్షలు విధించుచున్నవో ఒక యదార్థ సంఘటన ద్వార తెలుసుకొందాము.

మొట్టమొదటి భారతీయ అంతరిక్ష యాత్రికురాలు కల్పనాచావ్లా పేరు విననివారుండరు. భారతీయ మహిళా సాహసానికీ, మేధస్సుకూ చిహ్నముగా నిలిచిపోయిన పంజాబ్ రాష్ట్రమునకు చెందిన కల్పనాచావ్లా, అమెరికా దేశానికి చెందిన అంతరిక్ష పరిశోధనా సంస్థ NASA (నాసా) లో పని చేసేది. అంతరిక్షములోనికి ప్రయోగించిన కొలంబియా స్పేస్‌షిప్‌లో ఇతర పాశ్చాత్య అంతరిక్ష యాత్రికులతోపాటు అంతరిక్ష యాత్రలో పరిశోధకురాలిగా పాల్గొని అంతరిక్షములోనికి ప్రయాణించింది. ఆకాశము లోనే కొంతకాలము గడిపి పరిశోధన సాగించిన తర్వాత కొలంబియా స్పేస్‌షిప్ భూమికి తిరుగు ప్రయాణము మొదలుపెట్టింది. 2003వ సంవత్సరము ఫిబ్రవరి 1వ తేదీన ఇంకో పదహారు (16) నిమిషములలో భూమిమీద దిగబోతున్న కొలంబియా స్పేస్‌షిప్ దురదృష్ట వశాత్తు ఊహించని పరిణామముల వలన, ఆకాశములోనే భూమి వాతావరణములోనికి ప్రవేశిస్తూనే ప్రేలిపోయింది. దానితోపాటు అందులో ప్రయాణిస్తున్న

అంతరిక్ష యాత్రికులందరూ చిన్నచిన్న ముక్కలై చనిపోయారు. భారతీయ వ్యోమగామి కల్పనాచావ్లా కూడా ఆ ఘోర ప్రమాదములో ప్రాణాలు కోల్పోవడము జరిగింది. అయితే ఆమె తిరిగి కొద్ది రోజులకే భూమి మీద పుట్టడము జరిగింది.

కల్పనాచావ్లా తిరిగి పుట్టిన సమాచారమును (ఎస్.బి.యన్ 7) ఛానల్ మరియు ఇండియాటుడే పత్రిక, కల్పనాచావ్లా మళ్ళీ జన్మించిన కథనాన్ని ప్రసారము చేసి ప్రపంచానికి అందించడము జరిగింది. ఆ వివరాలను చూస్తే, ఉత్తర భారతదేశములో ఉత్తరప్రదేశ్ రాష్ట్రములోనున్న బుల్లంద్ షహర్ అనే గ్రామములో రాజ్‌కుమార్ అనే సాధారణ వ్యవసాయ కూలీగా పని చేయుచున్న వ్యక్తి కుటుంబములో అతనికి కుమార్తెగా జన్మించింది. 2003వ సంవత్సరము మార్చి 23వ తేదీన ఉపాసన అను పేరుతో ఆ కుటుంబమున కల్పనాచావ్లా జన్మించడము జరిగింది. ఉపాసన (కల్పనాచావ్లా)కు నాలుగు సంవత్సరాల వయస్సులో మాటలు వచ్చాయి. మాట్లాడడమును ప్రారంభించిన ఉపాసన, తాను గతజన్మలో కల్పనాచావ్లా అను పేరుగల అంతరిక్ష పరిశోధకురాలిననీ, తన తండ్రి పేరు బనార్సీదాస్ యనీ, నాలుగు సంవత్సరముల క్రితము తాను తోటి అంతరిక్ష పరిశోధకులతో కలిసి ఒక విమానములో ఆకాశమునుండి దిగివస్తుండగా, తమ విమానానికి ప్రమాదము జరిగి తామందరము చనిపోయామని చెప్పడము జరిగింది.

గత జన్మ వివరాలను పూసగ్రుచ్చినట్లు చెప్పుచున్న ఉపాసన (కల్పనా చావ్లా) యొక్క పేరు ఉత్తరప్రదేశ్ రాష్ట్రమంతా క్రమంగా తెలిసి పోయింది. ప్రస్తుతము ఉత్తరప్రదేశ్‌లోని ఎత్వా జిల్లాలోని "పఠా" అనే గ్రామములో కూలి పని చేసుకొంటున్న తండ్రి రాజ్‌కుమార్‌తో పాటు జీవిస్తున్న

ఉపాసన తనను ఇంటర్వ్యూ చేయడానికి వచ్చిన ప్రపంచస్థాయి మీడియా ప్రతి నిధులతో మాట్లాడుచూ, మేము భూమిమీదకు తిరిగి వస్తున్న అంతరిక్ష నౌకకు ఆకాశములో సంచరిస్తున్న ఒక పెద్ద మంచుగోళము గుద్దుకున్నదనీ, దానివలన తమ అంతరిక్షనౌక ప్రేలిపోయి అందులోని తామందరమూ చనిపోయామనీ చెప్పినది. 2003వ సంవత్సరము ఫిబ్రవరి 1వ తేదీన నాసాకేంద్రము వారు అంతరిక్ష నౌకకు బయటప్రక్కన చుట్టు అమర్చిన ప్లేట్లు ఊడిపోయిన దానివలన ఆ నౌక భూమి వాతావరణము లోనికి వస్తూనే వాతావరణ రాపిడి వేడికి ప్రేలిపోయిందని చెప్పారు. నాసావారను కొన్నట్లు అక్కడ జరగలేదనీ, ఆకాశములో భూమికి 70 కిలోమీటర్ల దూరములోనే మంచుగోళమునకు అంతరిక్షనౌక గుద్దుకోవడము వలన ప్రమాదము జరిగిందని ప్రత్యక్ష సాక్షి అయిన కల్పనాచావ్లా చెప్పడము వలన తెలిసిపోయింది.

మంచుగోళము రూపములో రాకెట్‌ను ఢీకొట్టినది ఒక భూతమని మా పరిశోధనలో అర్థమైనది. నేడు భూమిమీద అనేక చోట్ల జరుగుచున్న ప్రయాణములలో ప్రమాదములకు కారణము కొన్ని భూతములు, కొన్ని గ్రహములని తెలియుచున్నది. మా సర్వేలో దేవాలయములకు రాక పోకల ప్రయాణములలోగానీ, వివాహములకు వచ్చునపుడుగానీ, తిరిగి పోవునప్పుడు గానీ, ఎక్కువ ప్రమాదములు జరగుచున్నవి. ఎక్కడైనా రోడ్డు ప్రమాదము జరిగింది అంటే అది పెళ్ళి వాహనమైనా అయివుంటుంది, లేక దేవతలకు పోవు వాహనమైనా అయివుంటుంది. దేవాలయముల ప్రయాణములు, పెళ్ళిళ్ళ ప్రయాణములు సరిపోని భూతములు, గ్రహములు కొన్ని గలవు. అందువలన వారు ప్రయాణములోనే శిక్షించుదురు. కల్పనాచావ్లాది అటువంటి ప్రయాణము కాకపోయినా, ఇతర కారణముల

వలన భూతములే అలా చేశాయి. భూతములు, గ్రహములు ఆదిలో సూర్యుడు చెప్పినప్పుడు త్రైత సిద్ధాంతమును విని తెలిసియుండడము వలన, అవి సంపూర్ణమైన జ్ఞానమును కల్గియున్నవి. అందువలన ఏమాత్రము దైవజ్ఞానములేని వివాహములు, తీర్థయాత్రలు భూతములకు సరిపోవు. ఆ కార్యములు రెండు పూర్తి అజ్ఞాన కార్యములుగా తలచుట వలన, వారు ప్రయాణములలో చాలామందిని ప్రమాదములరూపములో చంపివేయు చున్నారు. బయట జరుగు ఘోరాతి ఘోరమైన ప్రమాదములన్నీ గ్రహముల వలన భూతముల వలననే జరుగుచున్నవని తెలియాలి.

భూమిమీద మనిషి ముఖ్యముగా మూడు బలములతో బ్రతుకు చున్నాడు. ఒకటి బుద్ధి బలము, రెండవది శరీర బలము, మూడవది ధన బలము. ఈ మూడు బలములు మానవుని గతజన్మ కర్మను అనుసరించి కలగుచుచుండును. ఈ మూడు బలములు లేనివారు అప్పుడప్పుడు దేవున్ని గురించి చింతించుచుండును. అయితే ఈ మూడు బలములున్నవారు దేవున్ని గురించి ఏమాత్రము అనుకోరు. అటువంటివాడు దైవమును, దైవజ్ఞానము తెలిసినవారిని లెక్కపెట్టుకోక అవమానించు స్వభావము కలిగి యుందురు. ఒకవేళ భక్తియున్నా అది దైవము మీద కాకుండా చిల్లర దేవుళ్ళ మీద ఉండును. అటువంటి వారు జ్ఞానుల ఎడల అమానుషముగా ప్రవర్తించుచుందురు. అటువంటి వారిని తర్వాత జన్మలో భూతములు గ్రహములు దయ అనునది ఏమాత్రము లేకుండా హింసించుదురు. రోగము ఒక భూతమే, అందువలన రోగముల రూపములో బాధించుదురు. భూతములు, గ్రహములు తమ పాలనలో అజ్ఞానులనూ, దేవుని బోధకు వ్యతిరేఖముగా చెప్పినవారినీ, దేవుడు చెప్పిన సన్న్యాసము కానిదానిని సన్న్యాసమని చెప్పుచూ సన్న్యాసులుగా మారియున్న వారినీ తప్పక

శిక్షింతురు. అటువంటివారి ఎడల తమ పాలనను కఠినతరము చేయుదురు. భూమిమీద జరుగు భూకంపములు, సునామీలు, అగ్నిపర్వతముల ప్రేలుడు మొదలగు పెద్దపెద్ద హింసారూపములన్నియూ ఖగోళములోనున్న భూతముల, గ్రహముల పనులేనని ఎవరికీ తెలియదు. టోర్నడోలువంటి సుడిమేఘముల విధ్వంసము, క్యుములోనింబస్ అను పొగమేఘముల అతి వర్షము, వరదల భీవత్సములులాంటి చర్యలన్నీ భూతముల, గ్రహముల కార్యములని ఎవరికీ తెలియదు. త్రైత సిద్ధాంత జ్ఞానమును తెలియకుండా దానికి వ్యతిరేఖముగా మాట్లాడువారినందరినీ కట్టకట్టి చంపుచున్నవి. భూమిమీద ఎందరో శాస్త్రజ్ఞులు భూకంపములను గురించి, సునామీలను గురించి, టోర్నడోలు అను సుడిమేఘములను గురించి, క్యుములోనింబస్ మేఘములను గురించి ఎన్నో పరిశోధనలు చేయుచున్నారు. అయినా ఇవన్నియు శక్తివంతమైన భూతముల, గ్రహముల వలన జరుగుచున్నవని ఎవరూ తెలియలేక పోవుచున్నారు.

భూమిమీద పంటలు పండడమూ, వర్షములు రావడమూ, కరువు కాటకములు ఏర్పడడమూ, రోగములు విజృంభించడమూ మొదలగు చర్యలన్నీ భూతముల, గ్రహముల పనేననీ వారి పరిపాలనేయనీ ఎవరికీ తెలియదు. ప్రపంచములో ఎన్నో కార్యములకు కారణమై భూమండలమంత టినీ పాలించు గ్రహములు, భూతములు త్రైత సిద్ధాంత జ్ఞానమును సంపూర్ణముగా తెలిసినవారని ఎవరికీ తెలియదు.

వ్యక్తి :- త్రైత సిద్ధాంత జ్ఞానము ఏ మనిషికీ తెలియనప్పుడు, ఏ మనిషీ దానిని ఇతరులకు చెప్పలేడు. అటువంటపుడు త్రైత సిద్ధాంతమంటే ఏమిటో ఎవరికీ తెలియదు కదా! ఎప్పుడో కొన్ని వందల, వేల సంవత్సరములప్పుడు దేవుడు భగవంతునిగా వచ్చి చెప్పినప్పుడు, ఆ కాలములో ఉన్నవారికే అది

ఏమిటో అర్థము కానప్పుడు ఇప్పటికాలములోని మనుషులకు అది ఎలా తెలుస్తుంది. నేడు మనుషులకు త్రైత సిద్ధాంత జ్ఞానమును చెప్పేవాడే లేనప్పుడు ఇప్పటి ప్రజలను అజ్ఞానులని గ్రహములు, భూతములు హింసించడము న్యాయమేనా? నాకు చెప్పితే విననప్పుడు నాది తప్పగును. త్రైత సిద్ధాంతమును మొదటికే ఎవరూ చెప్పనిదే నాకు తెలియదు కదా! అలాంటపుడు త్రైత జ్ఞానము తెలియనిది నా తప్పగునా? చెప్పండి.

గురువు :- నీవు అడిగిన ప్రశ్న బాగానే ఉన్నది, కానీ నీ ప్రశ్నలో సత్యము లేదు. అది తెలియకనే నీవు అడుగుచున్నావు. ఇప్పుడు నీకు తెలియనిదీ, నీవు మరచిపోయిన సత్యమూ ఏమనగా! దేవుడు ద్వాపరయుగము చివరిలో, దాదాపు కలియుగము మొదటిలో భగవంతునిగా వచ్చి ప్రకృతి గురించి, మూడు ఆత్మల జ్ఞానమును గురించి చెప్పినప్పుడు భూమిమీద నీవు మనిషిగానే ఉన్నావు. ఆ రోజు భగవంతుడు చెప్పిన జ్ఞానమును అశ్రద్ధతో వదలి వేశావు. తర్వాత అక్కడ చచ్చి మరొక చోట పుట్టుతూ రావడము వలన వెనుకటి జన్మల జ్ఞాపకములు తెలియకుండాపోయాయి. అందువలన నాకు ఎవరూ జ్ఞానమును చెప్పలేదు అంటున్నావు. తర్వాత భగవంతునిగా వచ్చిన దేవుడు రెండవమారు కూడా తన జ్ఞానమును చెప్పాడు. ఆ దినము గానీ, అంతకు ముందుగానీ, మానవులందరికీ అవసరమైన జ్ఞానమును చెప్పి దానినే గ్రంథరూపము చేసి అందరికీ తెలియునట్లు చేశాడు. శ్రద్ధ గలవాడు ఎవడైనా అరుదుగా దేవుని జ్ఞానమును తెలుసుకోగలుగుచున్నాడు. శ్రద్ధలేనివాడు తెలుసుకోవడము లేదు. మనుషుల కొరకు దేవుడే మనిషిగా అవతరించి జ్ఞానమును చెప్పితే, అంతటి గొప్పవాడు చెప్పిన జ్ఞానము మీద శ్రద్ధ చూపకుండా, ఇప్పుడు నాకు చెప్పలేదే అనడము నీకు న్యాయమా అని నేను అడుగుచున్నాను. దేవుడు మూడవమారు తన పరిపాలనలో

పని చేయుచున్న జిబ్రయేల్ అను దూత ద్వారా జ్ఞానమును చెప్పించాడు. దానినే గ్రంథరూపము చేసి ఇచ్చాడు. ఆ విధముగా చెప్పినది ప్రజలందరికీ చెప్పినది కాదా! గ్రంథములుగా కనిపిస్తున్న జ్ఞానము ప్రజలందరికీ తెలిపినది కాదా! ప్రజలలో నీవు ఒక వ్యక్తివి అయినప్పుడు గ్రంథములలో చెప్పిన దానిని తెలుసుకొని జ్ఞానివి ఎందుకు కాకూడదు? జ్ఞానము ప్రకారము ఎందుకు నడుచుకోకూడదు? నీకు శ్రద్ధలేక పైగా నాకు చెప్పలేదనడమేమిటి?

నేటికినీ దేవుడు చెప్పిన జ్ఞానము ఆయా మతములవారికి, ఆయా మతగ్రంథములలో సంపూర్ణముగా ఉన్నది. అయితే ఆ గ్రంథములను అడ్డము పెట్టుకొని మేము జ్ఞానులము అనుకొనువారు ప్రజలను తప్పుదారి పట్టించు చున్నారు. వాస్తవానికి మూడు గ్రంథములలోనున్న త్రైత సిద్ధాంతము మూడు ఆత్మలను గురించి చెప్పినదని తెలియక, ఆయా మతములవారు మూడు భాగములుగా మూడు ఆత్మలుగానున్న దైవమును వదలి, వారివారి మతములనూ, మత నియమములను బోధించుచూ, మతములో మనుషుల సంఖ్యను పెంచుకోవాలని చూస్తున్నారు. ఈ రోగము జాఢ్యములాగ అన్ని మతములలో చోటు చేసుకొని ఉన్నది. అందువలన మనుషులలో మత జ్ఞానము పెరిగినదిగానీ, మూడు ఆత్మల జ్ఞానము తెలియకుండా పోయినది. ఈ కాలములో లోకమునకంతటికీ వ్యతిరేఖ బోధగాయున్న, అన్ని మతము లలోని మత పెద్దలకు సరిపోని విధముగానున్న త్రైతసిద్ధాంత జ్ఞానమును దేవుడు నా చేత అందరికీ జ్ఞాపకము చేయించుచున్నాడు. అయితే సంస్కార బలమున్న కొందరికి వారి గ్రంథములోనున్న త్రైత సిద్ధాంతమునకు సంబంధించిన వాక్యములు కొద్దికొద్దిగా అగుపడుచున్నవి. సంస్కారముగానీ, శ్రద్ధగానీ లేని చాలామందికి, వారి మూల గ్రంథములోనున్న దైవ వాక్యమైన త్రైత సిద్ధాంత జ్ఞానము ఏమాత్రము కనిపించడము లేదు.

నేను ఒక గురువుగా నీలాంటి వారికి త్రైత సిద్ధాంతమును జ్ఞాపకము చేయించుచున్నాను. అయితే గురువును కూడా కానని చెప్పుకొను ప్రభోధానంద యోగీశ్వరులు తన జ్ఞానమునంతటినీ త్రైత సిద్ధాంతము మీదనే ఆధారము చేసి అనేక గ్రంథ రూపములలో వ్రాశాడు. హిందూ మతములోనున్న ఆయన త్రైత సిద్ధాంత భగవద్గీత అను పేరుతో భగవద్గీతను వ్రాసి అందులో మూడు ఆత్మలను వివరముగా చూపాడు. దేవుని సేవ అంటే దేవుని జ్ఞానమును ప్రచారము చేయడమే నిజమైన దైవసేవ అని చెప్పు ఆయన, గత నలభై సంవత్సరములుగా త్రైత సిద్ధాంతమునే బోధిస్తుండగా, ఇప్పుడు నీవు నాకు జ్ఞానము చెప్పేవారు లేరు అనడము నీకు న్యాయమా అని అడుగుచున్నాను. నేడు ఎందరో స్వామీజీలు సన్న్యాసులుగా ఉంటూ సన్న్యాసత్వమునకు ఒక వేషమును, కొన్ని నియమములను కల్పించుకొని ఉన్నారు. అలా ఉండడము భగవద్గీతలో దేవుడు చెప్పిన జ్ఞానమునకు పూర్తి వ్యతిరేఖమని ఒక ప్రక్క మేము గురువులుగా ఉండి చెప్పినా, మరొక ప్రక్క ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు చెప్పుచున్నా ఏమాత్రము లెక్క చేయనివారున్నారు. అంతేకాక తమ బోధలుగానీ, ఆచరణలుగానీ భగవద్గీతా జ్ఞానమునకు వ్యతిరేఖముగా ఉన్నాయని అనుకోవడములేదు. ఒకవైపు మేము కూడా గీతా బోధకులమని చెప్పుచూ భగవద్గీతను అశాస్త్రీయముగా బోధించుచున్నారు. వారు చెప్పు గీతలో శ్లోకము సత్యముగా ఉంటుంది, కానీ శ్లోక భావము పూర్తి శాస్త్రబద్ధత లేకుండా ఉంటుంది.

ఉదాహరణకు భగవద్గీత ఆత్మ సంయమ యోగములో మొదటి శ్లోకమునందు నిరగ్ని, యోగిన అని చెప్పియుండగా దాని భావమును స్థూలముగా చెప్పితే అగ్నిలేనివారు యోగి కాదు అని కలదు. అయితే

ఇక్కడ అగ్ని అంటే ఏ అగ్గి అని తెలియనివారు, శాస్త్రబద్ధత లేకుండా అగ్నిహోత్రము చేయనివాడు, యజ్ఞము చేయనివాడు అని చెప్పారు. శ్లోకములో చెప్పిన అగ్నిని సూక్ష్మభావముతో తీసుకోకుండా, స్థూల భావముతో చెప్పుట వలన కనిపించు అగ్నిని గురించి యజ్ఞములు అన్నారు. ఆ లెక్క ప్రకారము కనిపించు అగ్నిని గురించి చెప్పితే వారమునకు ఒకమారో, నెలకు ఒకమారో యజ్ఞములు చేయువారికంటే, నిత్యమూ దినమునకు మూడుమార్లు స్టౌ మీద అగ్నిని మండించువాడు గొప్పగును. వానికంటే పది నిమిషములకొకమారు సిగరెట్‌ను ముట్టించి అగ్నిని నిమిష నిమిషము రగుల్చువారు గొప్పగుదురు. ఇటువంటి అర్థములు మనుషులు చెప్పుకుంటారను ఉద్దేశ్యముతో దేవుడు గీతలో విశ్వరూప సందర్శన యోగమున 48వ శ్లోకమున, 53వ శ్లోకమున యజ్ఞములకు నేను తెలియబడను అని చెప్పాడు. దేవుడు ఆ మాటను చెప్పినా దానిని పెడచెవిన పెట్టువారు కలరు. అటువంటి వారు యజ్ఞములు చేయనివారు సన్న్యాసులు, యోగులుకారని 'సస‌న్న్యాసీచ, యోగీచన నిరగ్ని ర్నచాక్రియః' అను వాక్యమునకు అశాస్త్రీయ భావమును చెప్పుచుందురు.

దేవుని జ్ఞానము త్రైత సిద్ధాంతము ప్రకారము స్థూల సూక్ష్మములుగా ఉన్నదనీ, అందులో స్థూలముగా ఒక భాగముండగా, సూక్ష్మముగా మూడు భాగములున్నదనీ దేవుడు చెప్పిన గ్రంథ ప్రమాణములలో తెలియుచున్నది. అలా దేవుడు చెప్పినా, నిరగ్ని అనగా కనిపించని జ్ఞానాగ్ని అని తెలియని వారు, పూర్తిగా శాస్త్రీయతలేని వారగుదురు. అంతేకాక దేవుని మాటకు వ్యతిరేఖముగానున్నవారగుదురు. జ్ఞానాగ్ని వలన కర్మలు కాలిపోవునని దేవుడు చెప్పిన మాటను మరచిన వారగుదురు. నేడు సూక్ష్మముగా దేవుని జ్ఞానమును చెప్పువారికంటే, స్థూలముగ చెప్పువారే ఎక్కువగా ఉన్నారు.

ఒకవేళ ప్రబోధానంద యోగీశ్వరులటువంటివారు సత్యమును గ్రంథములలో వ్రాసినా, నాలాంటి వారు బోధగా చెప్పినా, ఏమాత్రము వినకుండా పైగా మమ్ములనే హేళనగా మాట్లాడు వారు కలరు. అటువంటివారిని భూతములు గ్రహములు బాగా గుర్తించుకొనును. సమయమొచ్చినప్పుడు వారు ఎంతటి వారినైనా శిక్షింపకమానరు. అందువలన ఆయా మతములలో తమతమ గ్రంథములను బోధించువారు భయముతో బోధించాలి. సూక్ష్మజ్ఞానమును స్థూలముగా బోధించితే, సంపూర్ణ జ్ఞానము తెలిసిన భూతములు, గ్రహములు ఊరకవదలరు. కావున ప్రతి బోధకుడూ, ప్రతి స్వామీ భూతముల భయము కల్గి లేక దేవదూతల భయముకల్గి జ్ఞానమును సక్రమముగా బోధించాలని తెలుపుచున్నాను. వినే నీలాంటి వారుకూడా స్థూల సూక్ష్మ తారతమ్యములను దృష్టిలో పెట్టుకొని వినవలెను.

వ్యక్తి :- గురువుగారూ! మీరు ఇంతవరకు బోధించిన బోధవలన నాలోని సంశయములన్నీ తీరిపోయినవి. త్రైత సిద్ధాంతమంటే ఏమిటో బాగా అర్థమైనది. ఇప్పటినుండి ప్రకృతి స్థూలమైనదనీ, పరమాత్మ సూక్ష్మమైన వాడని దృష్టి కలిగి, సూక్ష్మముగానున్న జీవాత్మ, ఆత్మ, పరమాత్మలను గురించి లేక క్షర, అక్షర, పురుషోత్తమ అను ముగ్గురిని గురించి తెలుసుకొంటాను, ఇతరులకు కూడా తెలియజేస్తాను.

***** సమాప్తము *****



***అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము గాదు,***

***సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము గాదు.***

